# అజంతా





మూలం:

ఇ. థియోడర్ కింగ్



నవోదయ పబ్లిషర్స్,

విజయవాడ-2.

జీవితంలో అనుకోని సంఘటనలు జరగటంతో వైరాగ్యం చెంది బౌద్ధ భిక్షువులుగా మారిన విచిత్ర వ్యక్తుల ప్రణయ గాథల్నీ ప్రగాఢవిశ్వాసాల్నీ మనోహరంగా చిత్రించిన న వ ల.

# తొలిపలుకు

అజంతా కేవలం ఒక నవలమాత్రమే కాదు. మానవ జీవితంలో అడుగడుగునా ఎదురయ్యే విచిత్ర సంఘటనల సంఘర్షణలవల్ల కలిగే పరిణామాలు - మానవుల గమనాన్ని ఎలా మార్పు చేస్తాయో, సామాన్య మానవుల్నిసైతం మహిాత్ముల్ని ఎలాచేస్తాయో నిరూపిస్తూ, మానవుని హృదయాకాశంలో స్వర్గనరకాల రెంటినీ సృష్టించి, వాటి తారతమ్యాన్ని రూపొందించి - నైతిక విలువల ప్రభావాన్ని స్పష్టంగా-కళ్లకు కట్టినట్లు చిత్రించే విచిత్రసంఘటనల సంగమం యీ 'అజంతా'. జీవితంలో అనుకొనని సంఘటనలు జరగడంతో బౌద్ధభిక్షువులుగా మారిన విచిత్రవ్యక్తుల ప్రణయగాథల్నీ, ప్రగాఢ విశ్వాసాల్నీ మనోహారంగా చిత్రించబడిన నవల-యీ అజంతా.

ఈ నవలను తెలుగు ప్రజానీకం చదివి ఆనందించి, అనుభూతి నొందేలా చేసే అవకాశం నాకు కల్గించిన మిత్రుడు శ్రీ 'థియోడార్ కింగు'కు నాహృదయపూర్వక ధన్యవాదాలు.



# స మ ర్ప ణ

నిష్కళంక ప్రజాసేవా
తత్పరుడూ, ప్రముఖ సహ
కారోద్యమ రథసారథీ, ప్రఖ్యాత
లలితకళా పోషకుడూ, కవికులాలంకార
బి రు దాం కి తు డూ అ యి న

శ్రీ జవ్వాది లక్ష్మయ్య నాయుడు (M. L. A.)
గారికి హృదయాంజలి ఘటిస్తూ సమర్పిస్తున్నా.



4

# ఆజంతా

వాఘురానది చాలా లోతుగా, బాగా వెడల్పుగా వుంది. అది ప్రవహించేటప్పుడు దాని వేగంవల్ల వచ్చేధ్వని వొడ్డున వుండిచూచేవారికి వింతభయాన్నికలిగిస్తోంది. వాఘురా దట్టమైన కీకారణ్యాలనడుమ, బీటలువారిన భూముల్ని నిర్దయగా కోసుకుపోతూ ప్రవహిస్తోంది. చిన్నచిన్న కొండ గుట్టల్నిసైతం చీల్చుకో మరిపోతోంది.

అదొక నర నివాసంలేని మైదానప్రాంతం. దట్టమైన భయంకరారణ్యం కనుచూపుదూరంలోనేవుంది. వాఘురా కూడా అటేపోతూ పెద్ద అఖాతంలా కన్పిస్తోంది. ఆ అరణ్యాని కావల ఎత్తైనకొండలు....మంచు దట్టంగాపట్టి చూపరులకెంతో ముచ్చటగొల్పేసోయగం ముప్పిరిగొనివుంది.

నదివొడ్డున నుంచుని ప్రకృతి మేలిముసుగుల్ని పరికిస్తున్న బదరీనారాయణ, తనచేతిలోవున్న కర్రనూ, చిన్నమూటనూ క్రిందపడేశాడు. అమృతతుల్యమైన ఆప్రకృతి శోభప్రాంగణపు వంపుల సొంపులు తిలకించడంలో కార్చిచ్చులామండే తనహృదయం కొంతచల్లబడినట్లు ఒక నిట్టూర్పు విడిచాడు. జలజలాపారే నదీప్రవాహంపై దృష్టిమళ్ళింది. అతని నేత్రాల్లో నూతన కాంతులుద్భవించాయి. గబగబ దుస్తులు విడిచేశాడు.

బదరీనారాయణ పాతికేళ్ళయువకుడు. మనిషి పల్చగా వుండటంవల్ల పొడగరనిపిస్తాడు. మంచి అందగాడు. పండిన గోధుమల్లా, దేహకాంతి బంగారుఛాయగా వుంటుంది. కళ్లు రెండూ కొండలప్రక్క లోయలవలె కనుబొమల క్రింద లోతుగా కుంకుమ భరిణల్లా, అందంగా, చూడముచ్చటగా వుంటాయి. అవి కాటుక కళ్ళు! నిశితంగా చూచే నేర్పూ చూచిన మరుక్షణమే ఆకళింపుచేసుకోగల శక్తి వాటికుంది. పొడవైన ముక్కు; పెద్ద నాసికా రంధ్రాలు; ధనుర్బాణాకృతి కల్గిన పెదవులు; కలలో దిగ్భ్రమగావించే దివ్యపురుషుని ముఖాకృతి వలె తీర్చిదిద్దిన అతని ముఖము; పొడవైన శిరోజాలు.... కొన్ని బుజాలమీద పడుతూ, మరికొన్ని తలపై ముడివేయబడి ఋషిపుంగవుని మరపిస్తున్నాయి

అతని శరీరం కండలు మెలితిరిగిన దేహం కాకపోయినా, సున్నితమైన అవయవాల సంగమం, దేహపుష్టికి తగిన బలం వున్నవాడే. అతనొకసారి చూడటంతోటే సమరానికి సంసిద్ధుడైన యోధుడనిపిస్తాడు.

నగ్నంగా నుంచుని, విడిచిన బట్టల్ని, కాళ్ళనున్న చెప్పుల్ని మూటదగ్గరకు కాళ్ళతో తన్నాడు.

గభాలున, నీళ్ళలోకి ఉరికాడు. బాణంవలె చొచ్చుకుపోయాడు నదిలో ఒకేతీరుగా ప్రవహిస్తున్న నీరు అల్లకల్లోలమై ఛీత్కృతి నలువైపులకూ పరుగెత్తినట్లు, అలలై ఆ వొడ్డుకూ, యీ వొడ్డుకూ ఢీకొనసాగింది.

ప్రశాంతంగా, హాయిగా, కొంతసేపు అతడు నీళ్ళల్లో యీదాడు.

కొంతసేపయ్యాక వొడ్డుకొచ్చాడు. తడి ఆరేవరకూ నుంచున్నాడు. మూటదగ్గర కొచ్చాడు విడిచేసిన బట్టల్ని, నీళ్ళల్లోగుంజి, శుభ్రంగా పిండేసి, ప్రక్కనే పసిరికమీద ఆరేసి, గాలికి ఎగిరిపోకుండా నాలుగువైపులా నాలుగురాళ్ళు బరువు పెట్టాడు. అప్పుడు మూటలోనుంచి ఉతికివున్న బట్టల్ని తీసి ధరించాడు.

మూటప్రక్కన కూర్చుని, మూటలో మిగిలివున్న కొద్దిపాటి తినుబండారాన్ని తిని, నదిలో నీళ్ళు త్రాగాడు. పశ్చిమాన సూర్యుడస్తమిస్తున్నాడు. అరుణారుణ కాంతి ఆకాశాన్నావరించింది. కొంచెంసేపు విశాలాకాశ ధరించిన సింధూరాన్ని నిశ్చలంగాచూశాడు. తరువాత కొంచెంసేపటికి అక్కడే నేలమీద మేను వాల్చాడు.

పచ్చని పసిరికమీద హాయిగా, స్వేచ్ఛగా పడుకొన్నాడు. మరికొంచెం సేపట్లో గాఢనిద్రలో లీనమయ్యాడు. నిద్రలో పగలనుభవించిన అలసటంతా మరచిపోయాడు. తను ఏకాకిననీ, తనకేమైనా ప్రమాదం వస్తుందేమో అనే సందేహాన్నికూడా తలపోయకుండా నిర్భయంగా నిద్రపోయాడు.

అతను లేచేసరికి తూర్పుదిక్కున భాస్కరుడు తన అరుణ కిరణాలను ప్రపంచంపైకి పంపి, వెలుగుల్ని పునీతం చేస్తున్నాడు. భానుని లేతకిరణాలు, దట్టంగా పడుతున్న మంచును క్రమంగా మాయంచేస్తున్నాయి. ఆరేసిన బట్టల్ని మడతపెట్టి మూటకట్టి వీపుమీద పెట్టుకొని మళ్ళీ బయలు దేరాడు ఇప్పుడు బడలికలేని ప్రయాణం ఆనందంగా వుంది. ఆ ఆనందంలో అతని పెదవులు ఒకపాటను పలువరిస్తు

న్నాయి. గొంతు ఖంగుమని ధ్వనిస్తోంది. అలా ప్రయాణిస్తూ ఆ మైదానందాటి, కీకారణ్యం సమీపించాడు. మధ్యాహ్న మయింది. ఎండ తీవ్రత హెచ్చుగావుంది. ఆ ఎండలోనే కూర్చున్నాడు. కాని ఊరటానికి తన మాటలో ఏమీ లేదని తెలుసు. అందువల్ల అడవిలో ప్రవేశించాడు ఏదో పండు కనుపించింది. అతని ఆకలి రుచి ఎరిగే స్థితిలోలేదు దానిరుచీ పచీ తనకు తెలియకపోయినా తినేశాడు.

అడవిలోపడి నడచిపోతున్నాడు. ఉవ్వెత్తుగా పెరిగిన పచ్చగడ్డి దుబ్బుల్ని చీల్చుకుంటూ, తుప్పల్ని దాటుకుంటూ ముళ్ళకంచెల్లో ప్రాకుతూ, చుట్టుకునే తీగెల్ని, కాడల్ని విడదీసికుంటూ వెళ్ళిపోతున్నాడు. ఆ ప్రయాణ మెక్క-డికో తనకే తెలియదు. అలాంటి భీకర ప్రదేశాల్లో ప్రయాణం చేయడం ప్రమాదకరమని తెలుసు. అయినా భయపడ లేదతను, వెళ్ళిపోతున్నాడు ముందుకు. దారిలో తన కెదురుగా చెట్టుకొమ్మను చుట్టువేసుకుని వున్న నొక కొండచిలు! ఇంకేముంది? ...గుండె గుభేలుమంది. అయినా తమాయించుకోగలిగాడు. క్రూరమృగాల గర్జనలు, గాండ్రింపులు, రొదలు చెవుల్లో ఘూర్ణిల్లుతున్నాయి. వెలుతురు క్రమంగా సన్నగిల్లుతోంది. మేఘమండలాన్ని చుంబించే ఎత్తయిన చెట్లు దినకరుని దర్శనాన్ని దూరం చేశాయి. పొదల్ని, తుప్పల్ని దాటడంలో ఎన్నో అవస్థలకు గురవుతున్నాడు. ఆకాశంలో రివ్వున ఎగిరిపోతూ గూళ్ళకు చేరుతున్నపిట్టలు నోళ్ళు తెరచి వెగ అనుస్తున్నాయి. ఆ

అరుపులకు కీచురాళ్ళ శబ్దం తోడై వికృతంగా ధ్వనించింది. అయినా అడవిని చీల్చుకుంటూ, చీకటి క్రమ్ముకొస్తున్నా సాగిపోతూనే వున్నాడు...ఏమిటో యీ సాహసం!

అడవికి అంత మెక్కడో అతనికి తెలియదు. అతనిలో అదివరకున్న వుత్సాహం సన్నగిల్లింది. నడిచి నడిచి అలసి పోయాడు. కాళ్లు పీలిపోతున్నాయి అడుగులు తడబడు తున్నాయి. విశ్రాంతి తీసుకోవాలనుకున్నాడు.

ఒక చెట్టుకిందపడుకునేందుకు కొంచెంచోటు ఏర్పాటు చేసుకున్నాడు. పడుకుందామనుకుంటుండేసరికి బ్రహ్మాండం బ్రద్దలయ్యేటంత గర్జన తన చెవిని బ్రద్దలు చేసింది. భయ విహ్వాలుడై నిలబడిపోయాడు. వొళ్లంతా గజగజ వణికి పోతోంది. ఒక పెద్దపులి అతని ప్రక్కనుంచే ఎగిరి గంతేసి వెళ్లింది. అదృష్టవశాత్తూ అతన్ని పసిగట్టలేదు. అక్కడ నేలమీద పడుకోవటం ప్రాణాపాయ మనిపించింది. ఒళ్లు జలదరించింది. పైకి చూశాడు. చెట్టంతా పరిశీలించాడు. అప్పుడిక పైకెక్కాడు. చెట్టుయొక్క రెండు కొమ్మలు ఒక దానితో ఒకటి లంకెపడి, మంచెలా ఏర్పడి పానుపులా పవ ళించేందుకు చక్కగా వున్నాయి. అక్కడే నిద్రపోయాడు.

అడవిలో గోల బడనేనా రాయణుని నిద్రకేం భంగం కలిగించలేకపోయింది. పెద్దపులుల అరుపులూ, తదితర జంతువుల రోదన ధ్వనులకు అతను నిద్రనుంచి లేవలేదు. తన మీాదనుంచి పాము పాకివెళ్ళుతూ, బుసలుకొట్టుతున్నా అతనికి మెలుకువరాలేదు. బాలభానుని లేతకిరణాలు అతని కనురెప్పల మీాద కదంత్రొక్కుతూ నాట్యం చేస్తున్నాయి. ఆ చెట్టు

పాదనుంచి ఎగిరిపోతూన్న పక్షి రెక్క ఆడిస్తూపోతూంటే ఆ రెక్క తాకిడి తన కాలికి తగలడంవల్ల, కాలు జాచాడు. కాలు క్రింద కాళీస్థలమవడ వల్ల కళ్లు తెరవాల్సివచ్చింది. కళ్లు తెరవడంతోటే లోకం వెలుతురు వెల్లవేసుకుందని తెలుసుకుని నిద్రనుండి తెప్పరిల్లాడు చెట్టు దిగివచ్చి, కాళ్లూ చేతులూ ఝాడించాడు. మిగిలివున్న బద్ధకం కాస్తా జారి పోయింది.

ఆకలివేసినప్పుడల్లా దారిలో కనుపించిన కాయల్ని కోసుకొని తింటూ నడచి వెళ్ళిపోతున్నాడు. ఎక్కడికి వెళ్తున్నాడో అతనికే తెలియదు. ఫలానాచోటుకు వెళ్లాలనే ప్రత్యేక తలంపూ లేదు అలా వెళ్ళి, వెళ్ళి, మళ్లీ వాఘరా నదివొడ్డుకే చేరుకున్నాడు. నదిలో దిగి కాళ్లూ చేతులూ కడుక్కొని మంచినీళ్ళు త్రాగుతున్నాడు. అంతలో నీళ్ళల్లో కొంచెం దూరాన ఒక దూలం కనిపించింది. ఆ దూలం ప్రవాహప్రవాలునే పోకుండా తనవైపుకు వస్తూండడంవల్ల ఆశ్చర్యంగా దానివంక జూస్తూ నిలబడ్డాడు. అది సమీపానికి వచ్చి, అతనికేసి కాళ్ళుజాపేసరికి, అతడు ఎగిరి గంతేసి వొడ్డునపడ్డాడు. భయంతో వణికిపోయాడు. అది దూలం కాదు. అనేక వింతజంతువు. అలాంటి జంతువును అత నిదివరకెన్నడూ చూడలేదు. పరమ అసహ్యంగానూ, క్రూర జంతువులా వుంది. అతడు గబగబా కర్రా, మూటా తీసు కొని అక్కడనుండి పరుగెత్తుకుంటూ వెళ్ళిపోయాడు.

అడవిదాటి వెళ్ళిపోయాడు. ఒక శిలమీద కూర్చు న్నాడు. ప్రొద్దుగూకొచ్చింది. ఆ శిలమీదకూర్చొని ప్రక్కను

తిరిగి క్రిందకు చూచేసరికి తానెక్కడో పర్వత శిఖరాగ్రం మీద కూర్చున్నట్లు, తన ప్రక్కనున్నదంతా ఒక లోయని గ్రహించాడు తానక్కడ ఎలాకూర్చున్నాడో, అక్కడ కెలా రాగలిగాడో తనకే ఆశ్చర్యం వేసింది. అంత ఎత్తైన ప్రదేశంనుండి క్రిందపడటం తటస్థిస్తే మనిషి కనీసం ఆన వాళ్ళకైనా దొరకడు. ఈ భావం మనసులో గింగురు మన గానే వొళ్ళు జలదరించింది. భయంతో వణికిపోయాడు.

ఆ చేరువలోనే ఒక పర్వతశ్రేణి వుంది. దానినిండా మంచు దట్టంగా పట్టివుంది. ఆ పర్వతాల పొడవు ఎంత దూరమో అతని వూహాకందని విషయం. ఆ దరిదాపుల్లో ఏ పల్లెపట్టయినా కనిపిస్తే అక్కడకు వెళ్ళి ఆకలి దప్పులు తీర్చుకోవచ్చని ఆశపడ్డాడు.

నెమ్మదిగా లేచి నడిచిపోతున్నాడు. సంధ్యారుణ కాంతులు నలుదిశలా వ్యాపించినవి. అదంతా శిలామయ ప్రదేశం. భూమి తొలచబడి, రాళ్ళు, బండలు చిందర వంద రగా పడివున్నాయి! రొమ్ముల్లో దడ ఆరంభమైందతనికి. ఆకలి బాగా వేస్తోంది. పొట్ట వెన్నునంటుకుపోయింది. నోట్లో తడి ఆరిపోయి నాలుక పిడచగట్టుక పోసాగింది.

అడుగు ముందుకు వెయ్యలేకపోయాడు. వేసినా ప్రయోజనం లేదనుకున్నాడు. అక్కడ నేల శుభ్రంచేసి పడుకుని చేతిలో వున్నమూటను తలగడగా పెట్టుకొని-నిద్ర పోయాడు.

అతడు లేచేసరికి బారెడు ప్రొద్దెక్కింది. కడుపులో ఠికాణాలేక దహించుకుపోతోంది. చూపుమేర మైదానమే

కనుపిస్తోంది. రాయీరప్ప తప్ప మరేమీ దొరకవు. నిరాశ పెరిగేసరికి వున్న వుత్సాహంకూడా సన్నగిల్లిపోయింది. అతని కదివరకెన్నడూ యిప్పుడున్నంత ఆకలి వేయలేదు. ఆకలి సమిలేస్తోంది. చచ్చేటంత కోపమొచ్చింది ఆకలిమీద. ఆకలిబాధ అపరిమితం. తాళలేకపోతున్న ఆ ఆకలిబాధవల్ల ఆ దరిదాపుల్లో ఏదైనా కుగ్రామం వున్నా కనుక్కోవడం తనవల్ల కాదని ఆశలన్నీ వదులుకున్నాడు.

అంతలో అతనికళ్లు దిఙ్మండలంపైకి మళ్ళాయి. ఆ పర్వతాగ్రాలపై అర్ధవర్తులాకారంలోవున్న ఒక చక్కని చిత్రం కనుపించింది. చూడటానికి కన్నుల పండువుగావుంది. ప్రక్కన తెగగొట్టబడిన అంచులు గుహాద్వారాలుగా వున్నాయి. రాతియుగంనాటి గుహాలాకృతికీవీటికీ ఏసంబంధం లేదు. వరుసగా చిత్రాలు నిలుపబడిన చిత్రకళానిలయ మున్నట్లుంది. ప్రాచీనచిత్రకళా వైభవం మధ్య తాను కాలు జారి పడ్డానా అనుకున్నాడు. ఆ పారవశ్యంలో తన ఆకలి సంగతే పూర్తిగా మరచిపోయాడు. ఈ గుహాల్నిగురించే ఎక్కువగా తెలుసుకోవాలని నిశ్చయించుకున్నాడు......

దారీ తెన్నూలేక చిందరవందరగావున్న ఆ రాళ్ళ మధ్యనుండి నెమ్మదిగా ప్రాకుతున్నాడు. మధ్యమధ్య పట్టు జారిపోతోంది. కాని కాలివ్రేళ్ళపట్టు గట్టిగా వుండటంవల్ల నిలబడగల్గుతున్నాడు. ముఖంనిండా చెమటపట్టింది, జారిపడి పోతానేమోననే భయంవల్ల....

ఇప్పుడు వడిగా నడుస్తున్నాడు. అతని నిస్సత్తువ అదృశ్యమైపోయింది. దేహంలో నూతన బలం ప్రవేశించింది.

గబగబ వెళ్తున్నాడు. ఆకలివేస్తున్నా అదేమంత బాధించటం లేదు. అతని సమధికోత్సాహాన్ని, వుత్తుంగ తరంగ భావవీచి కల్ని అటకాయించే స్థితిలో లేదు ఆకలి....

వాఘురానది ఎదురయింది మళ్ళీ. ఏమంత లోతుగా లేదిక్కడ. నదిలో పడివున్న రాతిబండల్ని ఢీకొంటూ, నీటి వొరవడి అదో రకమైన శబ్దం చేసుకుంటూ పోతూంది. ఒక బండమీదనుంచి యింకో బండమీదకు దూకుతూ బదరీ నారాయణ అవతలివొడ్డుకు చేరాడు. అక్కడ ఆ మూటా, చేతికర్రా పడేసి, కాళ్ళూ చేతులూ కడుక్కున్నాడు. ముఖం కూడా కడుక్కుని, రెండుదోసిళ్లు నీరుత్రాగి కడుపు నింపు కున్నాడు.

అక్కడ వీచేగాలిలో ఆ పరిసరాల వింత వింత ధ్వను లన్నీ ప్రతిధ్వనిస్తున్నాయి. చిలుకలు, పావురాలు, తదితర పక్షుల కిలాకిలా రావాల సమ్మేళనధ్వనులు....కోతులు కిచకిచ లాడుతున్నాయి. లేడిపిల్ల చెంగుచెంగున గంతులేస్తూ పరు గెత్తడం తను స్వయంగా చూశాడు. ఇవేకాకుండా, ఏవో సమ్మెటదెబ్బలు, ఉలితో చెక్కడం వగైరా ధ్వనులుకూడా విన్పించాయి.

వాఘురానది ప్రక్కనుంచి ఆ గుహలవైపు ఒక సలిగె నలగని కాలిబాటవుంది. ఆ దారినే వెళ్లాడు. పైకెక్కి నోరావులించి ఆశ్చర్యంగా చూశాడు. ఆహా! ఏమా శిల్ప కళావైభవము! అలంకార శోభితమైన ద్వారము, దాని తలుపులు—లోపల యింటిలోకి వెళ్ళేముందు గది- అవాల హాలు, ఆ హాలు కిరువైపులా గదులు, ఆగదుల్లో శిల్పశాస్త్ర

వైభవం; ఆ ప్రక్క చిరస్మరణీయమైన భవంతులు....ఆహా....
యివన్నీ...ఆ రాళ్ళమీద చెక్కబడివున్నాయి. ఆ దృశ్యం
అతణ్ణి ముగ్ధుణ్ణిచేసింది. ఏదో అనిర్వచనీయమైన శాంతి,
దరహాసవీచిక అతనిలో వివేకోదయ జ్యోతిగా వెలుగొందింది.
అంతలో దిగ్భ్రమ చెందించే మరోవింత గోచరించింది.

అతని నేత్రాల్లో నూతనకాంతి ప్రవేశించింది. అతని కళ్ళు ప్రకాశవంతంగా, పరిశీలనగా, చురుగ్గా చూశాయి. పనుల తొందరలోవున్న ప్రజలు కొందరు అటూ యిటూ వెళ్ళడం చూశాడు. కొంచెంసేపు అక్కడే నుంచుని వాళ్ళను పరీక్షగా చూశాడు. వాళ్ళేదో మాట్లాడుకుంటున్నట్లు కూడా గమనించాడు.

అదొక వింతప్రదేశంలా వుంది. అతని కెందువల్లనో భయంవేసింది. అక్కడ వున్నవాళ్ళంతా పురుషులే. అందరూ నుంచి పనితనం గలవాళ్ళే. తమతమ వృత్తుల్ని సమర్ధనీయంగా చేసుకుంటున్నారు. క్రొత్తగా వచ్చిన ఆగంతకుని వంక కన్నెత్తిచూచే తీరికకూడా లేనట్లుంది. ఇటుప్రక్క వొకతను మరిద్దరితో పనిచేసే విధానంగురించి తీవ్రంగా చర్చిస్తున్నాడు. ఇంకొకడు తన పనిముట్లకు పదును పెడుతున్నాడు. కొందరు గుడ్డల్ని కత్తిరించి అలంకరణ చేస్తున్నారు. మరి కొందరు రంగులు కడిగేవాళ్ళు, రంగులు కలిపేవాళ్ళు, రంగుల్ని మిశ్రమంచేసి నూరేవాళ్ళు .... వాళ్ళ వేషధారణ చాలా చిత్రంగావుంది. అందరూ కాషాయ వస్త్రాలు ధరించారు. కాని కట్టు బొట్టుల్లో కొంచెం తేడా వుంది. కొందరు పైనుంచి క్రిందవరకూ వొకటే గౌను వేసుకున్నారు. మరి

కొందరు బొడ్డుదగ్గరనుంచి, తొడలవరకు శరీరాని కంటుకు పోయినట్లు బిగించి కట్టారు. మిగతా దేహమంతా నగ్నమే. అందులో చాలామంది గడ్డంతోపాటు తలకూడా నున్నగా గీయించుకున్నారు. కొద్దిమందిమాత్రం వెంట్రుకలు బాగా పెంచి నెత్తిమీద ముడి వేసుకున్నారు. గుడిగోపురం మాదిరిగా. ఇంచుమించు అందరూ సన్నగానే వున్నారు అయినా ఏ కష్టనష్టాలయినా సహించే సహనం వారిలో వుంది.

వాళ్లెవరో అతని కర్థంకాలేదు. వాళ్లొక ప్రత్యేక తెగ వారయి వుంటారని భావించాడు. బహుశా రాతియుగంవారయివుండవచ్చు ననుకున్నాడు. కాని అంతలో అలాంటివారి నెక్కడో అదివరకు తాను చూచినట్లు జ్ఞాపక మొచ్చింది... అవును... తను ఎక్కడో చూశాడు... ఎక్కడ...?

వాళ్ళమధ్యనే నడుస్తున్నాడు. కాని తనెవరో వాళ్ళు గమనించనేలేదు. ఒకమూల రంగులు నూరుతున్న ఒక పదిహేడేళ్ళ కుర్రాణ్ని చూశాడు. చక్కగా తీర్చిదిద్దినట్టున్నాడు. ఆ అబ్బాయి ముఖం తేజోవంతంగా వుంది. చేతి వ్రేళ్ళు సన్నగా, పొడవుగా చూడముచ్చటేస్తున్నాయి. రంగుల్ని వివిధ పాళ్ళలో మిశ్రమంచేస్తూ, సునాయాసంగా నూరుతున్నాడు. అతను ధరించిన చొక్కాగుడ్డ కొంచెం మందంగా వున్నట్టు అనిపించింది. తలవెంట్రుకల్ని నెత్తి మీద ముడివేసుకున్నాడు. పనిలో దీక్షగా నిమగ్నుడై పోయి నట్లున్నాడు.

బదరీనారాయణ ఆ కుర్రవాడి దగ్గరకు వెళ్లి, ప్రక్కనే నుంచున్నాడు. తనవంక చూస్తాడేమోనని నిరీక్షించాడు. తన

రాకను పసిగట్టా కాశుద్రాడు, "క్షమించాలి" కంఠంలో స్పష్టతను ప్రస్ఫుటంచేస్తూ అన్నాడు బదరీనారాయణ. కుద్రాడు వినిపించుకోలేదు. "క్షమించాలి" కొంచెం బిగ్గరగా అన్నాడు యీసారి.

కుద్రాడు తలెత్తి చూశాడు. ముఖంలో కోపం ద్యోతకమయింది. ఆ కాటుక కళ్ళు - కలలో దేవకన్య కనులేమో నన్నట్లు... భ్రమ గొలిపాయి.

"ఏం?"

"నేనిక్కడ క్రొత్తవాణ్ణి."

"అలాగే వున్నావులే."

"ఆకలి వేస్తోంది."

"ఆనంద విహార్‌లోకి వెళ్ళి ప్రభుఘోష్‌గారి నడుగు. నీకేం కావాలో అవన్నీ యిస్తారు."

"...ఈ ప్రాంతాన్ని యేమని పిలుస్తారు? నసుగుతూ అడిగాడు బదరీనారాయణ.

"అజంతా."

"ఏదేనా మఠమా?"

"ఆఁ!"

"ఏం మఠం?"

కాని కుద్రాడు అప్పటికే తల వంచేసుకొని రంగుల్ని కలుపుతూ, వాటిని నూరడంలో నిమగ్నుడై పోయాడు.

బదరీనారాయణ ఏంచేయాలో తోచక ఒక్కక్షణం అలాగే నుంచున్నాడు. సరేననుకొని బయలుదేరి విహార్

వైపుకు కొన్ని అడుగులదూరం నడిచాడు. అంతలో ఏదో ఆలోచిన తట్టింది. మళ్ళీ వెనక్కి తిరిగి ఆ కుర్రాడి దగ్గరకు వెళ్ళి అతనివీపు తట్టాడు.

"ఏం ?"

"బౌద్ధభిక్షువులేనా ?" తనకు తెలిసిందిలే అన్నట్లు ప్రశ్నించాడు బదరీనారాయణ. కుర్రాడు నవ్వాడు.

"అంత ఆశ్చర్యంగావుందే ?" అని అడిగి కుర్రాడు మళ్ళీ తన రంగులపనిలో లీనమయ్యాడు. ఈసారి బదరీనారాయణ తిన్నగా వెళ్ళిపోయాడు.

## 2

వసునాడు సాఖపుత్రచైత్య మందిరం దగ్గరకు బదరీనారాయణను తీసుకువెళ్ళారు. అక్కడే బౌద్ధభిక్షువుల అధిపతి బస చేస్తున్నాడు. ఆయనపేరు విజ్ఞానంద్. సన్నగావుంటాడు. కొంచెం పొడగరి. బోడితల...వయస్సు దాదాపు డెబ్భయి వరకూ వుంటుంది. అయినా అంగపుష్టినిబట్టి అంతవుంటుందని పించదు. బదరీనారాయణ లోపలకు రావడంతోటే చిన్నగా నవ్వాడాయన. ఆ నవ్వులో ఏదో తెలియరాని గాంభీర్యం నిబిడీకృతమై వుంది. శాంతి తొంగిచూస్తోంది. ఆయన్ని చూడటంతోనే బదరీనారాయణ చేతులు జోడించి నమస్క-

రించాడు. గురుదేవుడు ఆచార్య విజ్ఞానంద్ ప్రత్యభివందనం చేశాడు.

"రా నాయనా, కూర్చో...నీ పేరేమిటి?"

"బదరీనారాయణ!"

"చాలా దూరంనుంచి వచ్చినట్లున్నావు?"

"అవునండి. నర్మదానదీతీర ప్రాంతానవున్న కుధిరావర్తంనుండివస్తున్నా."

"ఎక్కడికో వెళ్తున్నావు?"

"గమ్యంలేనిగమనం. ఎక్కడికో నాకే తెలియదు."

"ఎందుకని?"

"మామూలు జీవితానికి దూరమైపోవాలనుకున్నాను"

"అంటే, అంతటి ఘోరచర్యలకు తలపడ్డావా?"

బదరీనారాయణ ఆలోచనలో పడ్డాడు. కళ్ళరెప్పలు కొన్ని క్షణాలు మూతలుపడ్డాయి.

"కాదు. పాతజీవితాన్ని విడనాడి క్రొత్తజీవితాన్ననుసరించాలనుకుంటున్నాను. అలాంటి క్రొత్తదనం వొక్క పర్వత సమీపాలందుమాత్రమే లభ్యం కాగలదనుకొంటున్నాను. అందుకే బయలుదేరి, పర్వత ప్రాంతాలను వెదుక్కుంటూ వెళ్తోంటే యీ ప్రదేశం తగిలింది."

"ఇక్కడేం జేస్తావు?"

"చిత్రాలు గీస్తాను. శిల్పాలు చెక్కుతాను."

"ఎక్కడ నేర్చుకున్నావ్?"

"ఉజ్జయినీలో పండిట్ లక్ష్మీదత్ గారి శిక్షణలో."

"బాగుంది. బౌద్ధమతస్థుడివా?"

"కాదు."

"బ్రాహ్మణుడివా?"

"కాదు."

"జైనుడివా?"

"ఊహూఁ!"

"మరి ఏ మతస్థుడివి!"

"నేనే మతానికీ చెందినవాణ్ణి కాను. ఏది మంచి అనిపిస్తుందో అదే నామతం. అసలు మతాల్లో నాకు నమ్మకంలేదు."

నువ్వొక విచిత్రవ్యక్తిలా వున్నావే. ఏమతస్థుడివి కాకుండా ఎలావుంటున్నావు? ఏదోఒక మతమవలంబించాలి. లేకపోతే కొన్ని సందర్భాల్లో ప్రమాదంకూడా."

"ఎటూ చెందకుండానూ వుండను. కాని ఫలానా సూత్రాలు, ఫలానా ఆచారాలు తు చ తప్పకుండా ఆచరించి తీరాలనే నిర్భంధముంటే నేను తలొగ్గను. కనుక నా కిష్టమైన పద్ధతుల్లో. నా కంగీకారమైన మార్గాల్లో వెళ్తుంటాను."

తన ముందున్న యువకుణ్ణి కాస్త నిశితంగా పరిశీలించాడు ఆచార్య విజ్ఞానంద్. ఏమతావలంబీకుడూ కాకుండా ఏమానవుడైనా ఎట్లావుంటాడు! ఇలాంటివ్యక్తి తటస్థపడటం

యిదే తొలిసారి. అయినా కుర్రాడు చురుగ్గా వున్నాడు. తను చెప్పిందేమిటో తనకు తెలిసే మాట్లాడుతున్నాడు. ఆలోచించి అర్థంచేసుకున్నట్లు చిన్నగా నవ్వి, ఆచార్య విజ్ఞానంద్ మళ్లీ యిలా ప్రశ్నించాడు.

"సరే. యింతకూ నన్నేంచేయమంటావు?"

"మీతో వొకణ్ణిగా వుండాలని అభిలాషగా వుంది. వుండనిస్తే చాలు. నాకు యిక్కడే వుండాలనుంది."

"ఉండు...కాని నిన్నొకటి అడగాలని వుంది."

"అడగండి."

"అడగండి."

"బుద్ధభగవానుని గురించి నువ్వెందుకు నేర్చుకో గూడదూ? రోజూ చేసేపని పూర్తయాక, కొద్ది కొద్దిగా నేర్చుకోవచ్చు."

"తప్పనిసరా?"

"కాదు. కాని యిది బుద్ధుని శిష్యబృందంయొక్క శిబిరం. మాలో బుద్ధభగవానునిగూర్చి తెలియనివా రుంటూంటే, అతనికి ఆ మహాబోధిసత్వుని బోధల్ని బోధించకపోతే, ఆయనకు తీరని అపచారము చేసినవారమవుతాము"

"మీరు బోధించటం తప్పనిసరేనా?"

"అది మన ఆత్మకు సంబంధించిన విషయం."

"సరే నేర్చుకుంటాను. కాని. విన్న ప్రతి విషయాన్నీ నమ్మవలసి వుంటుందా?"

"ఎవరికుండే నమ్మకాలు వారికుంటాయి."

అంతట యిద్దరూ నవ్వుకున్నారు. ఆచార్యులవారు యిక వెళ్ళవచ్చునంటే బదరీనారాయణ చేతులు జోడించి, నమస్కరించి వెళ్ళిపోయాడు.

# 3

బదరీ నారాయణను చిత్రశాలకు తీసుకువెళ్లారు. వాఘురా నదీతీరాన ఎత్తయిన చెట్ల నీడల క్రిందే క్లాసు జరుగుతోంది. పెద్దలూ, పిన్నలూ చాలామంది కూర్చొని అధ్యాపకుడు బోధించే విషయాన్ని శ్రద్ధగా వింటున్నారు. అప్పటి బోధనా విషయము వజ్రలిపి. అంటే అదొక భాగం చిత్రలేఖనంలో. అందులోకూడా అనేక ఉపాంగాలున్నాయి. రంగులెన్నెలా మిశ్రమం చేయవలసిందీ, చిత్రంలో నీడల్ని ఎలా వ్యక్తం చేయవలసిందీ, అవసరమైనచోట్ల ఉన్నత కళావైదుష్యాన్నెలా చిత్రించాలో, ఏ రంగుల నే పాళ్ళలో ఎలా కలిపితే, ఎలాంటి మార్పులు వచ్చేదీ వివరించడం జరుగుతోంది. అంతేకాకుండా భావచిత్రీకరణ, చేతనాన్ని సూచించడం, వాస్తవికతను ప్రస్ఫుటింప చేయడం, రసోద్దీపన కలిగించేలా చిత్రించడం, యిలా వివిధ రకాల భంగిమల్ని - వాటిని చిత్రించే నేర్పును విశదీకరిస్తున్నాడాయన.

అధ్యాపకుడు ముసలివాడే. వయస్సు అరవయ్యో పడి దాటివుంటుంది. తలమీద వెంట్రుకలేమీ లేవు. కళ్ళల్లో ప్రశాంతత ద్యోతక మవుతుంది. ఆయన పేరు ఆచార్య పద్మదత్.

బదరీనారాయణ వెళ్ళి విద్యార్థుల్లో కూర్చున్నాడు. అందర్నీ కలయజూచాడు. అందరూ తనకు క్రొత్తవాళ్ళే; అక్కడ వుంటున్న వాళ్ళే; చిత్రలేఖనం నేర్చుకుంటున్న వాళ్లే; అందరి వేషధారణా యించుమించు వొకటే. అందరూ తల వెంట్రుకల్ని నెత్తిమీద ముడి వేసుకొని, కాషాయి వస్త్రాలు వేసుకున్న వాళ్లే. అందరూ అలా సమావేశ మవటం అతనికి ఉల్లాసం కలిగించింది. అంతలో అతనికళ్ళు, మొట్టమొదట తాని ప్రదేశానికి వచ్చిన క్రొత్తలో పరిచయం చేసుకున్న తొలివ్యక్తిమీద పడ్డాయి. ఆ కుర్రాడు ఎంతో శ్రద్ధగా వింటున్నాడు. ముఖంలో ఏకాగ్రత ద్యోతక మవుతోంది. బక్కపల్చగా వున్నాడు. అయినా ఆకర్షణీయమైన విగ్రహం.

ఇప్పుడు గురుదేవుడు బోధిస్తున్నదంతా తనూవిన్నాడు.

"జీవితంలో ఆధ్యాత్మిక విలువలకు ప్రాధాన్యత నిచ్చి తాత్కాలికంగా ఎదురయ్యే కష్టనష్టాల్ని అవలీలగా మరచి పోగల్గేట్లు చేయగల్గడమే కళ. కళ కేవలం కన్నుల పండువుగా వుండటమే కాదు. కళవల్ల సజీవత చిగురించి పుష్పించాలి. దాని పరిమళం దశదిశలకు పరివ్యాప్తమై ఆ కళయొక్క ప్రభావం నలుమూలలా వికసించాలి. నీవుగీచే ప్రతిచిత్రమూ కేవలం భావాలను వ్యక్తం చేస్తూండకూడదు. అలా భావాలను వ్యక్తంచేసే చిత్రాలు నైతిక ప్రమాణాన్ని, కలుషితా

తీతమైన భావోద్వేగాల్ని సమన్వయింప జేయాలి. లేదా మానవ మేధస్సు కందని మహోన్నత శిఖరాగ్రాల విజ్ఞాన ప్రాంగణాల్లో ఏకాంతపర్య వేక్షితుల్ని చేయాలి.

మనందరిలోనూ మహత్తరశక్తి దాగివుంటుంది. నిశిత మైన దృక్పథంలో పరిశీలించి దాని ఉనికిని తెలుసుకోగల్గాలి. దానియొక్క మహోన్నత స్థానాన్ని అవగాహన చేసుకోవాలి. అదిమన ఆలోచనమీదా, మనం లగ్నంచేసే కృషిమీదా ఆధారపడివుంది. అలా కృషిచేసేందుకు ముందుగా ఆత్మ యొక్క లోతుపాతుల్ని క్షుణ్ణంగా తెలుసుకోగల్గాలి. ఆత్మలో సంలీనమైయున్న భావనాశక్తి, ప్రేరణాశక్తి పాటవాన్ని గ్రహించి వాటి సంగీత స్వరాలధ్వనికారం వ్యాప్తిచెందే సుదూర తీరాల పరిధుల్ని వ్యూహా చిత్రణలో చూడగల్గాలి. అలా చేయగల్గిన మహత్తర శక్తే మనమనస్సునూ, ఆత్మనూ వికసింపజేసి నూతనానందాన్ని కలుగజేస్తుంది. మనల్నేకాదు, సమస్త మానవజాతికీ జ్యోతిర్మయిగా వెలుగుల్ని ప్రకాశింప జేసి, చిద్విలాసాలతో ఆనంద మొనగూర్చేది కళేనని గుర్తుంచుకోండి. అందుకుగాను భౌతిక సాంప్రదాయాలనుంచి, యీ వస్తుసముదాయంపై వ్యామోహంనుంచి విముక్తులై, స్వేచ్ఛా విహంగాలమాదిరి మీరంతా స్వేచ్ఛగా ఆలోచించ గల్గాలి అందుకుగాను మీరంతా యీకనుపించే వస్తు సౌందర్యం వెనుక దాగి, యీ వస్తుసముదాయానికి వివిధ రూపాలనిచ్చి, వివిధ వెలుగుల్ని కనుపించేలా చేస్తున్న ఆత్మయొక్క మహోన్నత స్థానాన్ని గుర్తించి, దాన్నే సజీవసమిధగా భావించి వ్యవహరించవలసివుంటుంది."

క్లాసయిపోయింది విద్యార్థులు తా లేచి వెళ్లిపోయాక, బదరీనారాయణ, ఆచార్య పద్మదత్‌గారి దగ్గరకు వెళ్లి, చేతులుజోడించి నమస్కరించాడు. ప్రశాంత మనస్కుడై ఆయన బదరీనారాయణుని వంక చూశాడు. ఆయనవంక చూస్తుంటే, ఏదో మహత్తరమైన శాంతి, దీప్తివంతమైన కాంతి చుట్టూ ప్రసరిస్తోందన్నట్లు భావించాడు బదరీనారాయణ.

"నీ పేరేమిటి? క్రొత్తవాడవుకదూ?"

"అవునండి. నిన్ననే వచ్చాను, నాపేరు బదరీ నారాయణ."

"ఇంతకుముందు నాక్లాసులో వున్నావుకదూ? చిత్రలేఖనం వచ్చా?"

"చిత్రలేఖన మొక్కటేకాదు. శిల్పికూడా."

"లోగడ అనుభవంవుందా?"

"కొంత వుందండీ. ఉజ్జయినీలో నేర్చుకున్నాను.

"ఓహో. మంచిది. చక్కటిచోట నేర్చుకున్నావుం బాగా వచ్చివుండాలి. అయితే నాక్లాసుకు హాజరై నేర్చుకో వలసిన అవసరం వుండదనుకుంటాను."

"మీరుబోధిస్తుంటే బాగా అర్థమవుతోంది ఇంకా ఎక్కువ నేర్చుకుందామని అభిలాషగావుంది."

"లక్ష్మీదత్ కన్న నే నెక్కువ నేర్పగలనా! ఆయన దగ్గరే బాగా నేర్చుకొని వుండాల్సింది. ఆయన్ను మించిన వారెవరున్నారు?"

"నేను లక్ష్మీదత్ గారి దగ్గర నేర్చుకున్నానని మీ కెలా తెలుసు?"

"ఉజ్జయినిలో గత యిరవై సంవత్సరాలనుండి కళా కేంద్రం నిర్వహిస్తూ కళావ్యాప్తి గావిస్తున్నది. ఆయనొక్కడే-లక్ష్మీదత్ చాలా విశిష్టతగల వ్యక్తి. సర్వసమర్థుడు"

"లక్ష్మీదత్ గారిని మీ రెరుగుదురా?"

ఆచార్య పద్మదత్ నవ్వాడు. ఆయన ముఖంమీద ముడతలేర్పడ్డాయి. ఏదో నూతన వికాసం ఆయన ముఖంలో ప్రస్ఫుటించింది."

"ఎరుగుదును. ఆయన నా సోదరుడే"

అంతట బదరీనారాయణ వినమ్రుడై నమస్కరించడం ద్వారా తనలో అనుకోకుండా ప్రవేశించిన విధేయతను వెల్లడించాడు. తరువాత పద్మదత్ ముఖంలోకి పరిశీలనగా చూశాడు. కొద్దిగా పోలికలు కనిపిస్తున్నవి. కాని యిద్దరికీ బోధించటంలో వ్యత్యాసం గోచరిస్తున్నది. లక్ష్మీదత్ తన వాక్పటిమచే గంభీరంగా గదమాయించి మరీ నేర్పేవాడు. కాని పద్మదత్ అలాకాదు. సంజవేళ చల్లగాలి పిల్ల తెమ్మెరలు హాయిగా జోలపాడినట్లు ఎలా వీస్తాయో, అలా నెమ్మదిగా, లాలనగా, శాంత స్వభావుడై బోధిస్తాడు. పద్మదత్ లో ఏదో ప్రశాంతిమైన గంభీరత, నూతన వికాస . అనిర్వచనీయమైన నిశ్చలత్వం బదరీనారాయణకు స్పష్టంగా గోచరమైనది.

నువ్విక్కడ నేర్చుకునేముందు ఈ మఠమంతా ఒక్క సారి చూడాలి... రా, నేను దగ్గరుండి చూపిస్తాను ఎవరికైనా యిలా చూపించడమంటే నాకెంతో సరదాగా వుంటుంది."

బదరీ నారాయణ ఆయనననుసరించి వెళ్లాడు.

## 4

ఆచార్య పద్మదత్ బదరీ నారాయణను సంఘారామానికి తీసుకువెళ్లాడు. లోపల గదులు, హాలు అన్నీ స్వర్గాధిపతి సౌధంలా రకరకాల చిత్తరువులతో మనోహరంగా అలంకరించబడి జేగేయమానంగా వున్నాయి. లోపల ఒక ఎత్తైన ప్రదేశంలో బౌద్ధస్తూపం నిర్మించబడింది. ఆ భవనంలో గోడలు, స్తంభాలు, పై భాగమందు చిత్రించబడిన చిత్తరువుల్ని చూచి బదరీనారాయణ ముగ్ధుడైపోయాడు. ఆ ఆనందాబ్ధిలో అతని కళ్లు మిలమిల మెరుస్తున్నవి

"ఇది మా ప్రార్థనా మందిరము. ఇక్కడ ప్రాతఃకాలాన్నే అందరం సమావేశమౌతాం. ప్రార్థనలు చేస్తాం. తథాగతుని సూత్రాలు స్మరించి, ఆత్మశుద్ధిగా వాటి వ్యాప్తికి కృషిచేస్తామని బాసచేస్తాం. ఇక్కడే అప్పుడప్పుడు ఆచార్య విజ్ఞానందులవారు తను మహోపన్యాసాలిచ్చి అందరీన్ని ఉత్తేజితుల్ని చేస్తారు. ఆయన సర్వజ్ఞుడు. రోజులు గడచిన కొద్దీ ఆయనంటే ఏమిటో పూర్తిగా అర్థమవుతుంది"

ఇలా ఆ ప్రార్థనా మందిరాన్ని, ఆ పరిసరాల్ని వివరించాక ఆయన బదరీనారాయణను "అంగూలిమాల విహారానికి" తీసుకు వెళ్లాడు. అక్కడ అద్వితీయమైన ఊహా చిత్రాలు, అపురూపమైన కళాఖండాలగుపించాయి. ఆ విహారంలో వరండా ఒకటివుంది. వరండాలో స్తంభాలు చక్కగా వంపులు తిరిగి నిర్మితాలైనవి. క్రిందనుండి గుండ్రంగా వుండి పైకి వెళ్లేకొద్దీ లావుతగ్గి, పైన మూడు కలువపుష్పాలను యిమిడ్చినట్లు తయారు చేయబడినవి.

ఆ పుష్పాలు మూడూ ఒకదానిలో ఒకటి అమర్చబడి అన్నిటికన్న పైనున్న పువ్వు, గంటమాదిరి వికసించి ముచ్చటగావుంది ఆ స్తంభాలనుండి, అయిదడుగులు పొడవు కల్గిన శిల్ప చాతుర్యం వంపు దేరి మంగళకర వాయిద్యాలు మాదిరి విహారం ముందుకువచ్చి వింతశోభ కలిగిస్తోంది.

హాలంతా దీర్ఘ చతురస్రాకారంగా వుంది. పై కప్పును పన్నెండు స్తంభాలు మోస్తున్నవి హాల్లో నాలుగువైపులా లోపలకు ద్వారాలున్నవి. బిక్షువులకు పది గదులు ప్రత్యేకంగా నిర్మించబడినవి. కుడిప్రక్క నో మూడుగదులు, ఎడం ప్రక్కనో మూడుగదులు, ముందొక రెండు, వెనకొక రెండు గదులు...ఆ గదుల్లోగల శిల్పచాతుర్యం, చిత్రలేఖా వైభవం అంతాచూచాక యిద్దరూ బయటకొచ్చారు.

ముందు ద్వారం చెంతనిలబడి ఎదురుగా కనిపిస్తున్న ప్రకృతిరామణీయకతను తిలకించారు. ఆగుహాలచెంతనే పారుతున్న వాఘురానది ప్రవాహపుహోరు అక్కడకు గంభీరంగా వినిపిస్తోంది.

"లక్ష్మీదత్ గురించి నీ అభిప్రాయం ఏమిటి?" ప్రశ్నించాడు పద్మదత్.

"ఆయన చాలగంభీరమైనవ్యక్తి. ఎంతో నీతిమంతుడు. దురలవాట్లేమీ లేవు. కామవాంఛితంతో శరీరంనాశనమై పోతుందని ఆయన అసలు వివాహాన్నేత్యజించారు. ఆయనొక మహత్తర చిత్రకారుడు. ఎంత బాగా చిత్రిస్తారని!"

ఆయన చిన్నతనంలోనే ఎంతో నైపుణ్యం, విశిష్టత కలిగివుండేవారని అందరూ చెప్తూవుంటారు. ఆయన చేతిలో ఏదో గొప్ప శక్తివుంది. ఆయన పనితనంలో గోచరమయ్యే ఆ ప్రభావం, ఆయనమేధస్సు అందుకు ప్రత్యక్ష తార్కాణాలు.

ఉజ్జయిని మహారాణి ఆయన్నుమనసారా ప్రేమించింది. కాని ఆయనలక్ష్యపెట్టలేదామెను. అందుకు ప్రతీకారంచేసి పగతీర్చుకుంటానని ప్రతిజ్ఞచేసింది. ఏరకంగా పగతీర్చుకుంటానని ఆమె ప్రతిజ్ఞచేసిందో మాత్రం నాకు తెలియదు. నేనక్కడ వుండగా ఆమె తీర్చుకోలేదు. ఆయన అసలు ఆడపిల్లలకు స్థానమివ్వలేదు. ఆయన వదనంలో గంభీరం ఎల్లప్పుడూ తొడసూపేది. ఆయన దృఢచిత్తుడైన బ్రాహ్మణుడు.

నేను బౌద్ధమతస్థుణ్ణి. అందుకుఆయన నన్ను యీసడించేవారు.

"మీరెందుచేతమతం మార్చుకున్నారు గురుదేవా?" అని ప్రశ్నించాడు బదరీనారాయణ.

"నేను మార్చుకోలేదు. మతమే నన్నుమార్చింది. గమ్మత్తుగా బౌద్ధమతం స్వీకరించాను. ఇక్కడకు వచ్చేశాను.

అనుకోకుండా అలా జరిగిపోయింది. అప్పటినుండే నిజమైన జీవితంగడుపుతున్నాను. ఇక్కడ హాయిగా వుంటున్నా."

"మీరిక్కడకు తరలి రావటం మీ కుటుంబంలో గొప్పసంచలనము కలిగించింది." అని అన్నాడు బదరీ నారాయణ.

"అదొక వింతమార్పు; అంతే. వెనుక పట్టుకు వ్రేలాడే వారి ఆశయాలకోసం, వారి ఆదర్శాలకోసం వొకరెప్పుడూ జీవించలేరు తనకు తానుగా ప్రతివొక్కడూ జీవించాలి.

మా తండ్రిగారేకాని, నా సోదరుడేకానీ, మరెవరైనా కానీ, నా ముక్తికోసం ఎవరేమీ చేయరు. "తథాగతుడు ప్రవచించినట్లు ఎవరికివారు ఆత్మను శుద్ధిగా తమముక్తికోసం పాటుపడాలి" అని దృఢసంకల్పం మానవుని కొంత అవసరమో వ్యక్తీకరిస్తున్నట్లు చెప్పాడు ఆచార్య పద్మదత్.

అక్కడనుండి ఇద్దరూ శిల్పశాలకు వెళ్లారు. అక్కడ కూడ ఆచార్య ప్రేమదత్ గారు చిత్రలేఖనం గురించి నేర్పినట్లే మరొకరు శిల్పాలనుగురించి బోధిస్తున్నారు. తరువాత యిద్దరూ ఆ చిన్నకొండనుదాటి అవతలప్రక్కనున్న వస్తుశాల దగ్గరకు వచ్చారు. అక్కడ కొద్దిమంది మాత్రమే విద్యార్థులున్నారు. వాళ్ళంతా ప్లానులవీ నేర్చుకుంటున్నారు. తరువాత ఆయుర్వేదశాల దగ్గరకు వెళ్లారు. అక్కడీపాఠాలేం జరగటంలేదు. దేహదార్ఢ్యంగల వ్యక్తి మూలికలవీ వేరువేరుగా కొందరికిచ్చాడు. వాటినికొందరు నూరుతూ, కొందరుభస్మం చేసి వేరు వేరు పదార్థాల్ని, భిన్నమైన పాళ్లలో కలుపుతూ మందులు తయారుచేస్తున్నారు.

చిన్నదైనా, అశోక సొగసైన విశ్వవిద్యాలయం. అన్నీ చూచాక బదరీనారాయణ దిగ్భ్రాంతి చెందాడు. అతని ఆనందానికి మేరలేదు. అతని ఆశ్చర్యానికి అవధుల్లేవు అక్కడున్నవారందరిలో గొప్ప సోదరభావం ప్రబలివుంది. అక్కడకు తను రావడమే గొప్ప అదృష్టమనుకున్నాడు బదరీనారాయణ. అక్కడనుండి ఎప్పటికీ, ఎక్కడకీ వెళ్ళిపో కూడదనుకున్నాడు. జీవితాంతం అక్కడే స్థిరపడిపోవాలని నిశ్చయించుకున్నాడు.

"ఇక్కడేవుండి, యిక్కడే చనిపోయినా చాలు; అదే నాకు పరమానందం" అని తన మనోగతాభిప్రాయాన్ని ఆచార్యపద్మదత్ గారికి తెలియపర్చాడు.

## 5

తరువాత బదరీనారాయణ తను వచ్చీరావడంతో మొట్టమొదట ఎవరితో అయితే మాట్లాడాడో, ఆకుర్రాణ్ణి కలుసుకున్నాడు.

"మీరంటే నాకెందుకో ఆనందంగా వుంటుంది. స్నేహితులెవరూ లేకపోతే జీవితం చప్పగావుంటుంది. మీరు నాకు స్నేహితులుగావుంటారా?" అని తనకోర్కె తెలియ పర్చాడు బదరీనారాయణ.

"నాకేం అభ్యంతరంలేదు. ఇక్కడ అందరం స్నేహితులమే."

"మీ పేరేమిటో.....పిలవాలంటే......?"

"ప్రేమానంద్."

"నాపేరు బదరీనారాయణ" అని తనంతటతనే చెప్పి" ఇక్కడచాలా కాలంనుంచి వుంటున్నారా?" అని బదరీనారాయణ ప్రశ్నించాడు. స్నేహం కలుపుకోవాలనే వుద్దేశ్యంతో.

"చాలాకాలమనేందుకు వీల్లేదు నాలుగుసంవత్సరాల నుంచి వుంటున్నా."

"మధ్యలో ఎప్పుడైనా వెళ్ళిపోయారా?"

"లేదు. అసలు ఎందుకువెళ్ళిపోవాలి?"

"వీళ్ళంతా-ఎక్కడినుంచి వచ్చారో మీకుతెలుసా?"

ప్రేమానంద్ ఒక్కక్షణం ఆలోచించాడు. కళ్ళల్లో చిలిపితనం చిందులాడింది.

"వాళ్ళతల్లి గర్భాల్లోనుంచి."

బదరీనారాయణ నవ్వాడు. "క్షమించండి తెలుసుకోవాలనుంది. అందుచేత అడిగాను." అన్నాడు. ప్రేమానంద్ కూడ చిన్నగా నవ్వాడు. ఆ నవ్వు క్రొత్తగావుంది. చూడటానికి ముచ్చటగావుంది. ఆనవ్వు అతనికళ్ళలో ఏదో తళుక్కుమనిపించింది. "అంతేలెండి. ఎవరికైనా అలాగేవుంటుంది" అన్నాడు ప్రేమానంద్. "చూడండి. ఇక్కడ, యీ రాతి ప్రదేశంలో నాగరికత అభివృద్ధిచెందిన గ్రామాలకుదూరంగా

వుంటున్నారంటే వారినిగురించి తెలుసుకోవాలనే కుతూహలం ప్రతివారికీ సహజంగా వుంటుంది." అని బదరీనారాయణ వివరించాడు.

"మీరుమాట్లాడుతున్నారుచూశారూ; నాగరికతఅనీ! ఆనాగరికతకన్న ఎన్నోరెట్లు మేమే అభివృద్ధిచెందివున్నాం. దూరంగా వుంటున్నామన్న దొక్కటేగాని, జీవితానందాన్ని హాయిగా అనుభవిస్తున్నాం"

"అందరూ యిక్కడ జీవించగల్గుతున్నారు?"

"నీరు వాఘరానుంచి తెచ్చుకుంటాము. కావలసిన తిండిపదార్థాలు పరిసర రాష్ట్రాలనుండి వస్తూవుంటాయి.

"ఆహారపదార్థాల నెవరు పంపిస్తారు?

"ఒకటక్ రాజు,ఆయనేమాపోషకుడు. ఆయనేకాకుండా ముక్తిపొందాలని ధర్మంచేసే వ్యాపారస్తులంతా పంపుతుంటారు."

"ఎల్లప్పుడూ యిక్కడే వుంటారెందుకని?"

"హాయిగా జీవించటానికి ప్రశాంతమైన ఆలోచనలతో నిశ్చలమైన ఆచరణలో నిర్మలమైన జీవితం గడపటానికి."

"మీరంతా అలాంటి శిక్షణాబద్ధమైన జీవితాన్ని గడుపుతున్నారా?"

"సాధ్యమైనంతవరకూ" కాని తప్పటడుగులు వేయక పోవటంలేదు. ఏ తప్పులూ లేక, సక్రమపంథాలో జీవించేదల్లా వొక్కడే. ఆయనే విధాత.

"మరి యీ చిత్రలేఖనం - యీ శిల్పచాతుర్యం...
యీ సౌందర్యమంతా ఎందుకు?"

"అదా... అదంతా వొక బాహ్యాకారం మాత్రమే. మా ఆలోచనల్ని అందులో పొందుపరుస్తాము. కళ విశ్వ లానంద తరంగాలకో ప్రత్యామ్నాయ రూపం. ఆధ్యాత్మిక శిక్షణకు అదొక మార్గం. ఇక్కడ గోడలమీద చిత్రించ బడిన జాతకకథలను చూశారా మీరు!"

"జాతకకథలంటేనే నాకు తెలియదు."

"అయితే మీరు బౌద్ధ బిక్షువులు కారన్నమాట" ఇలా అజ్ఞానంగా వుండటం క్షేమార్హం కాదు. మీరు నేర్చుకోవాలి.

"అయితే మరి మీరు బోధిస్తారా?"

"నన్నే ఎందుకడుగుతారు?"

"మీరంటే నాకెందుకో యిష్టం."

"కాని-నాబోటి అల్పజ్ఞుల్ని చెప్పమని కోరడం సమంజసంగా లేదు" మీరు ఆచార్య విజ్ఞానంద్ గార్ని అడగవలసింది. లేదా కవిత్వానశంస దేవపాల్ గారినయినా అడగవలసింది. తమకు తెలిసిందంతా వారు మీకు చక్కగా బోధించి వుండేవారు"

"పోనీలెండి. మీరుండేదెక్కడ?"

"ఆబౌద్ధవిహారంలో. మీరెక్కడ?"

"ఇంతవరకు ఎక్కడా స్థిరంగాలేదు మీరుండే విహారంలోనే నన్నూ వుండనివ్వవలసిందని ఆచార్య విజ్ఞానంద్ గార్ని అడుగుతాను."

"నిజంగా నేనంటే మీ కిష్టమా?"

"నిజమే"

"వాస్తవమేకదూ. నాకూ మీరంటే యిష్టమే. కాని ఆచార్య విజ్ఞానంద్‌గారి దగ్గరకు వెళ్ళకండి. మా విహా గాన్ని అజమాయిషీ చేసే ప్రభుఘోష్‌గారి దగ్గరకు వెళ్ళండి. మీకోరికను ఆయన మన్నిస్తారు సాధారణంగా ప్రజలెవ్వరూ అలా ఆయన్ని అర్థించగూడదు. మీరు క్రొత్తవారు; ఇక్కడ సాంప్రదాయాలు తెలియనివారు. కనుక ఫరవాలేదు. మీ అభీష్టాన్ని ఆయన మన్నించవచ్చు. మీకు జ్యోతిషశాస్త్రం తెలుసునా?"

"ఏదో కొంచంగా,"

"ఫరవాలేదయితే. అది మీకెంతో తోడ్పడుతుంది. ఆయనకూడా జ్యోతిషశాస్త్రజ్ఞుడే. నక్షత్రాలగురించి ఎంత సేపయినా అనర్గళంగా ఉపన్యసిస్తారు జ్యోతిషశాస్త్రంలో ఆయన పాండిత్యాన్ని శ్లాఘించారంటేచాలు, మీకేం కావాలన్నా ఆయన చేస్తారు."

"అసలు రహస్యం చెప్పి, మీకుటీరంలో తాను సంపా దించేందుకు దారి చూపారు. కృతజ్ఞుణ్ణి."

# 6

వాళ్ళ సోదరభావం చాలా విచిత్రంగా వుంటుంది. వాళ్ళందరూ ఒకేలా జీవిస్తారు. వారి నిత్యజీవితం ఎప్పుడూ ఒకేలా వుంటుంది. కాని సూర్యోదయం దగ్గర్నుంచీ సూర్యాస్తమయమయ్యే వరకూ వారిజీవితంవింతగొల్పుతూ వుంటుంది. అందరూ తెల్లవారుఝామునే మేల్కొంటారు. వాఘరా నదిలో స్నానాలుచేసి వస్తారు. సంఘారామానికి వెళ్ళి ప్రార్థనలు చేస్తారు. ఆ ప్రార్థనగీతాల్లో శాంతి సౌఖ్యాలు సమకూరాలని, ముక్తిలభించాలనే భావం వెల్లడవుతుంది. ఆపాటల పొందిక చిన్నపిల్లల నుయ్యాలల్లో పడుకోబెట్టి జోల పాడి నట్లుంటుంది. ప్రార్థన ముగించే సందర్భంలో—

బుద్ధం శరణం గచ్ఛామి;
ధర్మం శరణం గచ్ఛామి;
సంఘం శరణం గచ్ఛామి;

అని మంత్రోపదేశంలా వల్లిస్తారు.

తరువాత భోజనాలకు వెళ్తారు. తృప్తిగా భోజనం చేస్తారు. అప్పుడు ఎవరి తరగతులకు వాళ్ళు హాజరవుతారు. చిత్రలేఖనం పట్ల అభిరుచి వున్నవారు చిత్రశాలకు వెళ్తారు. శిల్పాలగురించి నేర్చుకొనేవారు శిల్పశాలకు వెళ్తారు. శిల్పాల

స్థానులగురించి అభ్యసించేవాళ్ళు వస్తువాలకూ, వైద్యం గురించి పఠించేవాళ్ళు ఆయుర్వేదశాలకు వెళ్లారు. ఈ తరగతులన్నీ వాఘురా నదీతీరాన చెట్లనీడలందుగానీ, లేదా కొండ గుట్టలప్రక్క చల్లని ప్రదేశాలందుగానీ, జరుగుతుండేవి. తరువాత చాలామంది నిశ్చలంగా కూర్చుని తమకు తెలియని విషయాలనుగురించి తీవ్రంగా యోచిస్తూ వుండేవారు. మరి కొంతమంది తథాగతుని బోధలు, అసూత్రాలగురించి చర్చించుకుంటూనో, లేదా వాటినిగురించి వ్యాఖ్యానాలు వ్రాస్తూనో గడుపుతుండేవారు.

కొందరు పళ్ళూ, ఫలాలు తీసుకురావడానికి అడవికి వెళ్లేవారు. అక్కడపడైనా తటస్థపడితే మొక్కలను గురించీ, మూలికలను గురించీ ప్రత్యేకంగా వైద్యానికి ఉపకరిస్తాయే మోనని పరిశీలనలు చేసేవారు. మరికొందరుయిరుగు పొరుగున వున్న పల్లెలకువెళ్లి బుద్ధుని జీవితంగురించీ ఆయన బోధల గురించీ వివరించేందుకు వెళ్లేవారు. యింకా కొందరు పట్టణాలకు వెళ్లేవారు. వారిలో కొందరు వర్షాకాలంలో తిరిగి వచ్చేసేవారు. మరికొందరు అసలు తిరిగివచ్చేవారేకాదు. మధ్యాహ్నం సమయంలో అందరూ తమపనుల్లో తీవ్రంగా నిమగ్నులయ్యేవారు. శిల్పిరాతిని నిశితంగా పరిశీలించేవాడు. ఏమాత్రం లోసుగులున్నా గుహగా పనికిరాదని, చిత్ర కారుడు బుద్ధ విగ్రహాల్లోనూ, అప్సరసలనో లేదా జాతక కథలనో చిత్రించడంలో లీనమయ్యేవాడు. ఇలా భిన్నమైన కళల నభివృద్ధి చేయడంలో వాళ్లు అలౌకవిధంగా కృషి చేసేవారు. ఆకలివేస్తే ఆనంద్‌విహార్‌కు వెళ్ళి, వండిందేదో

తినేవారు. ఆకలి వేయకపోతే ఆ వ్యవధిలోకూడా పనులు చేసుకునేవాళ్ళు; లేదా కొంచెంసేపు విశ్రాంతి తీసుకునే వాళ్ళు; లేదా తమ కార్యనిర్వాహణను గురించి సంభాషించుకునేవాళ్ళు. ఆకొండల ప్రక్కన అంతా సుత్తి దెబ్బలతోనూ, రాళ్ళ చెక్కడాల వింతైన శబ్దాలతో ఎప్పుడూ రణగొణ ధ్వనులతో నిండివుండేది.

సాయంత్రమయ్యేసరికి పనులన్నీ ఆపుజేసేవారు. కొందరు కొనసాగించాలనుకున్నా, బలవంతంగానైనా మరి కొందరిచే ఆపుజేయించబడేవారు. అన్ని విహారాలనూ కట్టేసి పగలంతా శ్రమచేసిన ఫలితం కారే చెమటనూ, అలసటల్ని తీర్చుకునేందుకు వాఘురానదికి వెళ్లేవారు. నదివొడ్డున కూర్చుని కులాసాగా కబుర్లు చెప్పుకునేవారు. నవ్వుతూ, కేరింతలు కొట్టుకుంటూ పగలంతా 'కొంత' చేశామనే సంతృప్తితో ఆనందాబ్ధిలో తేలియాడుతుండేవారు.

స్నానం ముగిశాక, రాత్రిభోజనాలకు వెళ్ళేవారు. ఎవరికి వారు తమ పళ్లాల్ని, నీళ్ళు త్రాగే లోటాలను తీసుకువెళ్లేవారు. గుంపులు గుంపులుగా కూర్చొని, తమపనుల్ని పర్యావలోకనం చేసుకుని, యితరులు చేసి దానిలో మెళుకుల్ని కూడా చర్చిస్తుండేవాళ్లు. ఆ చర్చల్లో కొందరు కొన్ని సందర్భాల్లో ఉద్రిక్తులయ్యేవారు కూడా. కొన్ని సమయాల్లో ఒక్కచిత్తరువుగానీ; ఒకశిల్పం గానీ అనుకొన్నవిధంగా తయారుకాని సందర్భాల్లో యితరుల సహాయం అర్థించేవాళ్ళు. ఇతరులంతా సహాయపడేవాళ్ళు. అందులో ఏపనైనా ఫలానావాళ్ళే చేశారని చెప్పుకోడానికి

ఎవ్వరూ ప్రయత్నించేవారు కాదు. ఏపనైనా అందరూ కలిసి చేసిందేనని, అందరం ఏకోదరులమేనన్న భావం వెల్లడించి, సంతృప్తి చెందుతుండేవాళ్ళు.

రాత్రి భోజనాలయ్యాక వారంతా చైత్యసంఘారామానికి వెళ్ళి ప్రార్థనలు సలిపేవారు. ఆ ప్రాంతమంతా వారి ప్రార్థనలతో వారి మంత్రపఠనములతో ప్రతిధ్వనిస్తూండేది. సాయంత్రపు వేళల్లో అక్కడ చాలా ఆనందంగా వుండేది. అందరూ గుంపులు గుంపులుగా కూర్చొని పాటలు పాడుకునేవారు. ప్రధాన అధ్యాపకుడైన శ్రీ ఆచార్య విజ్ఞానందుల వారు అందరి మధ్యలో కూర్చుని జాతక కథలను వివరించేవారు సులభశైలిలో, చక్కగా నీతిని స్పష్టీకరిస్తూ వివరించేవారాయన. కొన్ని సమయాల్లో గౌతమబుద్ధుని జీవితం గురించీ, ఆయన నిర్వాణం గురించీ బోధించేవారు. తరువాత బౌద్ధభిక్షువులంతా తమతమ విశ్రాంతి మందిరాలకు వెళ్ళిపోయి తాము వినివచ్చిన కథలను గురించీ, బోధల గురించీ పునశ్చరణ చేసుకుంటూ చివరకు బుద్ధభగవానుని కీర్తిస్తూ ఆయన సూత్రాలను తూ.చ. తప్పకుండా పాటించి తీరాలని నిర్ధారించుకునేవారు.

రాత్రిపొద్దు జరిగిపోతుంటే ఆముదపు దీపాలకాంతిని క్రమంగా తగ్గించేసేవారు. ఆ రాతిబండలనే పరుపులుగా భావించి, మేనువాల్చి నిద్రపోయేవారు. ఆ పరిసరాలన్నీ చాలా ప్రశాంతంగా వుండేవి ఒక్కొక్కప్పుడు దూరాన్నుంచి అడవిమృగాల అరుపులు గాలిలో స్పష్టంగా వినిపిస్తుండేవి అయినా వారంతా, నిర్భయంగా, నిర్వేదనగా, నిర్విచారంగా నిద్రపోయేవారు.

# 7

బదరీనారాయణ, ప్రేమానంద్ యిద్దరూ ప్రాణ స్నేహితులయ్యారు. ఎక్కడకు వెళ్ళినా యిద్దరూ కలిసి వెళ్ళే వారు. ఏపని చేసినా యిద్దరూ కలిసే చేసేవారు. ఒకరు చిత్రం గీస్తూంటే రెండోవారు దానికి రంగులు వేసేవారు. ఇద్దరూ కలసి వెళ్ళి ఎర్రమట్టినీ, పచ్చరాళ్ళనూ, లేకపోతే నల్లరాతినీ తీసుకొచ్చేవారు. రాత్రిళ్ళు పడుకోబోయేముందు యిద్దరూ కళను గురించీ, మతాన్ని గురించీ దీర్ఘంగా చర్చించేవారు. ఆ చర్చలు రాత్రి తెల్లవార్లూ వాళ్ళ మనసుల్లో మసలుతూనే వుండేవి.

"ఏదైనా అవాంతరమొస్తే యిక్కడనుంచి వెళ్ళిపోతారా?" అని ప్రేమానంద్ బదరీనారాయణను ప్రశ్నించాడొకసారి.

"ఎక్కడకు వెళ్తాను?"

"ప్రపంచం చాలా విశాలమైంది. ఖాజురహో, కార్లీ వున్నవి. బాఘ్, ఎల్లోరా లున్నవి, మధుర కూడా లలిత కళలకు పుట్టినిల్లని చాలామంది చెప్తుంటారు."

"అయితే నన్ను వెళ్ళిపొమ్మంటారా?" బదరీనారాయణ ప్రశ్నించాడు.

"కాదండి, ఏదైనా గందరగోళం జరిగితే వెళ్ళిపో తారా అంటున్నాను."

"వెళ్ళకపోవచ్చు. ఎక్కడకు వెళ్ళినా నేను ఆనం దంగా వుండలేను ఇక్కడ చాలా హాయిగా వుండగల్గుతు న్నాను. ఇది నాకు నా స్వస్థలంకన్నా ఎక్కువగా వుంది. ఈ కొండల సామీప్యం, యీ అరణ్య ప్రదేశం, యీ వాఘురా నదీ నాకు దూరమైతే నేను మనోవ్యధతో మరణిస్తాను. నా జీవితంకన్నా యీ ప్రదేశాన్నే ఎక్కువగా ప్రేమిస్తాను. మృత్యువాత బడటం ఎక్కడున్నా తప్పని సరేగదా. ఆ మృత్యుదేవతను యిక్కడుండే ఎందుకాహ్వానించ గూడదు? కాశీవెళ్ళి, గంగలో మునిగి, అక్కడ మరణించడంకన్నా, యిక్కడుంటేనే నేను సుఖంగా మరణించగల ననుకుంటు న్నాను."

ప్రేమానంద్ నవ్వాడు.

"మృత్యువునుగురించీ, నిర్వాణాన్నిగురించీ చాల తేలిగ్గా మాట్లాడేస్తున్నావు బదరీ. నిర్వాణాన్నిగురించి నీ కెంతవరకు తెలుసు? ఆచార్య విజ్ఞానంద్‌గారి ఉపన్యాసాలను వినడానికే లక్ష్యపెట్టవుగదా! ఒకవేళ తరగతికి వెళ్ళినా విన నైనా వినవు... ఏమిటి? నీ మనసు నెక్కడో విహరింప జేస్తు న్నావు? ఏమిటాలోచిస్తున్నావు?"

బదరీనారాయణ ఆలోచనలకు ప్రేమానంద్ అంత రాయం కలిగించాడు.

"ఈ మతాలు నన్ను చాలా కలవర పెడుతున్నాయి. మతాలంటే నాకు చాలా పెద్ద తలనొప్పి. ఇన్ని మతా

లేదట, ప్రేమ సంద్? బ్రాహ్మణ మతాన్నీ, బౌద్ధమతమన్నీ, జైనమతాన్నీ,—ఏమిటివన్నీ? ఆ బోధించేవాళ్ళ మతమనేది అసలు లేనేలేదనీ, తమ ఆశయాలను బోధించ దలచుకుంటే, వున్నదల్లా ఒక్క ప్రేమ, సత్యమేననీ ఎందుకు చెప్పగూడదూ? ఇతరుల జీవితాల్లోకి తలదూర్చి, వాళ్ల నిర్మల మనస్సుల నిరుత్సాహపరచి, వాళ్ళనెందుకు బాధామయ జీవుల్ని చెయ్యాలి? వాళ్ళ ఆలోచనల ప్రకారం వాళ్ళను పోనీగూడదా?

నువ్వు చాలా కోపంగా మాట్లాడుతున్నావు బదరీ. నీ చిన్నతనంలో ఎప్పుడో నువ్వు బాగా దెబ్బతినివుంటావు. దానర్థం నువ్వు మూర్ఖంగా వ్యవహరించావనీ, ప్రతిఫలమనుభవించాలని నేనంటున్నాననీ అనుకోకు. ఏ అధ్యాపకుడూ మతాన్ని గురించి బోధించడు. బోధించేది సత్యాన్ని గురించే. దానినుంచి ప్రజలు మతాల నేర్పాటు చేసుకుంటారు."

"కాని మీ మతం సంగతి ఆలోచించు. దానినిండా ఆశయాలే. శాసనబద్ధమైన నిర్ణయాలు, హక్కులన్నట్లు నిండి వుంటాయి. దీనివల్ల వ్యక్తిని కీలుబొమ్మను చేస్తున్నారు. ఆ ఆశయాలకు భిన్నంగా నడిస్తే తప్పంటారు. ఈ జగతిలో అసలు రైటనిగానీ, తప్పనిగానీ ఏవొకటీ లేదనే నా అభిప్రాయం. కారణాన్ని పురస్కరించుకొని, ఫలితాలనుబట్టి అన్నిటి నిర్ణయమూనూ. ఈ నిర్వాణమనే పదమూ ఆ ప్రయోగమూ చాలా అధ్వాన్నమైన విషయం. పనీ పాటల్లేని సోమరిపోతుల తలల్లో పుట్టి, పరివ్యాప్తిచెందే వ్యాధి తప్ప, మరేదీకాదు. ముక్తియట... ముక్తి! జీవితంలో నూరేళ్ళూ

బ్రతకొద్దని ఎవరనుకొంటారు?" అని కట్టలు త్రెంచుకొచ్చే ఉద్రేకంలో బదరీనారాయణ చెప్పాడు.

తదుపరి బదరీనారాయణ, ప్రేమానంద్‌ల మధ్య నిర్యాణాన్ని గురించి కొంతచర్చ జరిగింది. నిర్యాణమంటే కలకాదని. అది తృష్ణకు తావిచ్చేదికాదనీ శాంతికి దోహదమిచ్చే చర్యయనీ చెప్పాడు ప్రేమానంద్. అతని వాదన వింటూంటే బదరీనారాయణ మధ్యమధ్య పగలబడినవ్వుతుండేవాడు.

ఇలా వాళ్ళిద్దరూ, అభిప్రాయాల్లో భేదాలున్నా, వాదోపవాదాలతో వొకరినొకరు అర్థంచేసుకుంటూ, సన్నిహితంచేసుకుంటూ ఆనందంగా కాలం గడుపుతున్నారు.

## 8

తీరిక వున్నప్పుడల్లా; లేదా బద్ధకంగా వున్నప్పుడల్లా బదరీనారాయణ వాఘురానది దగ్గరకు వెళ్ళి ఆ యిసుకలో కూర్చొని ఏవో ఆలోచిస్తూ వుండటం అలవాటయిపోయింది. జీవితంపట్ల సంతృప్తి పొందుతున్నా, పరిపూర్ణమైన ఆనందం పొందలేకపోతున్నాడు. కారణం అతనికే దురూహ్యం. ఎప్పుడూ ఏదో ఆలోచనతో, భారంగా మత్తుగా వుండేవాడు.

ప్రేమానంద్ కాక మరికొందరు స్నేహితులు అతనికి వున్నారు. కలసినప్పుడల్లా హృదయపూర్వకంగా మాట్లాడుకునేవారేగాని, తరచుగా కలుసుకోవటంమాత్రం జరిగేది

కాదు. అతనికి క్రొత్తగా ఏర్పడిన మిత్రులలో వైద్యుడు గోపీకుమార్, కవి దేవపాల్, శిల్పి వెంకన్న, వ్యోమశాస్త్రజ్ఞుడు, ప్రభుఘోష్...వగైరా లున్నారు. ఇలాంటి మిత్రులు లభించటం నిజంగా బదరీనారాయణ అదృష్టవంతుడే. వాళ్ళ అనుభవాలలోని వింతవిషయాలు, వాళ్ళ శాఖల్లో పాండిత్యం వారి సాహచర్యంవల్ల బదరీనారాయణకు వంటబట్టాయి.

అందరిలోనూ గోపీకుమార్ పట్ల బదరీనారాయణకు అభిమానం మెండు. ఆయనతో కలసి మొక్కల్ని, మూలి కల్ని తీసుకొచ్చేందుకు పర్వత ప్రాంతాలకు, దగ్గరనున్న అడవికీ వెళ్తుండేవాడు. గోపీకుమార్ మంచి పొడుగరి. అంద గాడుకూడా. వయస్సు షుమారు నలభై సంవత్సరాలుం టాయి. తలవెంట్రుకలు బాగా పెరిగి బుజాలమీద పడుతుం టాయి. వాటినెప్పుడూ తలమీద ముడివేసుకునే అలవాటు లేదు, వేటగాడు చూచినట్లు తీక్షణంగా చూస్తాడు. కలలో కనిపించే దేవతా పురుషుని కళ్ళున్నట్లుగా ఆయనలో కను దోయి ప్రత్యేకాకర్షణ. మనిషికి బాగా పొట్టవచ్చింది. ఎదురు రొమ్ముల్లో తెల్లని వెంట్రుకలుండి వింత సోయగాన్ని కలిగిస్తుంటాయి. ఆయుర్వేద వైద్యశాలలో ఆయన వైద్యం గురించి బోధిస్తుంటారు.

"ఏం జేస్తున్నావక్కడ ?" అని గోపికుమార్ బదరీ నారాయణను అడిగాడు

"ఊరికే కూర్చున్నా. ఎక్కడికైనా వెళ్తున్నారా ?"

"చమురు తీసుకురావడానికి అజంతా గ్రామం వెళ్ళొద్దామని బయల్దేరాను వస్తావా ?"

బదరీనారాయణ లేచాడు. ఇద్దరూ కలిసి వాఘురానది దాటి అజంతా గ్రామంవైపుకు వెళ్తున్నారు.

"ఏమిటాలోచిస్తూ కూర్చున్నావు?" అని అడిగాడు గోపీకుమార్.

"ఏమిటో నాకే తెలీదు. మనస్సంతా చికాగ్గావుంది ప్రశాంతపరచుకోవాలని ఎంతో ప్రయత్నించాను. కాని వశంకాలేదు. ఎందుచేతనో ఏమిటో నాకే వింతగా వుంది.

"ఎప్పుడైనా నేరంచేశావా బదరీ? నేరం చేస్తేనే మనస్సు చీకాకుపడుతుంది."

"లేదు గోపీ. ఎప్పుడైనా ఏదైనా నేరమంటూ చేసి వుంటే అది నాకు నేను చేసుకున్నాను. నాపై నాకే విశ్వాసం లేకుండా వ్యవహరించాను."

"ఏంజేశావు?"

"చిత్రలేఖనం నేర్చుకుంటున్న రోజుల్లో సౌందర్యా రాధకుడనై స్త్రీలవెంటబడి నానా పిచ్చిగా తిరిగాను."

"ప్రభుఘోష్ లాంటివాడివన్నమాట. ఆయనా యింతే. ఆకాశంలో నక్షత్రాలకు బదులు, ఆడవాళ్ళ కళ్లల్లో నక్షత్రాల నెక్కువ చూసేవాడాయన. తనను తాను పూర్తిగా మరచిపోయి, చాలా పిచ్చిగా వ్యవహరించాడు. నువ్వూ అలాగే చేశావా?"

"ఆఁ అందుచేతనే యిక్కడ వుంటున్నాను."

"ఏంజేశావు?"

"చాలా చేశాను. అంతా ఓపికగా వినగలవా?"

"వింటాను, చెప్పు." అన్నాడు గోపీకుమార్, వినటం కూడా కష్టమేనా అన్నట్లు.

"మా నాన్నగారొక వైద్యుడు. మాకు బాగా ఆస్తి పాస్తులున్నాయి. మా నాన్నగారికి సంతానం నేనొక్కణ్ణే. ఊహ వచ్చిందగ్గర్నుంచీ, ఆయన చెప్పిందానికి విరుద్ధంగా వ్యవహరించసాగాను ఎప్పుడూ, ప్రతి చిన్న విషయంలోనూ ఆయనకు వ్యతిరేకమే. మాలో ఒకరిపట్ల ఒకరికుండే ప్రేమాభిమానాల్లో ఏ పొరపాటూ లేదు. కాని ఆశయాలు భేదించాయి ఆచరణలో పూర్తిగా భిన్నత్వం."

"ఎలా?"

తన మాదిరిగా నన్ను కూడా ఒక వైద్యుణ్ణి చేయాలని మా నాన్నగారి వుద్దేశ్యము. చికిత్స చేసే విధానాలగురించీ, వైద్య విషయాలనుగురించీ ఆకళింపుచేసుకోమని చెప్తుండేవారు. కాని నాకది సుతరామూ యిష్టంలేదు. నేనొక చిత్రకారుణ్ణి, శిల్పిని కావాలని నా కోరిక.—బిడ్డల్ని తీర్చిదిద్ది, వాళ్ళ బాగోగుల్ని చూడడానికి తల్లిదండ్రులున్నారని, వాళ్ళ చెప్పుచేతల్లో బిడ్డలు పెరగాలని, ఆయన అంటూండేవారు. తన అభీష్టాన్ని అనుసరించమని నన్ను వొత్తిడి చేసేవారు. కాని ఆ మూలికల జోక్యం నాకిష్టం లేవన్నాను. ఆ నాడిని పరీక్షించటంకన్నా, చనిపోయేందుకైనా యిష్టపడతానన్నాను."

"ఏదో సరదాకు అప్పుడప్పుడు బొమ్మలు వేసుకుంటూవుండు. కాని అదే వృత్తిగా చేయాలనుకుంటే, అంతకంటే

తెలివితక్కువతనం యింకోటి లేదు. అయినా ఆ బొమ్మలు గీచినందువల్ల వచ్చే ఘనతేముంది? నీ వెంతో మేధావంతుడ వయితేతప్ప, నీ కళ నెవరు గుర్తిస్తారు?" అని అంటూండే వారాయన.

"నేను మేధావంతుణ్ణే. మంచి మంచి విద్యాలయాలకు వెళ్ళి నేర్చుకుంటాను." అని నేను నా దృఢాభిప్రాయాన్ని వ్యక్తం చేశాను.

"నా కర్థంగాక అడుగుతాను. వైద్య శాస్త్రంలో లేని గొప్పతనం చిత్రలేఖనంలో ఏముందని?"

"మీకు శరీరంలో, రక్తము, మాంసము, ఎముకలు మాత్రమే కనిపిస్తాయి. శరీర వ్యాధులన్నిటికీ మాంసము కారణం. ఏదైనా రోగమొస్తే నివారణకు మందులిస్తారు. మరి కొన్నాళ్ళపాటు మానవదేహం మనగలిగేలా చేస్తారు. అంతేగా? కాని నాకు శరీర మొక దేవాలయం వంటిది. ఆ దేవాలయంలో జ్యోతిలాంటిది ఆత్మ. చిత్రలేఖనం మీ కలా భావోద్వేగం కలిగిస్తుంది. చిత్రలేఖనం మీకలా అనిపింపజేస్తుంది. మీ కానందాన్ని కలిగిస్తుంది, స్వర్గాన్ని చూచి సంబరపడినట్లు మీకు మహోజ్వలానందాన్ని కలిగిస్తుంది. మీరేదో మతాన్ని ఆరాధిస్తారు. చిత్రలేఖనం దేహంతోపాటు ఆత్మకుకూడా చికిత్స చేస్తుంది. మానసిక బాధలనన్నిటినీ నివారణ చేస్తుంది. కోల్పోయిన శక్తి, ఉత్సాహాలను రేకెత్తిస్తుంది. నేను చిత్రించేటప్పుడు అనిర్వచనీయమైన ఆత్మానందా న్ననుభవిస్తాను. సుదూర గగనసీమల్లో ఆనందాబ్ధిలో మునిగి తేలుతున్నానా అనిపిస్తుంది."

"నీ సిద్ధాంతాలు నా ముందు చెప్పకు. చిత్రలేఖనం పట్ల నీకంత పిచ్చివుంటే నీ యిష్టం నేర్చుకో! వెళ్ళిపో... నీ కాళ్ళమీద నీవు నిలబడి నేర్చుకో. ఇక నీకూ నాకూ ఏం సంబంధంలేదు. నా కొడుకనవసి చెప్పుకోను." అని కఠినంగా, నిప్పులు కురిపిస్తున్నట్లు మాట్లాడారు, మా నాన్నగారు.

"నన్ను వెళ్ళద్దంటూ మా అమ్మ ఎంతగానో బ్రతిమాలింది కంటికి మంటికి ఏకధారగా ఏడ్చింది. ఒక్కగాను ఒక్క కొడుకును. ఆమె ఎన్నో విధాల నన్ను ఆపుజేయాలని ప్రయత్నించింది. కాని నేను ఎవరినీ లక్ష్యపెట్టలేదు. వచ్చేశాను. ఇంటికిదగ్గర వుండకూడదనుకొని నేను రాలేదు. నాకు యింటివద్ద అన్ని వసతులూ వున్నాయి. కాని ఒక ఆశయాన్ని అభిమానంగా ఎంచుకొన్నప్పుడు, ఆశయసిద్ధి కోసం, దారిలో ఎన్ని అవాంతరాలొచ్చినా, వాటిని పడ ద్రోక్కుకొని సాగిపోవాలి. ఇలా తనకూ, తన తండ్రికీ మధ్య జరిగిన వాద ప్రతివాదాలను బదరీనారాయణ గోపీకుమార్‌కు వివరించి చెప్పాడు.

"అయితే చిత్రలేఖనం గొప్పకళా నికేతనంలో నేర్చుకున్నావా?"

"అవును. కొద్దిగా డబ్బుపుచ్చుకొని బయలుదేరి వచ్చాను ఆ కళానికేతనంలో ప్రవేశం లభించింది. అయిదు సంవత్సరాలక్కడ వుండి నేర్చుకోవలసిందంతా నేర్చుకున్నాను. అధ్యాపకులవారి కోరికపై రాజప్రాసాదంలో చిత్తరువుల్ని గీయవలసిందని చెప్పగా ఆబాధ్యత స్వీకరించాను. కాని అక్కడ వాతావరణం చాలా భిన్నంగావుంది.

"ఏం జరిగింది?" గోపీకుమార్ ప్రశ్నించాడు.

"స్త్రీలు ......రాజ ప్రాసాదం స్త్రీలతో నిండిపోయింది. మొదట సౌందర్యార్చనకోసం స్త్రీలతో నేస్తం నెఱపాను. తరవాత ఆనందంకోసం వారి సాంగత్యం పెంపొందించుకున్నాను. ఆ తరవాత అలవాటుకోసం వాళ్ళతో కలసి మెలసి మెలిగాను. ఆ అలవాటు - తరవాత ఆడవాళ్ళు ప్రక్కన లేనిదే క్షణం గడపలేనంత దుస్థితికి దిగజార్చింది. త్రాగుడు, జూదంకూడా వాళ్ళు నేర్పారు. నా చిత్రలేఖనం బాగా మెప్పు పొందింది. కాని నా జీవితంమాత్రం వ్యసనాల పరమై దుర్భరమైంది. జీవితంలో ఆనందాన్ని మధురానుభూతుల్ని ఎంతగానో పొందాను. కాని అత్యానంద అతి, మధురమూ వెగటుపింపించింది. కొద్దికాలంలోనే నిర్లిప్తత, నిరుత్సాహం నాలో పెరిగాయి. అంతే, ... ఒకరోజున అదృశ్యమైపోయాను.

"ఎక్కడకు వెళ్ళావు!"

"నాకే తెలియదు. విను వీధిలో దారంతెగిన గాలి పటం చందంగా దారీతెన్నూ లేకుండా తిరగడం మొదలు పెట్టాను. తిరిగినచోటల్లా ఏదోపని చేస్తుండేవాణ్ణి కొన్ని చోట్ల ఏవో బొమ్మలు చిత్రించాను, కొన్నిచోట్ల శిల్పాలు చెక్కాను. ఏంజేసినా. ఏమిటో నాకు ప్రశాంతత అనేది లేకుండా పోయింది. పతన జీవితాన్ని, వ్యథాపూరిత జీవితాన్ని ప్రక్కకు నెట్టేసి వచ్చేసినా, ఆ రుచినీ, ఆ వాసనలనూ పూర్తిగా మరచిపోలేకపోయాను. పూర్వమంత విపరీతం కాకపోయినా, కొంతవరకూ ఆ విధానాలనే అవలంబిం

చాను. అదీ యిష్టంలేకపోయింది. చివరకు ఒక నిర్ణయం చేసి కున్నాను.

ఏ పర్వతాలదగ్గరకో వెళ్ళిపోయి, ఏకాంత జీవితం గడపాలని నిశ్చయించుకున్నాను. అలాఅని ఒక ఋషిని కావాలనిగాని, ఒక సన్యాసిని కావాలనీ కాదు. మొత్తానికి నా జీవిత పంథా మార్చుకోవా లనుకున్నాను. ఏవో పెద్ద పెద్దపట్టణాలకు వెళ్ళి కళారాధనకే నాజీవితాన్నంకితంచేసి, నా మనస్సుకు పరిపూర్ణ సంతృప్తికలిగే విధంగా చిత్రలేఖనం అధ్యయనం చేయాలనుకున్నాను."

"నీవు ఏస్త్రీనైనా ప్రేమించావా?"

"పొరపాటున కూడా ప్రేమించలేదు. వాళ్లకిష్టమై, మోజుకొద్దీ వచ్చారు. ఆదంజుట్టుకున్నాను; ఆనందించాను. అంతే."

"ఎవరినీ ప్రేమించలేదా? పోనీ ప్రేమించగలవా?"

బదరీనారాయణ నవ్వాడు.

"ఆడమళయాళంతో యింకేంపని. ఏం జేసికోను? ఆ పాపపంకిలాన్నుండి బయటపడ్డాను. ఇప్పుడు ప్రశాంతంగా జీవిస్తున్నాను.."

"ఏమో...ఏదో ఆలోచిస్తున్నావు. బహుశా ఒకస్త్రీ తోడుగావుంటే యీ ఆలోచనలు వుండవేమో? ఎవరైనా ఒక స్త్రీని ప్రేమిస్తే నీ జీవితానికింకేమీ కొదవవుండదేమో?"

"ఆ ఆలోచనలకు దూరంగా వుండాలనే యిట్లా వచ్చాను."

"చాలామందిని ప్రేమించానన్నావుకదూ?"

"అది ప్రేమకాదు. కాముకసౌఖ్యం కాముకసౌఖ్యానికీ ప్రేమకూ చాలా తేడావుంది.

తరవాత యిద్దరూ ఆ గ్రామం వరకూ మౌనంగా నడచి వెళ్లారు. చమురు ఒక సీసాలో పోయించుకుని అడ్డదారిని తిరుగుముఖం పట్టారు, తిరిగి వస్తూండగా దారిలో ప్రేమానంద్‌ను కలుసుకున్నారు.

"ఎక్కడకు వెళ్లావు బదరీ? నీకోసం యీ పరిసరాలన్నీ గాలించాను. "చమురు తీసుకురావడానికి వెళ్లాం. నువ్వెక్కడకు బయలుదేరావు?"

"జామపళ్ళు తీసుకుని రావడానికి. వస్తారా? అని యిద్దర్నీ అడిగాడు ప్రేమానంద్?

"నేను రాను నాకు చాలా పనివుంది. వెళ్ళాలనుకుంటే నువ్వు వెళ్ళు బదరీ" అన్నాడు గోపీకుమార్.

బదరీనారాయణ, ప్రేమానంద్‌లు ఒకరిముఖా లొకరు చూసుకున్నారు, ఇద్దరూ కలసి తోటవైపుకు నడక సాగించారు. గోపీకుమార్ వెళ్ళిపోయాడు.

"జామపండు యిక్కడెక్కడ దొరుకుతుంది?"

"ఎక్కడ దొరికేదీ నాకు తెలుసు. రావెళ్దాం. ఎప్పుడు కావలసి వచ్చినా అక్కడకే వెళ్లి తీసుకొస్తుంటాను. నువ్వా ప్రదేశం చూస్తే చాలా ఆనందిస్తావు. ఇప్పుడు పళ్ళు కాచే కాలంకూడా"

"సరే పద; చూస్తాంగా."

ప్రేమానంద్ బదరీనారాయణ ముఖంలోకి చూశాడు. ఆ ముఖంలో ఏదో క్రొత్తదనం కనిపించింది.

"గోపీకుమార్ కథలేమైనా చెప్పాడా?"

"లేదు. చెప్తాడా ఆయన?"

"సహజంగా చెప్తుంటారు. పైకి ఎంతో ముభావంగా కనిపించినా చాలాహాస్యంగాచెప్తాడు. మీరేం చెప్పారుమరి?"

"నాగురించే. ఇక్కడకు రాకముందు నేనెలా జీవించిందీ వివరించాను. దానికింత మథన పడనక్కరలేదని సముదాయించారు."

"అదే నేనూ అడగాలనుకొంటున్నాను బదరీ. ఎవరినైనా ప్రేమించావా? అదే ఏ స్త్రినైనా?... స్త్రీలగురించి చాలా తెలుసనుకో; కాని ఎవరినైనా ప్రేమించావా?"

"లేదు. ఎలా ప్రేమించగలను? స్త్రీలు స్నేహం చేయడానికి వస్తేగా? ఆనందం పొందటానికి, అందం జుర్రుకోమని వచ్చేవారు."

"స్త్రీలంటె నీకంతకోపం యెందుకు బదరీ? ఎవరినైనా ప్రేమించినట్లయితే స్త్రీలంటె ఏమిటో తెలిసేది?"

"సరేలే. స్త్రీలగురించి సంభాషణ మన కెందుకుగాని మానేయ్. ఆ జామపళ్ళ గురించి మాట్లాడు" అని అనేసి మరుక్షణంలోనే, "నువ్వు ప్రేమించావా?" అని తనకు తెలియకుండానే ఛటుక్కున అడిగేశాడు.

"లేదు కాని స్త్రీలనుగురించి నీకు తెలియని కొన్ని సంగతులు నాకు తెలుసు. స్త్రీలు చక్కగా అర్థం చేసుకోగలరు."

"నాకు చాలా ఆశ్చర్యం గొలుపుతుంటావ్ ప్రేమ్. ఏవేవో వింతకథలు, వింత విశేషాలు చెపుతుంటావు."

ప్రేమానంద్ నవ్వాడు. అతని కళ్ళల్లో తళుకులీన బడకీ గ్రహించాడు.

# 9

తోటలో చిన్నయిల్లు. ఇంటిచుట్టూ వున్న ప్రహరీ పెద్దఎత్తుగా లేదు. తలెత్తిచూస్తే యింటిలో పరిజనాన్నీ, పరికరాల్నీ తేలిగ్గా చూడవచ్చు. తోటవప్పుగా పెరిగి చూడ ముచ్చటగా వుంది. మామిడిచెట్లు, దానిప్రక్కనే జామచెట్లు గుబురుగా పెరిగివున్నాయి. కొన్ని సపోటాచెట్లు, మరికొన్ని ఖర్జూరపు చెట్లు, ఒక కొబ్బరిచెట్టు కూడా వున్నాయి. ఒక ప్రక్క కూరలపాదు లున్నాయి. వాటిచెంతనే మూడు వరుసలు తాటిచెట్లున్నాయి. వాటికవతల నారింజచెట్లు, దబ్బ చెట్లూ దట్టంగా పూతమీద వున్నాయి.

ఇంటి నానుకొని పూలమొక్క లున్నాయి. పూల మొక్కల సరసనేవున్న జామచెట్టు తెగకాచింది. కాయల బరువుతో చెట్టు వంగిపోయింది.

"ఎక్కడ ఎవరైనా నీకు తెలుసా ప్రేమ్?"

"తెలుసు."

"దొంగతనం చేస్తావా?"

"ఉహూం !"

"మరి పండ్లు ఎలా తెస్తావు ?

"కోసి."

"యజమాని చూస్తే వూరుకుంటాడా ?"

"ఏమీ అనడు."

"నువ్వు అసాధ్యుడివి ప్రేమ్ !"

ఇద్దరూ గోడదూకి లోపలకు వెళ్లారు. ప్రేమానంద్ చెట్టును సమీపించాడు. పళ్ళవంక చూచాడు. ఏపండు కోయడమా అని ఆలోచిస్తూ ఒక్కొక్కదాన్ని పరికిస్తున్నాడు. ఒకపండు నందుకోవాలని ప్రయత్నించాడు. పండు అందకపోవటం మూలంగా ప్రక్కనే గోడవలి కట్టివున్న కర్రను తీసి కొన్ని పండ్లు కోయటానికి సిద్ధపడ్డాడు. కాని పై వంక చూచిన మరుక్షణంలో కెవ్వుమని కేకవేశాడు. ప్రక్కకు ఎగిరి గంతేశాడు.

బదరీనారాయణ గభాలున మిత్రుని దగ్గరకు వెళ్ళాడు. ప్రేమానంద్ గజగజ వణికిపోతున్నాడు. కొమ్మమీద నల్లత్రాచు పడగవిప్పి బుసలుకొట్టూ వుంది. బుసల ధ్వని హెచ్చింది. బదరీనారాయణ అది గమనించి ప్రేమానంద్‌ను ప్రక్కకు నెట్టేసి ఆ స్థానంలో బదరీనారాయణ నుంచున్నాడు.

నల్లత్రాచుకు రౌద్రం హెచ్చింది. బదరీనారాయణ సాహసాన్ని సహించలేకపోయింది. పెల్లుబికే పౌరుషంతో బుసకొట్టి కాటువేసింది. కాని బదరీనారాయణ యుక్తిగా తప్పించుకొన్నాడు. కోడెత్రాచు కొమ్మమీద అలాగే తోక

మీద నుంచొని నాట్యం చేస్తున్నట్లు ఆడుతూవుంది కొన్ని క్షణాలనంతరం రోషం నెమ్మళించింది. కాబోలు, నడుం కొమ్మమీదకు దించేసి ప్రాకిపోబోతోంది. దాని కదలికలన్నీ కనిపెట్టుతూ వున్న బదరీనారాయణ దాని మెడ గబాలున పట్టుకుని క్రిందకు లాగేశాడు. త్రాచుపాము తప్పించుకోవాలని మెలికలు తిరుగుతూ ఎంతో ప్రయత్నించింది, కాని బదరీనారాయణ పట్టు విడవలేదు. రెండో చేత్తో దాని నడుం గట్టిగా పట్టుకొని ప్రక్కకు తీసికొనివెళ్ళి ఒకరాయి తీసికొని దాని నెత్తిమీద మోది దాని శిరస్సును నజ్జునజ్జు చేశాడు.

పామును చంపాక లేచి ప్రేమానంద్ వంక చూచేసరికి వయసు మళ్ళిన ఒక వనితచేతుల్లో గజగజ వణికిపోతూ వున్నాడు. ఆమె-సౌందర్యం పొందికగా తీర్చిదిద్దిన అంగ సౌష్టవంగల నారీమణి. అంత పొడుగూకాదు. అంత పొట్టీ కాదు. సామాన్యంగా వుంటుంది. ఆమెలో చెప్పనలవిగాని గాంభీర్యమూ, ఠీవీ ద్యోతకమవుతున్నాయి. కళ్లు లోతుకు పోయినై. బదరీనారాయణ కళ్ళల్లో ప్రస్ఫుటమయ్యే విజయోత్సాహం చూచి పెద్ద ప్రమాదం తప్పినట్లుగా ఆమెను నిట్టూర్చేలా చేశాయి ఆమె నేత్రాలు.

"చచ్చిందా?" ఆమె అడిగింది.

"చచ్చింది" బదరీనారాయణ బదులు పలికాడు.

బదరీనారాయణ ప్రేమానంద్ దగ్గరకు వెళ్ళి "వెళ్దాం రా. మరేం భయంలేదు" అని అన్నాడు.

అయినా ప్రేమానంద్ యింకా వణికిపోతూ ఆ వనిత చేతుల్లోనే వున్నాడు.

"మీ అనుమతి లేకుండా మీ తోటలో ప్రవేశించి నందుకు మన్నించండి. మావల్ల మీకే అపకారమూ జర గదు." అని క్షమాభిక్ష కోరుతూ అన్నాడు బదరీనారాయణ.

ప్రేమానంద్‌ను బలవంతంగా చెయ్యి పుచ్చుకుని తన ప్రక్కకు లాగాడు. "రా-పోదాం ఆడదానిలా ఏమిటీ యీ ఏడ్పు! మగవాడవు కాదూ? అని వీపుమీద ఒక్కటి చరిచాడు నెమ్మదిగానే.

బదరీనారాయణ యిలా మాట్లాడేసరికి ఆ వనితకు ఆగ్రహం వచ్చింది. పొర్లుకొచ్చిన కోపాన్ని తమాయించుకో లేక మనసులో మర్మాన్ని వెళ్ళగ్రక్కేసింది.

"మగవాడుకాదు అమ్మాయి, నా కూతురు. ఎందు కలా కొట్టావు?" బదరీనారాయణ నిర్ఘాంతపోయాడు యీ మాటలువిని. "ప్రేమానంద్ మగవాడు కాదూ?—'బాలిక' ఆశ్చర్యపోయాడు. కన్నీరు కార్చుతూ తల్లి చేతుల్లోవున్న ప్రేమానంద్ ముఖంలోకి చూచేసరికి బదరీనారాయణకు కోపంవచ్చింది. ప్రేమానంద్‌తో స్నేహం ప్రారంభమైననాటి నుంచీ కొన్ని కొన్ని సన్నివేశాలు గుర్తుకొచ్చినాయి. వాటి నతను లక్ష్యపెట్టనేలేదు. బౌద్ధ భిక్షువుల్లో చొక్కా వేసుకునే అలవాటు ఎవరికీ లేదు; ఒక్క ప్రేమానంద్‌కు మినహా! ప్రేమానంద్ చొక్కా వేసుకోడానికి కారణం ఏమిటి? ఆ కంఠంలో వినలేని మాధుర్యం వుంది. పురుషుల కంఠాల్లో ఆ శ్రావ్యత వుండదు. తనెక్కడా చూడలేదు. అదీ అను

మానం కలిగించిందప్పుడు. ఆ ముఖారవిందంకూడా అంతా ఆడపిల్లలముఖం వున్నట్లే వుంది. అదీ అనుమానం కలిగించిన అంశమే. అయినా అప్పట్లో దేన్నీ పట్టించుకోలేదు. కాని యిప్పుడర్థమయింది—అసలు రహస్యమేమిటో! కోపం కట్టలు త్రెంచుకొచ్చింది.

"నీవు, బాలికవా!" అని ప్రేమానంద్ వంక చూచి ఏదో చెప్పరాని బాధతో మరుక్షణంలో అక్కడనుంచి వెళ్ళిపోయాడు బదరీనారాయణ.

# 10

సాయంత్రం కావడంవల్ల పని ఆపుచెయ్యబడింది. స్నానం చేశాక ఎవరి మఠంలోకి వారు వెళ్ళిపోయారు. ప్రతి వొక్కరూ వెంటనే భోజనశాలకు వెళ్ళారు. భిక్షువు లందరూ వరుసలో తనుతమ పాత్రల్ని పుచ్చుకుని కూర్చున్నారు. వడ్డన జరుగుతూంటే ప్రభుఘోష్ పరిశీలించారు. ఆయన పొట్టిమనిషి. కళ్లు చిన్నవి. అయినా నిశితంగా చూడగలవు. ఆయన కంఠధ్వని స్త్రీ కంఠధ్వనిలా వుంటుంది. శాస్త్రాల్లో ఆయన నిష్ణాతుడు. ఎక్కువకాలం లెక్కలు కట్టడంలోనే ఖర్చయ్యేది. రాత్రిళ్ళు ఆకాశంలో వివిధ నక్షత్రాల్ని చూపి వాటికిగల పోలికల్నీ, తారతమ్యాలనూ వివరించేవాడు. అదే కాకుండా ఆహార వ్యవహారాల నిర్వహణ బాధ్యతకూడా

ఆయనదే భిక్షువులకు నివాసమందిరాల నేర్పాటుచేసి, ఎవరికీ యిబ్బందీ లేకుండా చూచేవాడాయన. రాష్ట్రాలలో పెక్కుమంది వ్యాపారస్థులతో పరిచయానుబంధముండేది. కాయగూరలెప్పుడూ తాజాసరుకు వుండేలా చూడవలసిన బాధ్యత ఆయనపైన వుంది. అందువల్ల యిరుగు పొరుగు గ్రామాల ప్రజలు ఎప్పుడు తెస్తారా అని ఎదురు చూస్తుండేవాడు.

ఒక బండిమీద బియ్యం వచ్చినై. ఇంకో బండిమీద కూరగాయలు వచ్చినై. భిక్షువులే వెంటవుండి బండ్లను తోలించుకు వచ్చారు. మరొక వ్యక్తి పెద్దతొట్టి, ఒకకుండా పట్టుకొని నిలుచున్నాడు. ఆ వ్యక్తి బౌద్ధభిక్షువులు త్రాగే కుండలనిండా నీరుపోశాడు.

బదరీనారాయణ తింటూ ఒకమూల కూర్చున్నాడు. ఆదరా బాదరాగా తినడం లేదు. ఆకలి లేనట్లుంది. అయినా ప్రతి వొక్కరూ తినాలనే నియమంవున్నందువల్ల తింటున్నాడు. అన్నంలో కూర కలిపాడు. నెమ్మదిగా తిన్నాడు.

వెంకన్న బదరీనారాయణ దగ్గరకు వచ్చాడు. బదరీని అభినందించాడు. వెంకన్న పొట్టిమనిషి కాని కండపుష్టి బాగా వుంది. విశాలమైన నుదురు...గుండ్రని కళ్ళు, కిరవొచ్చినట్లుంటాడు. సలహాలివ్వడంలోనూ, యితరుల వాదనల్ని కాదని వాదించడంలోనూ ఘటికుడు. మంచివాడు. అంత తేలిగ్గా కోపతాపాలకు లోనయ్యే మనిషి కాదు.

వెంకన్న బదరీనారాయణ ప్రక్కనే కూర్చుని తింటూ బదరీని యిలా అడిగాడు.

"ఇవ్వాళ "ఏంజేశావు బడక్?"

"ఏమీ చెయ్యలేదు. నువ్వేం జేశావు?"

"మొగలు చైత్యారామంలో చిత్రిస్తూవున్నాను ఏనుగుబొమ్మ. నమ్ము; నమ్మకపో - చాలా కష్టంగా వుందనుకో. అయినా గీచాను. అంతా చిత్రించాను కాని ఒక్క తొండమే వేయలేదు. ఎంత ప్రయత్నించినా సరిగ్గా రావడం లేదు. ఎలా గీయడమో?"

"అసంపూర్తిగానే వుంచేశావా?"

"ఆఁ! విసుగ్గావుంది. కాని పూర్తి చేయాలిగా. రోజంతా రాతిమీద బొమ్మగీచి, ప్రయత్నించాను. కాని ప్రయోజనం లేకపోయింది. ఏనుగు తొండంగాగాక చెట్టు కాండమన్నట్లు తయారైంది. ఇంకేం చెయ్యను?"

"పోనీ ఎవరి సహాయమైనా తీసుకోక పోయావా?"

"వాఘురా దగ్గర ప్రేమానంద్ వుంటే వెళ్ళాను. సంగతి చెప్పాను. నాకో బొమ్మ స్కెచ్ వేసిచ్చాడు. అయినా సరిగా రాలేదు."

"ప్రేమానంద్ తొండాన్ని గీచియిస్తే దాన్ని కాపీ చేయక పోయావు?"

"అతను గీచేవాడే కాని నేనుశిల్పం చెక్కాలిగదా."

"సరేకాళ్ళు. రేపు నేనొచ్చి చూస్తాలే."

"ఇప్పుడు నాతోరా. ఇవ్వాళంతా దానికోసం నానా అవస్థపడ్డాను."

భోజనం చేయడం ముగిసింది. బయలుదేరి వెళ్లాం. రమ్మని వెంకన్న లేచాడు. బదరీ నారాయణ ఆపు జేశాడు.

"వాఘురా దగ్గర ప్రేమానంద్ ఏంజేస్తున్నట్లు."

"అక్కడ కూర్చుని ఏడుస్తున్నాడు. ఏం జరిగిందని ఎన్నిసార్లడిగినా ఏం చెప్పటంలేదు. ఆయేడుపుకు దరీఅంతూ లేనట్లుంది. అడిగీ అడిగీ- ఎంతకూ చెప్పకపోయేసరికి విసుగు పుట్టి వచ్చేశాను. ఏం జరిగిందో నీకేమన్నా తెలుసా?"

బదరీనారాయణ బుజాలెగరేశాడు. వెంకన్న చింతాక్రాంతుడై చూచాడు.

"రేపు నేనొచ్చి సరిజేస్తాలే. ఎందుకనవసరంగా లేనిపోని మధనపడతావు. ఎప్పుడూ మధనపడటమేనా! అసలు దేన్నిగురించీ చింతలేకుండా వుండలేవూ?" అని అన్నాడు బదరీ.

వెంకన్న బరువుగా నిట్టూర్చాడు.

"చింతపడకుండా వుండాలనే వుంది కాని ఎట్లా? చింతలలో పుట్టి పెరిగినవాణ్ణి. నీకు తెలియనిదేముంది?" బదరీనారాయణ తలూపాడు. వెంకన్న వెళ్ళిపోయాడు ఇతర భిక్షువులంతా భోజనం చేయడం పూర్తిచేసి తమ పాత్రల్ని కడుగుతూవుండటం చూచాడు. ఇష్టంలేక నెమ్మదిగా తిన్నాడు తను. ఆలోచిస్తూ కూర్చున్నాడు. పాపం! వెంకన్న వొట్టి అమాయకుడు. వెంకన్నను గురించి ఆలోచించాడు. చిన్నచిన్న విషయాలకుకూడా యీ అమాయక జీవులెందుకిట్లా చింతపడుతూ వుంటారా అని తలంచాడు."

# 11

వెంకన్న ఒక శిల్పకారుని కొడుకు. వెంకన్న వయస్సు పెరుగుతున్నకొద్దీ, వెంకన్న చేతిలో మట్టి దానంతట అదే బొమ్మలుగా తయారై పోతున్నట్లు, నేర్పరయ్యాడు. వంశ పారంపర్యంగా వచ్చిన ఆస్తి అంతగాలేదు. అయినా వెంకన్న తండ్రి బాగా సంపాదించుటవల్ల వాళ్ళకుటుంబం సుఖంగానే జీవనం సాగిస్తోంది.

వెంకన్నకు తల్లిలేదు. వెంకన్నను భూమ్మీదపడేసి ఆమె భూమాత వొడిలో దాక్కుంది. అందువల్ల వెంకన్నను తండ్రివొక్కడే చిన్నప్పట్నుంచీ పెంచాడు. మట్టిని బొమ్మలుగా చేసి, ఆ ఆకృతులకు తగినట్లు శిల్పాలు చెక్కడంకూడా నేర్పాడు. వెంకన్న ఎక్కువ నేర్చుకోకముందే అతని తండ్రి పరమపదించాడు. వెంకన్నను మేనమామలు తమ రెక్కలు క్రిందకు తీసుకున్నారు. యుక్తవయస్సు వచ్చేవరకూ వాళ్ళ ఆధీనంలోనే పెరిగాడు. తన జీవితం తాను గడుపుకుంటానని పిత్రార్జితం యిమ్మని మేనమామల్ని అడిగాడు.

వెంకన్న యిలా అడిగేసరికి వెంకన్న మేనమామలు ఆశ్చర్యపోయారు. ఆస్తిపాస్తులేమీ లేవన్నారు. ఏ కొద్దో గొప్పో వున్నా వెంకన్న చదువుకే సరిపోయిందనీ, యిప్పుడు తామే దీనస్థితిలో వున్నట్లు తెలియజేశారు.

"నన్ను దోచుకుతిన్నారు. మా నాన్న చమటోడ్చి సంపాదించిన సొమ్మంతా కాజేశారు. కాని నాకోసం ఖర్చు చేసినట్లు చెప్తున్నారు. నన్ను నిలువునా దోచుకుతిన్నారు."

మేనమామలకు చచ్చేకోపం వచ్చింది. వెంకన్నను తెలివితక్కువ వాడంటూ నిందించి యింటినుండి వెళ్ళిపొమ్మన్నారు.

ఎక్కడకు వెళ్లాలో వెంకన్నకు అర్థంకాలేదు. ఆ రాత్రి దేవాలయంలో నిద్రపోయాడు. మరునాటినుంచీ ఏమి చేయాలో తెలియని వెంకన్న జీవితంగురించి భయవిహ్వలుడై పోయినందువల్ల రాత్రంతా సరిగ్గా నిద్రపట్టనేలేదు. బాగా ఆకలి వేసింది.

మరునాడు ఎలాగో పని లభించింది. తన తండ్రి నెరిగున్న పరిచయస్థు డెవ్వరో వెంకన్నను చూచి గుర్తించాడు. శివుని బొమ్మ తయారు చెయ్యమని పని కల్పించాడు.

వెంకన్నకు ఆశ్రయం లభించింది. తిండికేం లోటు లేదు. శివుని విగ్రహం చెక్కడంలో రాత్రింబవళ్ళూ శ్రమిస్తున్నాడు వెంకన్న. శివలింగానికి బదులు శివుని విగ్రహం ప్రతిష్ఠింపబడాలని వుద్దేశింపబడింది. వెంకన్న కృషిసల్పుతున్నాడు. ఎంతో జాగ్రత్తగా శిల్పం చెక్కుతున్నాడు. దేహం చాలా అందంగా వుంది. కాళ్ళు చాలా బలిష్టంగా వున్నాయి ముఖం గంభీరంగా వుంది. తలపై గంగ పరివేష్టితురాలై వుంది. నాలుగు చేతులున్నాయి. ప్రతిచేతికి ఒక్కోరకమైన చిహ్నం వుంది. ఒక చేతిలో త్రిశూలము, ఇంకొక చేతిలో తామరపువ్వు, మూడో చేతిలో ఖడ్గము, నాలుగో

చేతిలో డమరుక వున్నాయి. మొదట మూడింటిని చక్కగా చెక్కాడు. కాని డమరుకను తయారుచేయడంలో అనుకున్న స్థాయి చేరలేకపోయాడు.

అది సరిగ్గా రావటంలేదు. అనేక శిలలమీద నమూనాలను చెక్కడానికి ప్రయత్నించాడు కాని లాభం లేక పోయింది. నిరుత్సాహ పడ్డాడు. ఇంకేవో ప్రయత్నాలు చేశాడు. అయినా సాధ్యం కాలేదు. చివరకు విసుగుపుట్టి అసలు ప్రయత్నించడమే విరమించేశాడు. విగ్రహం చెక్కమని పని కల్పించిన వ్యక్తి, విగ్రహం చూచి సంతోషించాడు. గాని డమరుక చెక్కకపోవడంవల్ల అసంపూర్తి చిత్రాన్ని దేవాలయంలో ప్రతిష్ఠించడం సాధ్యపడదని చెప్పాడు. వెంకన్న పనితనంవల్ల తాను చాలా ఆశాభంగం పొందినట్లు కూడా వెల్లడించాడు.

ఈవిగ్రహాన్ని తయారించడంలో తన నైపుణ్యం అక్కరకు రాకపోయిందని తనకుతానే ఏవగించుకున్నాడు వెంకన్న అక్కడనుండి బయలుదేరి వెళ్ళిపోయాడు. మళ్ళీ తిండీ తిప్పలు, తలదాచుకోడానికి తావు - వీనిని గురించి మనస్సు బాధ పడటం అని దుర్భరవేదన అనుభవిస్తూ ఏడురోజులు తిరిగాడు. ఎవరైనా తన స్థితికి జాలిపడి యింత పెడ్తే తినేవాడు. లేకుంటే ఏ చెరువునీళ్ళతోనో, పొట్ట నింపుకొనేవాడు ఇకపై మానవునిగా జీవించడమే దుర్లభమనిపించింది.

అంతలో ఒక శిల్పిని కల్సుకోవడం జరిగింది. వయసు మళ్ళిన మనిషి. యుక్తులు పన్నడంలో జిత్తులమారని ఆయన కళ్ళే చెబుతున్నవి. అయినా ఆరోగ్య సంపన్నుడు దయార్ద్ర

హృదయుడుకూడా. వెంకన్నను తనచేతిక్రిందకు తీసికున్నాడు. వెంకన్న మనోవ్యథ మరచిపోయి, ఆయన ఆధ్వర్యంక్రింద పని చెయ్యడానికి సంసిద్ధుడయ్యాడు. కాని ఆ వృద్ధశిల్పి కుమార్తె "శైవబాల"తో చనువుగా వుండేవాడుకాదు.

ఆమె అతిలోక సౌందర్యవతి. హంసలా తెల్లగా ఆకర్షణీయంగా వుండి, చూపరుల హృదయాలను రెప రెప లాడిస్తుంది. మనిషి సన్నగా, పురాణాల్లో కావ్యనాయికా లక్షణాలతో వుంది. మల్లె మొగ్గల్ని అంటుకుంటే వాడి పోతాయేమో నన్నట్లు ఆమె దేహం అంత కోమలంగా వుంది. కాని అందమైన జీవరాసులకుండే సహజమైన స్వాతిశయమూ గర్వం ఆమెలోనూ వున్నాయి.

ఆమె ఎక్కడకు వెడితే అక్కడకు యువకులు వెఱ్ఱెత్తి నట్లు వెంటాడేవారు. ఆమె నడిచివెళ్ళిన దారిని ఎంతో పవిత్రమైనదిగా భావించేవారు. వారలా ఆరాధించటంవలన ఆమెలో అహంకారం వెఱ్ఱితలలువేసి, వివేకాన్ని మరచి, హద్దులు మీరింది.

"వెంకన్నకు శైవబాలపట్ల యిష్టమూలేదు;అయిష్టమూ లేదు. ముభావంగా వుండేవాడు. ఆమెలో పెచ్చుపెరిగే అహంకార లక్షణాలను చూస్తుంటే అరికాలిమంట నెత్తి కెక్కినట్లు బాధపడేవాడు.

వెంకన్న తత్వం ఆమె కర్థంకాలేదు. అతను అందరి లాంటివాడుకాదని గుర్తించింది. ఇతరులమాదిరిగా అతడు కూడా తన్ననుసరిస్తాడని, తన అందచందాలకు బారలు వేస్తాడనీ మొదట్లో అనుకొంది. కానీ అతనిలో అలాంటి లక్షణా

లేవీ కనిపించకపోయేసరికి, అతని తత్వమే వేరుగా వుండేసరికి ఆమెకు చాలా చిత్రంగా తోచింది. ఈ సంభ్రమాశ్చర్యాలు ఆమెలో తొట్రుపాటునేకాక, కలవరపాటును సైతం కలిగించి క్రమంగా అతన్ని గాఢంగా ప్రేమించే వైఖరికి దోహదమిచ్చాయి. ఆమె అతన్ని ప్రేమిస్తోందిప్పుడు.

వెంకన్నకు మళ్లీ ప్రశాంతత దూరమైంది. స్త్రీలంటే ఏవగించుకొని సాధ్యమైనంత దూరంగా వుండేందుకు ప్రయత్నించేవాడు. అతని నిర్మల జీవితానికి 'శైవబాల' ఒక పెనుభూతమై కూర్చుంది. ఆమె పీడ విరగడ చేసికోవడమెట్లాగా అని వెంకన్న బాధపడ్డాడు. అతడు చేసే ప్రతి పనినీ ఆమె జోక్యంచేసికొనేది. అది వెంకన్నను మరింత వ్యధాపూరితుణ్ణి చేయడం వల్ల, అతడు ఆమెను చూస్తేనే మండిపడి పోయేవాడు. తన దరిదాపులకు రావద్దని కసురుకునేవాడు. కాని, జలగపట్టుకుని వదలనట్లు అస్తమానమూ ఆమె అతన్ని వెన్నాడుతుండేది. నీడని నీడలా అనుసరించేది. అందువల్ల అతడు మరింత భయపడ్డాడు.

ఇదంతా వెంకన్న ఆమె తండ్రితో చెప్పాడు ఒక రోజున. "ఆమెకు పెళ్లి చెయ్యకుండా ఎందుకున్నారు?" వెంకన్న అడిగాడు. "పెళ్లి చేసుకునేదెవరు?" ఆమెతండ్రి ఎదురుప్రశ్న వేశాడు. "చాలామందున్నారు. ఎవరుపడితే వాళ్ళే ఆమెను పెళ్ళాడేందుకు ముందుకొస్తారు?"

"ఎవరో వస్తారంటూ వెందుకు? నువ్వే రా! నువ్వే చేసుకో."

"నేనా! నాకు ఆడవాళ్ళంటే చాలా అయిష్టం. మీ అమ్మాయంటే నాకు అసలు..." మధ్యలోనే చెప్పడం ఆపేశాడు వెంకన్న.

"నీవంటే 'శైవ'కి పంచప్రాణాలు. మీ యిద్దరూ ఆలుమగలైతే చక్కగా వుంటారు. ఈడూజోడూ కలుస్తుంది. దీన్ని గురించే కొన్ని రోజులనుంచీ ఆలోచిస్తున్నా. ఇంకో పది రోజుల్లో పెళ్ళి జరుపుకుందాం. సరేనా!"

"ఊహూఁ! నేనెవర్నీ పెళ్ళి చేసుకోను, వెంకన్న కోపంగా తన అయిష్టాన్ని తెలియబరిచాడు.

"ఈ సమాధానంతో శైవ తండ్రి ఉగ్రుడైపోయాడు"

"నువ్వు చేసుకుంటావు. ఇవ్వాళటినుంచి ఖచ్చితంగా పదోరోజున పెళ్ళి జరుగుతుంది. మా అమ్మాయిని నువ్వు పెళ్ళి చేసుకోవాలి." అని గర్జించాడు ఆమె తండ్రి.

వెంకన్నకు మతిపోయినట్టయింది. తనలోతాను ఎన్నో తిట్టుకున్నాడు. సరిగ్గా పనిచేయలేక పోతున్నాడు. తిండి సహించటంలేదు. అతనిలో యీ మార్పు శైవను కలవర పరచింది. వెంకన్నను బుజ్జగించి అన్నంపై సుముఖుణ్ణి చేసేందుకు శైవబాల శతవిధాల ప్రయత్నించింది. కాని వెంకన్న మరింత మండిపడుతుండేవాడు. తనమెడకు గుదిబండ తగిలించబడుతుందనీ, యీ వేదనతో తాను మరణించడం తధ్యమేననీ తలంచాడు వెంకన్న.

తనను వెంకన్న దగ్గరకు రానీకుండా వుండటం, తనను ఏవగించుకోవడం శైవబాల సహించలేకపోయింది. లోకు

లంతా తనను వెంటాడి, తనచే తిరస్కరింపబడుతూవుంటే, తాను యీమూర్ఖునిచేత తిరస్కరింపబడుతూవుండటంతో ఆమెలో దురహంకారాన్ని తట్టి లేపి, బుసకొట్టించింది. అప్పుడప్పుడూ వెంకన్నమీద చెప్పరానంత కోపంవచ్చేది. కాని మనసారా అతన్నే ప్రేమిస్తుందామె. అతడు తనను దూరంగా పొమ్మన్నకొద్దీ, తన మనస్సులో అతనిపై ప్రేమ పొర్లువారి పరవళ్ళు త్రొక్కేది. అతన్నిగురించి ఆలోచిస్తూంటే ఒక్కోసారి 'శైవబాల'కు పిచ్చెక్కినట్లయ్యేది. అంతలోనే నిరాశా హతురాలయ్యేది. అప్పుడు - ఒకనాటి రాత్రి శైవబాల తననుతాను తమాయించుకోలేక వెంకన్న గదిలోకి వెళ్ళి తను కట్టుకొన్న గుడ్డలు లాగేసి, నగ్నంగా నుంచుని, "ప్రియా నన్ను దరితీసుకో ... నన్ను ప్రేమించు" అని అర్థించింది.

సిగ్గు పడిపోయి, భయంతో వణికిపోయాడు వెంకన్న. గభాలున గదిలోనుంచి బయటకొచ్చేసి, తలుపు గొళ్ళెంవేసేసి మళ్ళీ వెనక్కు తిరిగి చూడనైనా చూడకుండా వెళ్ళి పోయాడు.

అప్పటినుండి ఆడవాళ్ళంటే ప్లేగువ్యాధిని చూచి భయపడినట్లు భయపడతాడు వెంకన్న. ఒకసారి ఒక దేవాలయంలో కొన్ని శిల్పాలు చెక్కుతూవుండగా, దేవదాసిలు వెంటపడ్డారు అంతే, ఆ శిల్పాలనలా అసంపూర్తిగా వదిలేసి పారిపోయాడు. మరొకవూళ్లో పెద్దసంత చేయడానికి ఏర్పాట్లు జరుగుతూవున్నాయి. వెంకన్న మకాం అప్పుడు ఆ గ్రామంలోనే. కృష్ణుని విగ్రహం తయారుచెయ్యమని ఆ గ్రామస్థులు అతన్ని కోరారు. అతడు కృష్ణుని విగ్రహం చెక్కుతూ వుం

డగా, ఆ గ్రామంలో స్త్రీలు కొందరు - ఎలా చేస్తున్నాడో చూద్దామని వచ్చి, అతడు చెక్కుతూవుండగా చూస్తూనుంచున్నారు. వాళ్ళక్కడ వున్నట్లు గమనించేసరికి అతనికి తేళ్ళూ జెర్రులూ ప్రాకినంత పనయింది. వెంటనే చేస్తూ చేస్తూవున్న ఆ పని ఆపుజేసి వెళ్ళిపోయాడు.

ఇక ఆ ప్రాంతాల్లో తాను తన జీవితాన్ని నిర్మలంగా సాగించటం దుర్లభమని భావించి, ఏపర్వత ప్రాంతానికో వెళ్ళాలని నిశ్చయించుకున్నాడు. అతను గడిపిన జీవితం కొద్దిదే అయినా అంతా బాధామయ జీవితమే. పర్వతాల దగ్గర ప్రశాంతంగా జీవించగలనను కున్నాడు. అలా ఎందుచేత అనుకోగల్గాడో అతనికే తెలియదు. అప్పుడు ఒక బౌద్ధ భిక్షువును కలుసుకున్నాడు. ఆయన పొట్టిగా బక్కపలచగా వున్నాడు. అజంతాకు వెళ్లాలని బయలుదేరాడు. వెంకన్న కూడా ఆయన్ననుసరించాడు.

ఇక్కడ మనసు శాంతిగా వుంది. జీవితం సుఖంగా సాగుతోంది. కాలం హాయిగా దొర్లిపోతోంది. ఇప్పుడు చీకూ చింతా లేని బ్రహ్మచారి. శిల్పాలు సరిగా తయారు చేయలేనప్పుడు తను చీకాకు పడటం గాకుండా, తన సహచరుల్నీ, అధ్యాపకుల్నీ కూడా చీకాకు పెడుతుంటాడు. ఆ స్వభావంవల్లనే ప్రేమానంద్‌ను తనకు తోడ్పడమని కోరడం, ప్రేమానంద్ కొన్ని నమూనాలు గీచి యివ్వడం జరిగింది. అయినా ఏనుగును చెక్కడం వెంకన్న వశంకాలేదు. అందుచేత బదరీనారాయణ దగ్గరకొచ్చాడు. బదరీ మరునాటికి వాయిదా వేయడంవల్ల వెంకన్న వెళ్ళిపోయాడు.

# 12

ప్రక్కనే ఏదో ధ్వని అవుతున్నా బదరీనారాయణ మొదట్లో వినిపించుకో లేదు. కాని తన చెవిప్రక్కనే మళ్ళీ ధ్వని కావడంవల్ల ప్రక్కకు తిరిగి చూచాడు.

"మళ్ళీ ఎందుకొచ్చావు విక్కీడకు?" బుసకొట్టుతూ అడిగాడు బదరీ.

"రాక తప్పదుగా. నేనీప్రాంతానికి చెందినదాన్నే నా గురించి అందరికీ తెలుసు. ఒక్క మీకుతప్ప. మీకు ముందుగానే చెప్పవలసింది. కాని ఎందుచేతనో ఆగిపోయాను ఆగ్రహించకండి.

"నీ పేరేమిటి?"

"ప్రేమకుమారి."

"వాళ్ళు నిన్ను యీ మఠంలో ఎలా చేరనిచ్చారు?"

"నాకు చిత్రలేఖనం పట్ల అభిరుచి వుంది. ఆ విషయం ఆచార్య విజ్ఞానంద్ గారికి మనవి చేశాను. మొదట్లో వారంగీకరించలేదు. కాని, పురుషవేషం ధరించి వచ్చాక సంశయిస్తూనే నాపై దయజూపారు. నేను స్త్రీనన్న సంగతి రహస్యంగా వుంచాలని ప్రయత్నించాను. కాని అందరికీ తెలిసిపోయింది ఎలా తెలిసిందో నాకూ తెలియదు. అలా తెలి

సినప్పటికీ, నన్ను స్త్రీగా ఎవ్వరూ భావించరు. ఒక పురుషునితో వ్యవహరించినట్లే నాతో వ్యవహరిస్తారు." బదరీనారాయణ కష్టంగానే వున్నాడు. అతనికీ పద్ధతి నచ్చలేదు.

"ఇక మనం స్నేహంగా మెలగటం సాధ్యంకాదు" అని కత్తిపెట్టి నరికినట్లు చెప్పాడు.

"నన్ను నీచంగా చూడకు బదరీ. ఇదివరకెలా చూచావో, ఇకమీదట కూడా నన్నలాగే చూడు. నేను స్త్రీ నన్న సంగతి మరచిపో బదరీ" అంటూ దీనంగా అర్థించింది ప్రేమకుమారి.

"వీల్లేదు. ఇకమీాద మనం ఒకరికొకరం అపరిచితులుగానే వుండిపోదాం. నాకు దూరంగా వుండు."

"ఎందుకని బదరీ? నేను స్త్రీనైన కారణంచేతనేనా? లేక నేను మొదట్లోనే యీ సంగతి చెప్పలేదనా?" అంది ప్రేమకుమారి, పొర్లుకొచ్చే దుఃఖాన్ని ఆపుకోవాలని ప్రయత్నిస్తూ.

"స్త్రీలచెంత నేనుండలేను. వాళ్ళంటే నాకు గిట్టదు. అందువల్లనే పట్టణంనుండి వచ్చేసి యిక్కడ జీవితం గడుపుతున్నాను."

"నన్ను బాలునిగా భావించి వ్యవహరించలేవా?"

"ఊహుఁ, నా దరిదాపులకిక రావద్దు."

"అందరూ నన్ను బాలునిగానే భావిస్తున్నారు."

"కాని, నేను అందరివంటి వాణ్ణికాను."

ప్రేమకుమారి ముఖంలో నెత్తురుచుక్క లేదు. లేచి నుంచుంది బదరీనారాయణ అన్నం కోపంగా నములుతూ వుండటం చూచింది. అంతే, మారుమాట్లాడకుండా వెళ్లి పోయింది.

బదరీనారాయణ తన పాత్రల్ని కడిగి తన బసలో పెట్టాడు. బయట కొచ్చేసరికి, ప్రార్థనలు చేసేందుకు అందరూ సంఘారామానికి వెళ్తున్నారు. అప్పుడే కొందరు ప్రార్థనలు ప్రారంభించారుకూడా. ఆ ప్రార్థన ధ్వని గాలిలో ప్రతిధ్వనించి వినిపిస్తూంది. ఏం చేయడమా అని పెదవులు కొరుక్కొని ఆలోచించసాగాడు. ఇవ్వాళ బదరీనారాయణ మనసేం బాగుండలేదు.

వాఘురానది దగ్గరకు వెళ్లాడు తిన్నగా నది దాటి ఆ రోజు మధ్యాహ్నం వెళ్ళినచోటుకే వెళ్తున్నాడు. తుప్పల గుండా, కంచెమధ్యనే దాదాపు మైలుదూరం నడిచాడు. అక్కడొక పెద్ద చెట్లగుబురొచ్చింది. ఆ ప్రక్కనే ఒక యిల్లు వుంది. అదొక పాడుబడిన సత్రంలా వుంది. ఆ సమీపంలో ఆ యిల్లొక్కటి మినహాయించి మరింకేమీ లేవు. ఆ యిల్లు చూడటానికి అందంగానే వుంది. నివాసయోగ్య మైందన్నట్లే తోచింది, లోపల లైట్లు వెలుగుతున్నాయి. లోపల లైట్లు వెలుతురు కిటికీల్లోనుంచి బయటకు సూర్యకిరణాలమాదిరి వస్తూవుంది.

బదరీనారాయణ గోడదూకి తోటలో యింటిగుమ్మం దగ్గరకు వచ్చాడు. తలుపు గట్టిగా తట్టాడు.

ఎవరో ఒక పురుషుడు తలుపుతీశాడు. మనిషి ఆజాను బాహువులా వున్నాడు; విశాలమైన వక్షస్థలం; దార్ఢ్యమైన దేహబలం. చూపరుల్ని ఆకర్షించే అవయవసౌష్ఠవం అతని నేత్రాల్లో దయాంగ్రిత ద్యోతక మాతోంది. యుద్ధవీరునిలా వున్నాడు.

గడ్డం పొడవుగా వుంది. తలవెంట్రుకలు బుజాలమీద పడుతూ వున్నవి. జుట్టంతా రాగివర్ణంగా వుంది.

"ఎవరది?" నెమ్మదిగా ప్రశ్నించాడు.

"ఈ యింటి యజమానురాల్ని కలసికోవాలి. మధ్యాహ్నం వచ్చి మాట్లాడాను."

"వస్తున్నా" అని వచ్చి తలుపు తీశాడు ఆయన.

బదరీనారాయణ లోపలకు వెళ్లాడు. బల్లమీద కూర్చు న్నాడు. ఆ యింటావిడ వచ్చింది. అతడు వందనంచేశాడు.

"ఏం? ఏం జరిగింది నాయనా!" తొట్రుపడుతూ అడిగిందామె. ప్రేళ్ళు నలుపుకుంటూ, గోళ్ళు గిల్లుకుంటూ చెప్పటానికి సందేహిస్తున్నాడు.

ప్రేమకుమారి గురించే వచ్చాను. మీరు ఆమెను బౌద్ధమఠంలో చేరనివ్వవలసిందికాదు," అన్నాడు బదరీ నారాయణ.

ఆమెనవ్వింది. బదరీ ఆమెవంక చూచేసరికి ఆమె ముఖంలో సంతోషంతో కూడిన దరహాసం చిందులాడుతూ వుంది.

"చిన్నపిల్ల. పొట్టి పెంకిఘటం తానూ, తనమతమేమిటో తప్ప యితరులు చెప్పిన మాట వినిపించుకోదు. ఆ బౌద్ధమత గురువుగా రోకసారి యిక్కడకు ఏదో అనుకోకుండా రావడం తటస్థించింది. అప్పుడు ఆయనగారితో చిత్రలేఖనం పట్ల తన కెంత అభిరుచివుందీ మా అమ్మాయి తెలియజేసింది. బౌద్ధా రామంలో పని నేర్చుకోవాలనీ, చేరాలనే వుత్సాహమున్నట్లు వారికి మనవి చేసింది. మొదట్లో వారు వొప్పుకోలేదు. కానీ, ఎలాగో చివరకు ఆచార్య విజ్ఞానంద్‌గారు అంగీకరించారు."

"అక్కడ అంతమంది పురుషుల్లో ఎలా వుండగల్గుతోంది?"

"మగపిల్లవాడున్నట్లే వుంటుంది. ఆ చొక్కా అదీ వేసికొంటే బాలికన్న సంగతి మొదట్లో ఎవరికీ తెలియలేదు. తర్వాత ఎలా తెలిసిందో తెలిసింది' అయినా ఎవ్వరూ అభ్యంతరపెట్టలేదు. ప్రేమానంద్ అంటే అందరికీ యిష్టమే. వాళ్ళల్లో ఒకనిగా మెలగుతూ వుంది. అసలు బౌద్ధ భిక్షువులకు ఒకరిని గురించి పట్టించుకొని, ఆలోచించేటంత తీరిక లేదు. ఎవరిపనితో వారికి ప్రొద్దు సరిపోయేది. ఇతరు లెట్లావున్నారో పురుషులే వున్నారో? స్త్రీలే వున్నారో యోచించటాని కూడా వ్యవధిలేదు."

"అంటే కావాలనే పంపించారన్నమాట మీరు కూడా."

"అజంతా అంటే అమ్మాయికెంతో సరదా. అజంతాలో తను ఒక భాగాన్నని చెపుతూ వుంటుంది. చిత్తరువుల్ని చిత్రిస్తూ, తాను అక్కడే చనిపోవాలని కోరిక కోరు

కొంటూ వుంటుంది. ఇకేంచెయ్యం మేముమాత్రం? కాదు గూడదని యిక్కడే వుంచితే పువ్వు వడలిపోయినట్లు, కుళ్ళి కుళ్ళి ఏడ్చి చచ్చిపోతుంది. జీవితానికి సంతోషమే లేకుండా పోతుంది. జీవితమే చాలా పరిమితమైనది. అలాంటప్పుడు మా నిర్బంధాలు దాని నెత్తిమీద రుద్ది, దాని జీవితాన్ని నాశనం చేయడం మాత్రం సబబా?"

అంతలో ఒక బాలిక అక్కడకొచ్చింది. దాదాపు పదిహేనేళ్ళుంటాయి. బొమ్మలా ముద్దొస్తోంది. కోమల శరీరం.

ఆకలిదప్పుల్ని మరపించగల మహత్తరశక్తి ఒక్క సౌందర్యానికే వుంది. ఆ సౌందర్యమే మనకళ్ళకు మిఱుమిట్లు గొలిపే తళతళల నుద్భవింపజేస్తుంది. ఆ బాలిక వయసుకు చిన్నదే ఆయినా చూపరుల హృదయాలను, గిలిగింతలు పెట్టి యిట్టే ఆకర్షించేస్తుంది. కలలో దేవకన్యలా వుంటుంది కాని వాస్తవిక సౌందర్యగరిమ ఆమెలో మూర్తీభవించి వుంది.

బదరీనారాయణ ఆ బాలికవంక చూచి, ముగ్ధసౌందర్యానికి ఆశ్చర్యపోయాడు. అది కనిపెట్టి ఆయిల్లాలు చిన్నగా నవ్వింది.

"మా రెండో అమ్మాయి; కమలకుమారి."

"ఈమెకూడా చిత్తరువుల గీస్తుందా?"

"ఉహుం! కమల పాడుతుంది; నాట్యం చేస్తుంది."

"ఇంకా అమ్మాయి లున్నారా?"

"లేరు ఈ యిద్దరూ చాలు,"

బదరీనారాయణ లేచి నుంచున్నాడు. "వెళ్లొస్తాను. అనవసరంగా మీ యింటి విషయాల్లో జోక్యం చేసుకున్నాను మన్నించండి."

"ఫరవాలేదు. మాయింటికి మీ రెప్పుడుపడితే అప్పుడు రావచ్చు. ఎలాంటి అభ్యంతరమూ వుండదు. ప్రేమ నాకంతా చెప్పింది. కొంచెంసేపు కూర్చోండి."

అంతవరకూ వింటూవున్న అజానుబాహుడైన ఆ వ్యక్తి - అప్పుడే - తొలిసారిగా బదరీతో మాట్లాడాడు.

"మీరు ఉజ్జయినిలో వున్నట్లు ప్రేమ చెప్పింది. రఘునాథ్‌ను మీ రెరుగుదురా?"

"బాగా ఎరుగుదును. ఆయనే అక్కడ ప్రధాన శిల్పకారుడు. మంచి నైపుణ్యంకలవాడు. చక్కగాగీస్తాడుకూడా"

"అతనంటే మీ కిష్టమేనా?"

"అతనంటే అందరికీ సరదాయే. చనువుగా వుంటాడు దయార్ద్రహృదయుడు. మాటమాటకు హాస్యం కురిపిస్తాడు. నా కెప్పుడు మనసు బాగుండకపోయినా ఆయన దగ్గరకే వెళ్ళేవాణ్ణి, కొద్దిసేపట్లో పొట్ట చెక్కలయ్యేట్లు నవ్వించి, వింతబాధలో వున్న, బాధంతా మరచిపోయేలా చేసేవాడు. ఆయన్ని మీరు ఎరుగుదురా? నాకున్న ఒకేఒక స్నేహితుడు నాకున్న ఆత్మీయుడుకూడా."

ఆ అజానుబాహుని విగ్రహాన్ని నఖశిఖ పర్యంతమూ ఒక్కసారి పరిశీలించాడు. బదరీనారాయణ వెళ్ళడమా? మానడమా అని తటపటాయించి మళ్ళీ కూర్చున్నాడు.

"మీ పేరు?...రామగుప్తుడంటే మీరేనా?"

"అవును"

"మీగురించి చాలా చెపుతుండేవారాయన. ఎప్పుడూ మీగురించే అనుకుంటుండేవారు. మీరెక్కడుంటున్నారో నని ఆయన అప్పుడప్పుడూ ఆశ్చర్యపోతూ వుండేవాడు"

రామగుప్తుడు ఆలోచనలో పడిపోయాడు. ఒక్క నిట్టూర్పు విడచి ప్రక్కనున్న కిటికీదగ్గరకు వెళ్ళాడు. కిటికీలో నుంచి వెళ్తున్న వెలుతురు కొద్దిగా తోటలోని ఆకులమీద పడుతూ వుండటంవల్ల వాటి పచ్చదనం వంక చూస్తున్నాడు. మౌనంగా నిలుచున్నాడు. ఏవో ఆలోచనల్లో మునిగి పోయాడు.

# 13

రామగుప్తుడు, రఘునాథ్ యిద్దరూ ప్రాణస్నేహితులు. రఘునాథ్ ఒక శిల్పి. ఆయన తండ్రి హరిసేన్ గొప్ప యుద్ధవీరుడు. తండ్రితోపాటు రఘునాథ్‌కూడా రెండు యుద్ధాల్లో పాల్గొని ఉజ్జయినికి యెనలేని ఖ్యాతి సంపాదించారు. యువకులచేత ఘనమైన సత్కారాలు చేయబడినాయి రఘునాథ్‌కు! కాని అతనికి అవేమీ రుచించలేదు. ఆ సన్మానాల్లోనూ, ఆ విందుల్లోనూ పాల్గొన్నాడేగాని రఘునాథ్ మనసంతా ఎక్కడో వుండేది. హృదయమంతా అగ్నికుంపటిపై

పెట్టిన ఆహారపదార్థం కుతకుత వుడికినట్లు బాధతో తల్ల డిల్లేది. యుద్ధాలపట్ల వైముఖ్యత కలిగింది యుద్ధాలవల్ల కలిగే అపార జననష్టం, పారే రక్తపుటేరులు, నాగరికతా విచ్ఛిన్నతలను చూచి రఘునాథ్ తనలో తాను విలపించే వాడు. ఇంకెప్పుడూ యుద్ధాలకు వెళ్ళరాదని నిశ్చయించు కున్నాడు. రాజాస్థానపు శిల్పకారుడైన చంద్రదేవ్ దగ్గరకు వెళ్ళి తనను శిష్యునిగా తీసుకోవలసిందిగా ప్రాధేయపడి అభ్యర్థించాడు.

రఘునాథ్ తండ్రి మంచిపేరు ప్రఖ్యాతులున్నవాడవటం వల్ల, ఆయన్నిబట్టి రఘునాథ్‌కు ఆ శిల్పాచార్యునివద్ద శిష్యత్వం లభించింది. రఘునాథ్ కూడా అచిరకాలంలోనే శిల్పి అయ్యాడు. క్రొత్త రకాలైన నమూనాలను గీయడం, క్రొత్త భవనాలకు తగిన ప్లానులు గీయడంలో రఘునాథ్ మంచి ప్రావీణ్యం చూపించాడు. అతడు గీచిన ప్రతి ప్లానులో క్రొత్తదనం క్రొత్తఆకర్షణ లున్నాయి. శిల్పకారుడని ఖ్యాతి నార్జించేందుకు అతని కెంతోకాలం పట్టలేదు. అతని నైపుణ్యం శిఖరాగ్రాల నందుకుంది

అక్కడే వుంటున్నాడు......

ఈ తరుణంలో అతనొక ప్రేమలో పడ్డాడు. ప్రేమిం చిన కన్య ప్రమీలజ. అప్సరసలా వుంటుంది. మిలమిల మెరసే నక్షత్రాల్లాంటి కళ్లు...ఆమె నవ్వుతూవుంటే మల్లె పూల వరుసలా తెల్లని పలువరసలశోభ హృదయాన్ని గిలి గింతలు పెట్టుంది. ఆ రాజ్యం మొత్తంమీద సౌందర్యంలో

ఆమెకు సాటిరాగలవారు లేరనే ప్రతీతి. ఆమె తండ్రి సుద ర్శన్ రాజప్రసాదంలో వున్నతోద్యోగి. శత్రుత్వం వహిస్తే సింహస్వప్నమే!

ఆమె సౌందర్యంగురించి విన్న రాకుమారులంతా లొట్టలువేసి, ప్రమీలజను పెళ్లాడాలని ఎందరో రాయ బారాలు పంపించారు. కాని వొక్కదానికీ ఆయన అంగీక రించలేదు. పెళ్ళి పేరు చెపితేనే మండిపడిపోయేవాడాయన. ఆయనతో వ్యవహరించడమంటే నిప్పుతో చెరలాడడమే. ప్రమీలజ ఆయనకు లేక లేక కలిగిన బిడ్డ. అందుచేతనే కూతురంటే తండ్రికి పంచప్రాణాలు.

రఘునాథ్‌కు యిలా పెళ్ళి రాయబారాలు వచ్చి వెళ్ళడమూ తెలుసు. సుదర్శన్ యొక్క స్వభావమూ తెలుసు. ప్రమీలజ దేవాలయంలోకి వెళుతూవుండడం చాలాసార్లు చూచాడు. తన హృదయాన్ని ఆమె కంకితం చేశాడు. ఆమె కోసం తహతహలాడిపోయాడు. ప్రేమోన్మాదితుడయ్యాడు. తన స్వంతమే అన్నంత యిదిగా ప్రేమించాశాడు.

ఒకరోజున తను నిద్రనుంచి లేచేసరికే అట్టుడికినట్టు వూరంతా వ్యాపించి వింతగా ప్రచారమైపోయింది ఒక్కసారే యింత అలజడి కలిగించేటంత మార్పేం జరిగిందా అని ఆశ్చర్యపోయాడు. ప్రమీలజ నెవ్వరో ఎత్తుకుపోయారని తెలిసేసరికి కుప్పకూలినట్లు ఒక్కసారి కూలిపోయాడు. ఆమె జాడ కనిపెట్టి, పోరాడైనా, ఆమెను తీసుకునివచ్చేందుకు యోధానుయోధులు నలుమూలలకూ పంపించబడ్డారు. సుద ర్శన్ తోకత్రొక్కిన నాగుబాములా కోపంతో మండిపడి

పోతున్నాడు. కూతుర్ని అన్వేషించి, తీసుకురావడానికై తానే స్వయంగా బయలుదేరాడు.

ఈ వార్త విన్నంతనే రఘునాథ్‌కు నడుం పడిపోయి నట్లయింది. ప్రమీలజను తాను మనసారా ప్రేమించాడు. కాని తనకు దక్కకుండా పోయింది. నిరంతరం ప్రేయసిని గురించే యోచించేవాడు. చివరకు ఒకరోజున తన ప్రేమ విఫలమై పోయినంత మాత్రాన, తన మేధా సంపదను వృథా పరచుకోవడం తెలివితక్కువని గుర్తించాడు. మళ్ళీ పని చేయడం ప్రారంభించాడు. శిల్పచాతుర్యంలో తన అద్భుత నైపుణ్యాన్ని జోడించి, మహత్తర కళాకౌశలాన్ని ప్రదర్శించాడు. విశ్రాంతి మందిరాలను గీచాడు. తోటలు, పెద్ద పెద్ద భవనాలు, సరస్సులు, పర్వతాలు, ఒక్కటేమిటి...ఎన్నో నూతనంగా సృష్టించాడు. తన పనితనాన్ని కేంద్రీకరించి, అందవిహీనమైన పట్టణాన్ని భూతలస్వర్గంగా తయారించి, యాత్రికుల్ని ముగ్ధుల్ని చేసి, వర్తకుల్ని మైమరపించేటంత కళాఖండాల్ని నగరంలో సృష్టించి, తద్వారా ఉజ్జయినీ నగరాన్ని బ్రహ్మాండమైన కళాత్మక నగరమనే ఖ్యాతి నార్జించి పెట్టాడు.

సంవత్సరాలు దొర్లిపోతున్నకొద్దీ ప్రమీలజను పూర్తిగా మరిచిపోయాడు. కాని అతడు మాత్రం పెళ్ళి చేసుకోలేదు ఏకాంత జీవితాన్ని ఆనందంగా గడుపు తున్నాడు. కళ నభ్యసించే విద్యార్థులు వారాని కొకసారి ఆయన యింటికొచ్చేవారు. తన వాగ్ధోరణిచే వారిని ఆనంద భరితుల్ని చేసేవాడు. కాని ఆయన హృదయంలో వొకా

నౌకప్పుడు ఎలాంటి తుఫాను చెలరేగిందో ఎవరూ వూహించ లేకపోయారు.

మానసికంగా ఎంత బాధపడినా, రఘునాధ్ తనయవ్వన ప్రాయాన్ని కోల్పోలేదు; సరికదా హాయిగా సుఖజీవితాన్నే గడిపాడు. అప్పుడప్పుడు నగరం వెలుపలకు గుఱ్ఱంమీద స్వారి చేస్తూ వెళ్లి, విధాతయొక్క సృష్టివైచిత్ర్యాన్ని, అనంత శిల్పకళా వైభవాన్ని సందర్శించి, ఆనందించి వస్తుండేవాడు. ఆ రకంగా ఆనందమయ జీవితాన్ని కొనసాగించాడు.

ప్రమీలజను తీసికునిపోయిన తర్వాత పదిసంవత్సరాలు గడచిపోయినై. ఎవరుతీసుకుని పోయారో ఎవరికీ తెలియదు. పోనీ ప్రమీలజతోపాటు కాపురం జేస్తున్నవానినైనా ఎవరూ చూచారన్న సమాచారంకూడా లేదు. కూతుర్ని తిరిగి తీసుకు రావడమనే విషయమట్లావుంచి, కనీసం ఎక్కడుందో కనుక్కో గలననే ఆశకూడా సుదర్శన్‌లో అంతరించింది చివరకా నిరాశ పెరిగి, మనోవ్యధగా మారి, ఆ మనోవ్యధతోనే మరణిం చాడు. కాని, తన చివరరోజుల్లో—తన తొలి జీవితంలోని ఉద్రేకపూరిత ప్రవర్తనపట్ల తనకే జుగుప్స జనించి జరిగిన దానికి విచారించాడు. తనకు యిలా జరగడం తగిన శిక్షే నేమోనని చివర రోజుల్లో అనుకున్నాడుకూడా.

వేసవికాలంలో ఒకనాటి ఉదయం రఘునాధ్ గుఱ్ఱాన్ని ఆపి బడలిక తీర్చుకుంటూ నెమ్మదిగా నడుస్తూ వెళ్తున్నాడు. ఏడేళ్ళమ్మాయి తూనీగను పట్టుకోవాలని ప్రయత్నించి, దానివెంటనే పరుగెత్తుతూ, తూనీగ గభాలున చుట్టుతిరిగి వెనక్కుపోవడంతో, ఆ బాలిక తూనీగతోపాటు

ఆచుట్టు తిరగడంలో తప్పటడుగుపడి క్రింద పడిపోయింది, అయినా ఆ బాలిక ఏడవలేదు. వెంటనే లేచికూర్చుని. మోకాలుమీద తగిలిన గాయాన్ని చూచుకొంది. లేచి నుంచుని, కుంటిగా అడుగు వేసింది. కాని బాధపెట్టడంవల్ల కాలోలు మళ్ళీ చతికిలబడి గాయంమీద వూదుకుంటూ ప్రథమ చికిత్స చేసుకొంది. తర్వాత నెమ్మదిగా లేచి కుంటు కుంటూ, కుంటుకుంటూ వెళ్ళిపోయింది.

రఘునాథ్ విస్తుపోయాడు. ఆ బాలిక ముఖారవిందం తన కెక్కడో పరిచయమున్నట్లు తోచింది. ఆ బాలికను సరించి వెళ్లాడు. ఇంకో బాలిక, అయిదేళ్లుంటాయి—మొదటి బాలిక దగ్గరకు పరుగెత్తుకొని వచ్చింది. ఆ అయిదేళ్ళ బాలిక అక్క ముఖంలో ద్యోతకమవుతున్న బాధను పసిగట్టికాళ్ళకేసి పరిశీలనగా చూచింది. మోకాలుమీద గాయంకనుపించింది. అయినా ఆ బాలిక చేయగల్గిందేమీ లేదు. తనఅక్క రెక్క పుచ్చుకొని, సహాకారంగా వుండి నడిపించుకొని వెళ్లింది. కొంచెంసేపట్లో యిద్దరూ ఒక చిన్న గుడిసె దగ్గరకు వచ్చారు.

"అమ్మా, ప్రేమకు దెబ్బతగిలిం దమ్మా" అనిచిన్న మ్మాయి కేకవేసి చెప్పింది చిన్నపిల్ల చెప్పడమే తడవుగా లోపలనుంచి ఒక స్త్రీరత్నం వచ్చింది అజ్ఞాతవాసం చేస్తున్న అప్సరసలా వుందామె రఘునాథ్ ఆమెను చూచాడు. అంతే! నిశ్చేష్టుడై పోయాడు, తెరచిననోరు తెరచినట్లే వుండిపోయింది. అతని కెదురుగా ప్రమీలజ నుంచుంది. పెద్ద మ్మాయిని లోపలకు తీసుకువెళ్ళింది. కొంచెంసేపయ్యాక బయటకొచ్చి, నీళ్లు తీసుకురావడానికి కాలవకు వెళ్ళింది

ఏం చేయడానికీ రఘునాధ్ కేమీ తోచలేదు. అలాగే వుండి ఆ చిన్నమ్మాయినీ, తల్లిని పోలికలు పరిశీలించాడు. తండ్రి యెవరై వుంటారా అని యోచించాడు అతనలా ఆలోచనల్లో ఎంతోసేపు సతమత మవ్వక్కర్లేకుండానే, మరి కొంచెం సేపట్లో బలిష్ఠుడైన ఒక వ్యక్తి వచ్చాడు. ఆయన ఆజానుబాహుడు. భుజాలమీద ఒక దుప్పిని మోసు కొచ్చాడు. కొన్ని బాణాలున్న అంబులపొదిని చేతికి తగి లించుకొని వున్నాడు.

అతన్ని రఘునాధ్ చాలా జాగ్రత్తగా కనిపెట్టి చూచాడు. కాని ఎవరైందీ అంతుపట్టలేదు. అతన్నదే తొలి సారిగా చూడటం! అదివరకెప్పుడూ చూచివుండలేదు. అతడు ఉజ్జయినీ నగరవాసి కాడు. అయినట్లయితే తాను గుర్తుపట్ట గలిగేవాడే. అతడేం సామాన్యుడు కాడు. ఆరున్నరడుగుల మనిషి! ఉజ్జయినీలో యింతటి మనిషి వున్నాడా? వుంటే ఎవరూ చూడకుండా వుంటారు?

చెట్టుక్రింద నుంచున్నాడు. ఏం జేయాలో అతనికి తోచటంలేదు. ఆ గుడిసెదగ్గరకు వెళ్ళి, దారి తప్పివచ్చిన బాటసారినని చెప్పి త్రాగటానికి నీరూ, తింటానికి తిండీ అడుగుదామనుకున్నాడు.

ఆ బాలికలిద్దరూ తమకు సమీపంలో నుంచుని తమను అదేపనిగా చూస్తున్న అపరచితవ్యక్తిని చూచి "అమ్మా, అమ్మా! ఎవరో అబ్బాయి వచ్చాడే!" అంటూ లోపలకు పరుగెత్తారు. లోపలనుంచి ప్రమీలజ, ఆమె పెనిమిటీ—ఆ

నుంచున్నది శత్రువేమోనన్నట్టు యెదుర్కోటానికూడా సంసిద్ధులయ్యే బయటకు వచ్చారు.

రఘునాథ్ వాళ్ళకు నమస్కరించాడు. వాళ్లూ ప్రతి వందనాలర్పించారు. కాని అనుమానం వాళ్ళ కళ్ళల్లో నృత్యం చేస్తూవుంది. రఘునాథ్ తన రాకగురించి వివరించాడు. తమవల్ల ఎలాంటి సహకారం కావలసినా తాము చేయగలిగినంతా సంతోషంగా చేస్తామనీ, కొద్దిసేపట్లో వంట పూర్తవుతుందనీ చెప్పారు.

ప్రమీలజ పొయ్యిదగ్గర కూర్చొని అన్నం కూరలు వండటంలో నిమగ్నురాలైంది రఘునాథ్, ప్రమీలజ పెనిమిటీ—యిద్దరూ ఒకరి సరసన యింకరు కూర్చున్నారు. ఒకరిపేర్లొకరు తెలిసికున్నారు.

"నా పేరు రఘునాథ్"

"మీగురించి విన్నాను. మీరు శిల్పకారులు కదూ? మీరు శిల్పాలు బాగా చెక్కుతారనీ, నగిషీలు చెక్కడంలో నిపుణులనీ చాలామంది చెప్తారు."

"అదే నాజీవనవృత్తి. నాజీవిత ఆభరణంకూడా అదే!"

పొడుగాటి మనిషి నవ్వాడు." నాపేరు రామగుప్తుడు. నేనూ ఒకప్పుడుయువరాజునే. కాని ప్రస్తుతం అరణ్యవాసిని."

"ఎందుకని?"

"అదొక వింతగాథ, మానాన్నగార్ని పదచ్యుతుణ్ని చేసి, రాజ్యపాలనా భారాన్ని వహించాలని ప్రయత్నిస్తుండే

వాణ్ని, చాలా ప్రయత్నాలుచేసి యించుమించు సఫల మయ్యే దశవరకూ వచ్చాను. కాని అంతలో ఏదోజరిగింది!"

"ఏం జరిగింది?"

"నేనొక బౌద్ధభిక్షువును కలవడం జరిగింది. మానవుని జీవితంలో నైతికప్రమాణాల విలువల్నీ, మానవశక్తి ప్రభావాలనూ వివరించి చెప్పారాయన. జీవితంలో ఆత్మవికాసాన్ని గురించీ, ఆత్మల పరిణామాన్ని గురించికూడా బోధించారాయన. ఆకృతికి ఎంత పెద్దవాణ్ణయినా భయవిహ్వాలుణ్ణయిపోయాను. వణికిపోయాను. రాజ్యకాంక్ష వలదనుకున్నాను. ఎక్కడో నిర్మలంగావుండే తావులో వుందామనిపించింది ఇక్కడకొచ్చి వుంటున్నాను."

"ఇక్కడెంత కాలంనుంచి వుంటున్నారు?"

"చాలా కాలంనుంచి ఇక్కడ నుండికూడా వెళ్ళిపోవాలనుకుంటున్నాను. ఈ ప్రదేశమంతా నిర్మల జీవనానుగుణ్యంగా వున్నా యిక్కడుండటం ఏమంత క్షేమంకాదు. ఇక్కడకు తరచు రాజపరివారం, గూఢచారు లొస్తుంటారు. ఒకసారి నా భార్యను రాజభటులొచ్చి, బలవంతంగా లాక్కుపోవడానికి ప్రయత్నించినప్పుడు యిద్దర్ని హతమార్చాను. ఎందరో రాజభటుల నెదుర్కొని వారితో పోరాడాను. చివరకు పిఱికిపందలై పారిపోయారు"

ఇలా సంభాషించుకొంటూండగా వారిద్దరి మధ్యా కొంచెం చనువేర్పడింది. ఇద్దరం అపరిచితులమని అంతకు ముందున్న భావంకాస్తా తొలగిపోయింది. ఇద్దరూ స్నేహి

తులమనే భావన కొచ్చారు. కొంతసేపయ్యాక, యిద్దరూ అడవుల్లోకి వెళ్లి ప్రకృతి రామణీయకతను ఆనందించ జొచ్చారు.

రఘునాథ్ ప్రతిరోజూ వస్తున్నాడు. ఆ బాలికలిద్దరూ అతనితో చనువుగా మెలగుతూ, అతడు రావడంతోనే కాళ్ళకు చుట్టేసుకోవడం, గుఱ్ఱంమీద ఎక్కించి తీసికెళ్ళమన డం జరుగుతుండేది ప్రమీలజ అతన్ని సోదరునిగా చూచేది. రఘునాథ్ ఆమెను ప్రేమించినట్లు ఆమె కసలు తెలియనే తెలియదు. కనీసం ఆమెకు అనుమానమైనా పొడసూపలేదు. ఆమెకు తన ప్రేమ సంగతే తెలియనివ్వలేదు. ఆమె నవ్వులో ఆమె కంఠస్రావ్యతనే ఆనందంగా యెంచుకొని రఘునాథ్ పరవశత్వం పొందేవాడు.

రఘునాథ్, రామగుప్తుడు యిద్దరూ స్నేహితు లయ్యారు. స్నేహంలో-మామూలు స్నేహితులుకారు; ప్రాణ స్నేహితులయ్యారు. ఏ విషయాన్ని దాచి పెట్టుకోకుండా ప్రతీ విషయాన్ని దినకరుని సాక్షిగా మనసు విప్పి మాట్లాడు కునేవారు. పైపై విషయాలేకాదు. తమ వ్యక్తిగత విషయా లొచ్చినా అంతే. ఇలా వుంటూవుండగా ఒక సందర్భంలో రఘునాథ్ తన జీవితచరిత్రనంతా చెప్పాడు. తన నిస్వార్థ ప్రేమను గురించి కూడా వివరించాడు.

రఘునాథ్ ప్రేమగాథ విన్నప్పటికీ రామగుప్తునిలో ఎలాంటి వైషమ్యమూ పొడసూపలేదు.

"రఘూ! జీవితం ఒకవేట! ధైర్యవంతులెవరో వాళ్ళు విజయం పొందుతారు. నేను అదృష్టవంతుణ్ణి గనుక నేను జయించగల్గాను."

రామగుప్తుడు కూడా తననుగురించి పూర్తిగా వివరించి చెప్పాడు.

"ఈమూరు మూల, చోటుకానిచోట, అరణ్యవాసిగా వుంటున్నా, ప్రమీలాజను కలుసుకోక పూర్వంగడిపిన జీవితం కన్నా, యిప్పుడు హాయిగా, సుఖంగా, జీవితం గడపగల్గుతున్నాను. మా స్వస్థలంలో వుండగా నేనొక మూర్ఖుణ్ణి ఇక్కడ కొచ్చిందగ్గర్నుంచీ, ఆ జీవిత దశే మారిపోయింది. సత్యశోధనను గురించే నిత్యమూ ఆలోచిస్తూవుంటాను. నిరంతరం నైతికవిలువల్ని గురించే సుదీర్ఘంగా ఆలోచిస్తూవుంటాను. జీవితంపట్ల విసుగు జనించినప్పుడు దేశాటనం చేస్తుంటాను. ఒకసారి నగరం వెళ్ళాను. ఆరోజున ఆమెను చూచాను.

గుడినుంచి వస్తోంది. ఆమె సౌందర్యం నా హృదయంలో ఒక జ్యోతిర్మయిలా వెలిగింది. నాలో నాకే వింత భ్రాంతి కలిగించింది. ఆమె ననుసరించి వెళ్లాను. ఆ రాత్రి ఆమె యింటిగోడలపైకి ప్రాకి వాళ్ళయింట్లోకి ప్రవేశించాను. ఆమె గదిలోకి వెళ్లాను. నన్నుచూచి భయపడిపోయింది. భయపడవలదని చెప్పి, నేనెవర్నో వివరించాను. మొదట్లో నన్ను విశ్వసించలేదామె. కాని నేను గట్టిగా చెప్పాను. నా అర్ధాంగి కావలసిందిగా అర్థించాను. ఆమె అప్పుడు తన కష్టాలన్నీ ఏకరువు పెట్టింది. ముఖ్యంగా వాళ్ళనాన్నగారినుంచి

తప్పించుకు వెళ్ళడం అసంభవమని చెప్పింది. నాతో వచ్చేయ మన్నాను. కాని ఆమె నిరాకరించింది. అప్పుడిక ఏం చేయాలో నాకర్థం కాలేదు. నిరాశతో వెళ్ళిపోయాను."

"కొన్నిరోజుల తర్వాత ఆమె దగ్గరకు మళ్ళీవెళ్లాను. ఆమె తెల్లగా పాలిపోయింది. బక్క చిక్కిపోయింది. ఆమె మనసేం బాగుండలేదు. ఆమెనుచూచి చాలా విచారించాను.

"నీకు బాధ కలిగించానా? అయితే 'మీ' జోలికి రాను" అని చెప్పాను. ఆమె భోరున ఏడ్చింది.

మీతో నన్ను తీసుకువెళ్ళండి మీరు లేనిదే నే నొక్కక్షణం జీవించలేను" అని అందామె.

"నాజీవితాన్ని గురించి ఆమెకు వివరంగాచెప్పాను. కాని ఆమె నిట్టూర్చింది.

'అన్నిటికీ ఆవిధాతే వున్నాడు' అందామె.

అంతే. ఆ రాత్రే వెళ్ళిపోయాం.

ఆమెకోసం ఎందరో ఎన్నో విధాలుగా వెదకు తున్నారని విన్నాను. ఏం చేసేందుకూ తోచిందికాదు. ఈ ప్రదేశం విడచి ఎక్కడకూ వెళ్ళలేకపోయాం. దేశంలో ఎక్కడ చూచినా మాకోసం వెదకేవాళ్లే. అందువల్ల యిక్కడే కాందిశీకులవలె వుండిపోయాం. ఇదే స్థిరనివాసమై పోయింది.

ఈకథంతా విన్నాక, "మీకు పగవారెవరూ లేరు. పగబట్టిన సుదర్శన్‌గారు స్వర్గస్థులయ్యారు. మీకిక ఎలాంటి భయంలేదు." అని రఘునాథ్ అన్నాడు.

నిజంగా వారిప్పుడు సురక్షితంగానే వున్నారు. రామ గుప్తుడు ఎక్కడికో దూరదేశం వెళ్ళిపోవాలని నిశ్చయించు. కొన్నాడు.

"ఎప్పుడో ఒకరోజున బయలుదేరి వెళ్ళిపోతాం. ఎక్కడికు వెళ్లినా, అదే స్థిరనివాసం చేసుకోదలచాము ఒక యిల్లొకటి వేసుకోవాలి. ఆయింటికి ప్లాను గీచి యిస్తావా?" అని రామగుప్తుడు రఘురాధ్‌ను ప్రశ్నించాడు.

అడిగిందే తడవుగా రఘురాధ్ ఒక ప్లాను గీచి యిచ్చాడు. సంవత్సరం లోపలనే రఘురాధ్‌తో కూడా చెప్పకుండా రామ గుప్తుడు వెళ్ళిపోయాడు. ఆ వెళ్ళిపోవటం తిన్నగా - అజం తాకు వచ్చేసి యిక్కడ వుంటున్నాడు.

# 11

ఇలా తనగాధంతా విప్పిచెప్పి, కిటికీ దగ్గరనుండి వెనక్కు తిరిగి బదరీనారాయణ వంక చూచి రామగుప్తుడు నవ్వాడు. ఈ కథంతా బదరీవింటూ కూర్చున్నాడు. మధ్య లో అతనేం జోక్యం చేసికోలేదు. ఎలాంటి అడ్డు ప్రశ్నలూ వెయ్యలేదు.

"రఘురాధ్ చాలా సహృదయుడు. నేనిక్కడ వుంటు న్నట్లు తెలియపరుద్దామని అప్పుడప్పుడూ అనుకొంటూ వుంటాను. కాని అసలు యీ వ్యక్తిని గురించి తెలిసికోకుండా వుండటమే అతనికి మంచిదేమోనని కూడా అనిపిస్తూ వుంటుంది." అని రామగుప్తుడు చెప్పాడు.

"ఇక్కడేం జేస్తున్నారు మీరు?" అని బదరీనారాయణ ప్రశ్నించాడు.

"ఆలోచిస్తూవుంటాను. నేర్చుకుంటున్నాను."

"బౌద్ధమతమా?"

"ఫలానా మతమనేమీ లేదు. కాని సత్యాంగురించి, సత్యాన్ని గుర్తించగల జ్ఞానోదయాంగురించి ప్రత్యేకంగా కృషిచేస్తున్నాను. ఇప్పుడు, యిన్ని సంవత్సరాలనుంచి నేను నేర్చుకొని తెలుసుకుంటున్నదంతా ఒక పుస్తకంగా వ్రాస్తున్నాను."

"పూర్తయిందా?"

"సగమే అయింది."

"నేను చూడవచ్చునా?"

"రా; నాగదిలోకి వెళ్దాం."

ఇద్దరూ రామగుప్తుని ప్రత్యేక గదిలోకి వెళ్ళారు. అదొక చిన్నగది. పరిశుభ్రంగావుంది. దానినిండా ఎన్నో వందలకొలది గ్రంథాలున్నవి గోడలకు ప్రేమకుమారి గీచిన భౌగోళిక పటాలెన్నో తగిలించబడి వున్నాయి.

"చాలా బాగుంది." అని బదరీనారాయణ సంతృప్తి ప్రకటించాడు.

రామగుప్తుడు తను వ్రాస్తున్న పుస్తకాన్ని బదరీనారాయణ కిచ్చాడు. పుస్తకం తెరచి చదవడం ప్రారంభించాడు. బదరీనారాయణ. అందులో కళ, వేదాంతము, అధ్యాత్మిక విషయాలను గురించి విపులంగా చర్చించబడింది. సత్యాం

యొక్క ప్రాధాన్యత, దానికున్న విలువలను గురించే ప్రతి చర్చా కొనసాగింది.

బదరీనారాయణ కొన్ని పేజీలు గబగబ తిరగేశాడు. సమాధిని గురించి విపులీకరించిన వ్యాసం అతన్నాకర్షించింది. రామగుప్తుడు దాన్ని నాలుగు అధ్యాయాలుగా విభజించి ప్రతివొక్క అధ్యాయంలోనూ ప్రత్యేక అంశాలపై విపులంగా చర్చించాడు. ప్రథమాధ్యాయంలో వ్యక్తి, తనశక్తినివికసింప జేసుకొని భౌతికవాంఛలకే ప్రాధాన్యతయివ్వక, యీ పాప పంకిలానికీ, దగ్ధమైపోయి, నశింపుజరిగే యీ ప్రాపంచిక చింతల కెక్కువ ప్రాధాన్యత యివ్వవలదని వ్రాశాడు. రెండో అధ్యాయంలో సమతాభావంగురించి - అందర మొకటేననీ, అన్ని జీవరాసులూ జీవించవలసిందేననీ, కనుక ఒకరికి బాధాకరమైన విధానంగాని, నష్టం కలిగించే పద్ధతులవలంబించటంగానీ, తగదని హితవు పలికాడు. మూడవ అధ్యాయంలో ఆత్మవికాసాన్ని గురించి, అంతరంగంలో ప్రశాంతత ఎంత అవసరమో, మనసా, నిష్కల్మష ప్రవర్తన ఎంతటి ముఖ్యావసరమో చర్చించాడు. నాలుగో అధ్యాయంలో శారీరక వాంఛలుడిగిపోయి, తృష్ణలేనప్పుడు, ముక్తికదే సాధనమార్గమని ప్రవచించాడు.

"చాలా లోతుగా చర్చించారు" అని బదరీనారాయణ వ్యాఖ్యానించాడు.

"మీకు నచ్చిందా?"

"నచ్చింది. పూర్తిగా చదివితే, మీరు కనుగొన్న శాంతి సౌఖ్యాలను నేనూ పొందగలనేమో!"

"పూర్తయ్యాక యిస్తాను; చదువుదువుగాని"

"అలాగే" కృతజ్ఞతను చిఱునవ్వులో లీనంచేస్తూ అన్నాడు బదరీ.

... ... ...

మళ్ళీ పుస్తకంలో పేజీలు తిరిగేశాడు. కళను గురించిన వ్యాఖ్యానం: కళమీద, కళనుగురించి కొన్ని చక్కటి వ్యాసాలను చదివాడు. మానసిక అనుభవమే కళ. సౌందర్య స్వరూపమే కళ. సౌందర్యం కేవలం అందాన్నే కాదు, అనంతమైన ఆనందాన్నిస్తుంది. అది సృష్టిలో మూగది అయినా ఆత్మను ఆలోచనకు ఉద్గమింపజేస్తుంది. అదీ ఒక రకమైన మతమే. అయితే అది మహా పవిత్రమైన మతం! మామూలు మతాలవలె సంకుచితమైన ఆచారాలకు నిలయం కాదు. మానసిక దౌర్బల్యాల ప్రేరేపించే ఆచారాలాకతీత మైనది. దానికేం కట్టుబాట్లు లేవు అందులో ఆత్మ పరిభ్రమణానికే అవధులూ లేవు. మనస్సు పరిగ్రహించడమూ, కంటితో చూడటమూ సమన్వయంగా జరుగుతుంది.

కళాకారుడు కొన్ని ప్రత్యేకగుణాలు కలిగివుండాలని కూడా రామగుప్తుడు నిర్వచించాడు. సౌందర్యార్చనను నిశితంగా పరిశీలించగలనేర్పు, సాంకేతికదక్షత, జంతువుల ఆకృతులు, మానవులు - వారి కదలికలు, వివిధ భంగిమల్లో వారి విచిత్రనైఖరులు - యివన్నీ కళాకారునకు క్షుణ్ణంగా తెలిసి వుండాలి. సుశిక్షితమైన మేధాసంపద, నిగ్రహశక్తి, సద్గుణ శీలత వుండాలి.

"మీరొక మహాసముద్రం లాంటివారు. మీ అనంత జ్ఞాన సంపత్తి ముందు నేను అల్పుణ్ణి"

"మనకెంత వచ్చుననేది ముఖ్యమా బదరీ? ఏదైనా సత్యమేది? సుఖమేది? అదే.చింతనపైనే ఆధారపడివుంది."

"మానవుడు సత్యమైన జీవితాన్నెలా గడుపుతాడు?"

"తనకు తాను సత్యవాదియైతే సరి. ఏదో ఒకదాని మీద నమ్మకం కలగవచ్చు. కాని అదేమిటో నీవు తెలుసుకునేవరకూ నమ్మినదాన్ని చేస్తుంటే సరి"

ఇలా యిద్దరూ సంభాషించుకుంటూ వుండగా కమలకుమారి గదిలోకి తొంగిచూచింది.

"నాన్నగారూ, వంటయింది. అమ్మ యిద్దర్నీ భోజనానికి రమ్మంటోంది," అని చెప్పింది కమలకుమారి

"నేను భోజనంచేసే వచ్చాను." అన్నాడు బదరీ నారాయణ.

రామగుప్తుడు లేచి గదిలోనుండి వెళ్తూ గుమ్మందగ్గర ఆగి యిలా చెప్పాడు.

"ఈసంభాషణ మరొకప్పుడు కొనసాగించుకుందాం. ఈమధ్య ఎప్పుడూ ఎవరితోనూ నేనింతసేపు మాట్లాడలేదు." అని చెప్పి ఆయనవెళ్లిపోయాడు.

కమలకుమారి అక్కడేవుంది.

"మా ప్రేమ అక్కపట్ల కోపంగా వుండొద్దు. మీరంటే అక్కకెంతో యిష్టం. ఇక్కడకు వచ్చినప్పుడల్లా మీగురించే చెపుతుంది."

అలాగా! అని ప్రశ్నిస్తున్నట్లు బదరీనారాయణ తల వూపాడు. కమల వెళ్ళిపోబోతూవుంటే, "ఒకపాట పాడ తావా కమలా?" అని అడిగాడు బదరీనారాయణ.

కమల సంతోషపరవశు రాలయ్యింది. పాడతానంది.

బదరీనారాయణ తిరిగి హాల్లోకివెళ్ళి బల్లమీద కూర్చు న్నాడు. కమలకుమారి వీణ పట్టుకొచ్చి, చాపవేసి, చాప మీద కూర్చొని, తీగెల్నిలాగి శృతి సరిచేసింది. పాట ప్రారం భించి, నెమ్మదిగా పాడుతూవుంటే అతని హృదయం సంతో షంతో ముప్పిరిగొన్నది. అప్పుడే తల్లికూడా వచ్చి ఆ ఆనం దంలో పాలు పంచుకొంది. రామగుప్తుడు కూడా వచ్చి తడి చేతులతో వింటూ నిలుచున్నాడు. కమల పాట పూర్తి చేసింది.

"ఆహా! చాలా బాగుంది. నామనసెక్కడో విహరించి వచ్చింది." అని మెచ్చుకున్నాడు బదరీనారాయణ.

మరుక్షణంలో కమలకుమారి తల్లి ముఖంలోకి బదరీ చూచాడు "సరే, వస్తానండి"అని లేచాడు బదరీనారాయణ.

# 15

బదరీనారాయణ చిత్రశాలలో కూర్చుని ఆచార్య పద్మదత్ యిచ్చే మహోపన్యాసాన్ని వింటున్నాడు. ఆచార్యులవారి ప్రతిభా విశేషాలనప్పుడు అర్థం చేసుకున్నాడు. సాటిలేని ఆయన జ్ఞానసంపత్తి, మానం, వినయం, కళపై కేంద్రీకరించిన శ్రద్ధాసక్తులు - యివన్నీ బదరీనారాయణలో గౌరవభావాన్ని ఉద్దీపింపజేశాయి. తన పద్ధతులను బలవంతంగా శిష్యులమీద రుద్దాలని ఆయనెప్పుడూ ప్రయత్నించలేదు. వారి వారి యిష్టానుసారం, అభిరుచుల ననుసరించి అభివృద్ధి చెందేందుకు తన మేధాసంపద వినియోగించేవాడు. అధ్యాపకుడు యీ తత్వాన్ని పోషణ చేయడం నిజంగా మహత్తర విషయం!

"నేను పదే పదే చెప్తున్నాను, కళలు ఆత్మ వికాసానికి సాధనాలని. కళలు భావోద్వేగం కలిగిస్తాయి. మేధస్సును పెంపొందింపజేస్తాయి విజ్ఞానాభివృద్ధికి కళలు చక్కటి నిలయాలు. మనస్సును ప్రశాంతపరచి, వినిర్మలంగా వుంచి, మానవుణ్ణి శాశ్వత సత్యాలను గుర్తించేలా చేస్తాయి."

మానవ స్వభావాన్నుండే కళలుద్భవించాయి. ఒకదానితో వొకటి అంతర్లీనమై, సంఘటితసౌందర్య రసస్ఫూర్తి

నొంది, మానవ జీవితాన్ని దివ్యస్వరూప తేజోవిలసిత గగ నాంచలాలను చుంబింపజేస్తాయి.

కళ ఒక సృష్టి. భావనతో కూడుకున్న సృజనాత్మక శక్తి. అత్యున్నతస్థాయిలో "ధ్యానము" లేదా ముముక్షు వుగా పేర్కొనబడుతుంది. సౌందర్యార్చనలో మానవునిసృష్టి జగత్తు. స్వాప్నిక సౌందర్యాల మేలికలయిక. ప్రపంచమంతా ముగ్ధయై దానికి జోహారు చేస్తుంది. అది బాహ్యేంద్రియా లతో వినే సంగీత స్వరంలాంటిది.

కళలో ప్రధానమైన ఆరుభాగాలను గూర్చి మీకు వివరించాను. కాని మీలో కొద్దిమందికే అవి గుర్తున్నట్లు నాకు తోస్తుంది. అందరికీ తెలుసుకోవాలనే ఆకాంక్ష అయితే వుంది గాని, తొందర పడిపోతున్నారు. అంటే మీరేదో చెడగొడ్తున్నారని నేనడంలేదు. కాని మీరు చేసేపని, మీరెంత హడావిడి పడుతున్నారో స్పష్టంగా సూచిస్తోంది.

ఈరోజు మొదలుకొని - ప్రతి విద్యార్థి 'షాతంగ్' (అంటే కళలో ఆరు ప్రధానభాగాలు)ను పునశ్చరణచేయండి. అలా చేయడంవల్ల అది మీ అంతరంగాల్లో ప్రతిధ్వనిస్తూ వుంటుంది. 'షాతంగ్' నీకు తెలుసా, ప్రేమానంద్?"

ప్రేమానంద్-కాదు, ప్రేమకుమారి లేచి నుంచుంది. "తెలుసండి," అని చేతులు కట్టుకుని చెప్పింది.

బదరీనారాయణ ఎక్కడో దూరాన్నుండి చూచి నట్లు ముఖం ముకుళించి ఆ మెవంక చూచాడు.

"క్లాసంతటికీ చెప్పు" అన్నారు ఆచార్య పద్మదత్.

"మొదటిభాగము - ఆకృతి; గీతలు గీచి వాటికి ముద్దగా బలాన్ని కల్పించి, ఉద్దేశం ప్రతిఫలింపజేసి, అన్ని భాగాలనూ ఐక్యంచేసి మొత్తంరూపం కనిపించేలా చేయడం.

"రెండోభాగం - ప్రమాణం. ఈ భాగంలో మొత్తం రూపం ఉద్దీపనచేసే ఆధ్యాత్మికభావం.

మూడోభాగంలో - భావం ప్రధానం. ఆధ్యాత్మిక భావానుగుణ్యమైన అందము, ఆలంబనము ద్యోతకమవు తున్నాయా లేదా అనే మీమాంస.

నాల్గోభాగము - లావణ్యము - ఇందులో మొత్తం రూపమిచ్చే భావం వెల్లడించే అజరామరమైన సత్యం.

అయిదోభాగం - సాదృశ్యం : ఇది వేరువేరు రంగుల సమ్మేళనారూపం.

ఆరవభాగం _ వర్ణికాభంగిమ ఇది ప్రతి కదలికా, కళలో విశిష్టతల్ని వెల్లడిచేసే దశ."

ఇలా ఆరుదశల గురించీ ప్రేమకుమారి వివరించి, ఆచార్య పద్మదత్ గారికి రెండు చేతులూ జోడించి నమస్క రించి, కూర్చుంది. మళ్ళీ తరగతి నుద్దేశించి ఆయన యిలా ప్రసంగించాడు.

"మీ భావం సంతృప్తికరంగాలేదు. మీరు అందాన్ని సౌందర్యాన్ని ఆదరించండి మీచుట్టూ వృక్ష కొంకల్ని, చెట్లను నదిని, ఆకాశాన్ని చూడండి ఎంతో సౌందర్య

శోభ గోచరిస్తుంది. ఆ శోభ మీలో నూతన వికాసాన్నుద్దీపన చేస్తుంది. ఆ సౌందర్య శోభను తిలకించేటప్పుడు మిమ్మల్ని మీరు మరచిపోతారు. మీరు దేన్ని చిత్రించదలుచుకున్నా, ఆ ఆకృతిలో మీరు లీనమైపోవాలి అంతరంగిక సౌందర్యం చాలా ప్రధానమైనది. కళ యాంత్రికమైనది కాదు. అది ఆలోచనతో కూడుకొన్నట్టిది. ఆవేశ ఉద్వేగం.

కళ మానవజాతినే బ్రతికిస్తుంది. సౌందర్యాన్ని కళ ప్రకటిస్తుంది. సౌందర్యంతో మనం జయిస్తాము. సౌందర్యంలోనే మనం లీనమైపోతాం. కళాకారుడు తన కళద్వారా నూతన సృష్టిచేస్తాడు. అనంతమైన శోభలకు రూపం కల్పిస్తాడు. భావాలకు రూపకల్పన చేస్తాడు. కళాకారుడు ఒక పుష్పం చిత్రిస్తాడనుకోండి. కేవలం దాని బాహ్యాకృతిని చిత్రించడమే కాదు. దానిలో అంతర్లీనమైవుండే పరిమళ ప్రభావాన్ని చిత్రించటానికి ప్రయత్నించండి. ఆ పరిమళాన్ననుసరించే దాని మనుగడ ఆధారపడి వుంది."

ఇలా వుపన్యసిస్తూ తరగతిని మామూలుగా కన్న కొంచెం ఎక్కువసేపు వుంచి, తరగతిని వదలిపెట్టాడు.

"బదరీనారాయణా! నీవుండు, నీతో మాట్లాడాలి" అన్నాడాయన. భిక్షువులంతా వెళ్ళిపోయారు.

అందరూ వెళ్ళిపోయాక ఆచార్య పద్మదత్ బదరీ నారాయణతో యిలా అన్నారు.

"రాత్రి ప్రేమకుమారి నాదగ్గరకొచ్చింది, కంటికి మంటికి ఏకధారగా యేడ్చింది. అందుకు కారణం నువ్వే.

ప్రేమానంద్ కన్య అన్న సంగతి అందరికీ తెలుసు. అయినా పురుషుడనే భావిస్తారు అంతా. ఇకమీదట తనతో నీవు స్నేహంగా వుండమన్నావని పక్చింది. నీతో స్నేహం చేయడానికెంతో విలువ నిస్తున్నట్లుగా చెప్పింది. నీవు లేకపోతే పనే చెయ్యలేను."

"ఆమె స్త్రీ. స్త్రీలంటే నాకిష్టంలేదండీ"

"ఆమె స్త్రీ యైనంతమాత్రంచేత ఆమెలో తప్పేముంది? ఆమెతో స్నేహంగావుండు. ఇక్కడ వొకరు వొకర్ని ద్వేషించడానికీ, వేరుబాటుగా వుంచడానికీ తావులేదు. అందరూ కలిసి మెలిసి ఒకే కుటుంబీకుల్లా జీవిస్తూ గత జీవిత బాతల్ని మరిచిపోయి, సుఖవర్తనులవ్వడమే ప్రధాన కర్తవ్యము అయినా... నేను నీకేం సలహా యివ్వలేను. ఎవరి యిష్టంవారిది."

"సరే. ప్రయత్నిస్తానండి."

# 16

బదరీనారాయణ షికారుకు వెళ్ళాడు. ఆ కొండచరియల్లో కొంచెంసేపు తిరిగాడు. తర్వాత వెంకన్న దగ్గరకొచ్చాడు. వెంకన్న తను తయారుచేస్తున్న విగ్రహంప్రక్క ఖాళీగా కూచున్నాడు.

"నీకోసమే చూస్తున్నా" అన్నాడు వెంకన్న.

"ఏవీ, నీవులీ, బాడితా యివ్వు."

వెంకన్న వులీ, బాడితా యిచ్చాడు. బదరీనారాయణ విగ్రహం చెక్కడానికి అనువుగా అమర్చబడిన వేదిక యెక్కాడు.

"తొండానికి ఒకవంపు చాలా? యింకా యెక్కువ కావాలా వెంకన్నా?" అని అడిగాడు బదరీనారాయణ.

"రెండు వెయ్యాలి; ఎవరో పుష్పమాలాలంకృతుల్ని చేస్తున్నట్లు...."

"బలే ఆలోచనాపరుడవు వెంకన్నా, పైకి—రా: ఎలా చేస్తున్నానో చూద్దువుగాని."

వెంకన్నను ప్రక్కన కూచోబెట్టుకుని, బదరీనారాయణ శిల్పాన్ని చెక్కాడు. వెంకన్న కిడకిడటూ చూచాడు. ఆశ్చర్యపోయాడు. మొత్తం విగ్రహమంతా పూర్తయ్యాక చూచి మరింత దిగ్భ్రమ చెందాడు.

"ఎలా చెక్కాలో యిప్పుడు తెలిసింది, బదరీ... ... విహారంలో యీ ఏనుగులతో కావలసిన శిల్పాలన్ని చెక్కతాను."

ఇద్దరూ వేదిక దిగారు. బదరీనారాయణ అక్కడనుంచి వెళ్లిపోయాడు.

కొండన్న విహారందగ్గర కొచ్చాడు. లోపలకు వెళ్ళాడు. అక్కడ ప్రేమసుమాలిని చూచాడు. "ఇల్లు వదలి వెళ్లి వెళ్ళిపోతున్న భిక్షువు—" చిత్రసూపును చిత్రిస్తోంది అతని పాదాలచప్పుడు విని వెనక్కి తిరిగి చూచింది.

"పనిలో వున్నావనుకుంటాను."

"లేదు. పని చెయ్యాలనుకుంటున్నాను. కాని చెయ్య లేకపోతున్నాను.

"నామీద యింకా కోపంగానే వుందా?"

ఆమె ముఖంలో కళాకాంతుల్లేవు.

"లేదులే. అక్కడేం జేస్తున్నావు?"

"ఆనంద్- జీవితంలో వైరాగ్యంచెంది వెళ్ళిపోతు న్నట్లు, అప్పుడు యువరాణియైన ఆయన భార్య కృశించి పోయి, యెలా మరణించిందో ఆ బొమ్మను చిత్రిస్తున్నా."

"ఇంకా యువరాణిని గీయలేదుగా. ఆ రూపం- గీతలంత చిందరవందరగా గీచావేం? కొంచెం చక్కగా గీయలేవూ?"

"గీస్తాను. ఆనంద్ మీవలెనే వుండేవారు" అని మృదువుగా పలికింది.

"ఒక రాణిని వదలిపెట్టి వైరాగ్యం చెందుతున్నానా నేను?

"మీకోసంఎవరినోకృశించమనివిడచిపెట్టేస్తున్నారుగా మీరున్నూ."

"నిన్నా?" అని బదరీనారాయణ నవ్వాడు.

అతని నవ్వులో అంతరార్థాన్ని అర్థంచేసికోలేక అతని వంక అదోరకంగా చూచింది ప్రేమకుమారి.

"ప్రేమించాలని నాకు లేదు. నాకు కావలసినది మీతో స్నేహంమాంత్రమే."

"నేను వెళ్ళిపోతే నువ్వు నాగురించి కృశించిపోతావా!"

"ఏమో నాకు తెలియదు - నిజంగా"

బదరీనారాయణ కొండన్న విహారంలోనికి వెళ్ళి జాతక కథల్ని వెల్లడించే బొమ్మల్ని పరిశీలనగా చూచాడు. ఒకదానితర్వాత ఒకటిగా చిత్తరువుల్నీ, శిల్పాలనూ చూస్తూ వుండగా అతని మదిలో ఏవో ఆలోచన మెఱుపులా మెరి సింది. అది ఒక రూపం దాల్చుతూ వుండగానే అతని కళ్లల్లో ఒక ఆశాజ్యోతి ప్రకాశించింది.

గోడలవంక చూచాడు: పడమటివైపు గోడలమీద వెలుతురు అద్భుతంగా పడుతోంది. ఆ గోడమీద ఏ చిత్త రువులూ, శిల్పాలూ లేకపోయినా, ఆ గోడవంక చూస్తుంటే అతనికేవో చిత్రవిచిత్రాలైన బొమ్మలగుపించాయి. అప్పుడు పని ప్రారంభించాడు. తన కట్టుపంచె మడతలోనుంచి చిన్న వులిని తీసుకుని, నున్నగా వున్న ఆ రాతిని గోకడం ప్రారం భించాడు.

"నేను తోడు రానా బదరీ!" అని అడిగింది ప్రేమ.

"వద్దు; నీ పనేమిటో నువ్వు చూచుకో," అని బదరీ నారాయణ బయటకు వెళ్ళి రంగుల్నీ, రంగుల్ని కలిపే పాత్రల్నీ తెచ్చాడు.

బొమ్మ గీయడం ప్రారంభించాడు: చుట్టూ ఎఱుపు రంగుతో గీచాడు. గబగబ ఏవో రంగులు కలిపి ఆ బొమ్మకు అలంకరణలు పూర్తిచేశాడు. కొద్దిసేపట్లో గోడమీద చక్కటి బొమ్మ—ఒక స్త్రీ ఆకృతి—ఒక కన్యను చిత్రిం చాడు. ఆ కోమలాంగి ఎవరోకాదు. ఆ క్రితంరాత్రి తాను

చూచిన సుందరే తన కెదురుగా నిలబడి కోయిలకంఠాన్ని మరిపించిన మధురగాయని. అంతటితో ఆ చిత్తరువుపని పూర్తి కాలేదు. కళ్ళు దిద్దాడు. నీలాలు నింపాడు. ఆహా! సమ్మోహితుణ్ణి చేస్తున్నాయి. పెదవులకు ఎఱుపురంగు వేశాడు ధనుర్బాణాన్ని గుర్తుకు తెస్తున్నాయి. దేవతా కన్యవలె, ఆ పొడవైన నల్లని శిరోజాలు, యవ్వనపొంగులతో శిఖరాంచలాలవలె ఎత్తైన వక్షోజాలు-తొలిచూపులోనే మనిషిని మత్తెక్కించేలా వున్నాయి. వక్షోజాలనడుమ వ్రేలాడుతున్న బంగారుగొలుసు నిగనిగలు మనస్సును మెలివెట్టేస్తున్నాయి.

ఆమె ఎడంచేతిలో అద్దం పెట్టాడు. కుడిచేతిలో ముఖం అద్దుకునేటటువంటి చిన్నపౌడరద్దుకునే పువ్వు అమర్చాడు. ఆమెవంక చూస్తేనే కైపెక్కి నరనరాల్లో వుద్రేకం పొంగులు వారుతుంది. ఇక శిరోజాల విషయం! - చూస్తున్నాడు. నల్లగా, సన్నగా, పొడవైన శిరోజాల్ని చిత్రించాడు. అంతలో చేతిలోనుండి బ్రష్ గభాలున జారి పడిపోయింది. బదరీనారాయణ ఒక్కపెట్టున కేకవేశాడు ఛీ యంటూ. ఆ బ్రష్ క్రింద పడిపోతూవుండగా ఆ చిత్రంలో మొఖాన ఒక నల్లటి మచ్చ పడింది. అది చూచి బదరీ ఆగ్రహ పరవశుడయ్యాడు ఆ ఉద్రేకంలో తననుతాను మరచిపోయాడు. ఆ చిత్రాన్ని చెఱిపిపారవెయ్యాలన్నంత ఉద్రేకానికి లోనయ్యాడు.

చిత్రం చెరిపివేసేందుకు సున్నపుగుడ్డ పట్టుకొద్దామని బయటకు వెళ్లాడు. రంగులు నూరుతూ వున్న ప్రేమకుమారి అతణ్ణి చూచి విస్మయం చెందింది.

"బదరీ," అని కోపంగా, ముఖం చిట్లించుకొని కూచు తున్నవాణ్ణి పలకరించింది కాని అతనేం సమాధానం చెప్ప కుండా సున్నపుగడ్డ తీసుకొని, మళ్ళీ లోపలకు వచ్చేస్తు న్నాడు. ఏం జరిగిందోనని కంగారుగా ప్రేమకుమారి అతణ్ణి అనుసరించి వచ్చింది. ఆగోడమీద చిత్రరువును చూచి ఆశ్చర్యపోయింది. అలా చిత్రించగల్గిన అతని నేర్పరితన మెంత గొప్పదో తన కళ్లను తానే నమ్మలేకపోయింది. ఆ నల్లని శిరోజాలు ఎంత అందంగా వున్నాయి! మనోహరమైన చిత్తరువది!

"ఏం చేస్తున్నావు బదరీ?", అని ప్రేమకుమారి బదరీ నారాయణను సమీపించి, ప్రశ్నించింది.

"ఛ! పెద్దచిత్రం - చెడిపోయింది అనుకున్నదొకటి. జరిగిందొకటి," నిరాశోపహతుడై అన్నాడు బదరీ, కోపంతో పళ్లు కొరుక్కుంటూ.

"ఎవరు చెడగొట్టారు?" తొట్రుపడుతూ అడిగిందామె.

"అవతలకు వెళ్ళు. నన్నొంటరిగా వుండని." అని కసిరాడు బదరీ.

"తొందరపడి ఏమీ చేయకు, బదరీ! ఏం చెడింది?" అని అతని చెయ్యి పుచ్చుకొని దీనంగా అర్థిస్తున్నట్లు అడి గింది.

"ఆ శిరోజాలు చూడు- నుదుటిమీద, అవి సరిచేస్తుం డగా బ్రష్ జారిపోయింది ముఖంమీద నల్లటిమచ్చ పడటం వల్ల వికృతంగా కనిపించడంలేదూ? మొత్తం చిత్రాని కంతకూ కళంకం తెచ్చేట్లుగావుంది చూడు ఆమచ్చ."

"ఆగు, బదరీ. తొందరపడకు," అని చెప్పబోతున్న బదరీనారాయణను వారిస్తూ, ప్రాధేయపూర్వకంగా అడిగింది.

"నిజంగా, బ్రష్ జారిపడిందా! కాని, బదరీ చూడు- ఎంత వాస్తవికంగా వుందో! ఆహా... ఎంత సహజత్వంగా వుందో....దాన్ని కొంచెం వంకీ తిరిగినట్లు చెయ్యి. నేను చెప్పిందేమిటో.... అసలాలోచించు- అయినా అసలు చేసి చూడు- బాగుండకపోతే తర్వాతయినా చెరిపేయవచ్చుగా"

"నువ్వు చెయ్యి - ఆ చేసేదేమిటో" అని గొణిగాడు బదరీ.

"అలాగే", అని ప్రేమకుమారి బ్రష్‌ను తాను చేబట్టింది. తర్వాత ఆ చిత్తరువు టాయిలెట్ చేసుకున్నట్లు చిత్రించేసరికి, బదరీనారాయణ దాన్ని చూసి విస్మయం చెందాడు. ఇద్దరూ కలసి మిగతా వివరాలన్నీ పూర్తి చేశారు ... పరిచారికలు ... ప్రత్యేకమైనగది ... అందులో అట్టహాసాలు...

ఇద్దరూ కొంచెం ఎడంగా వెళ్ళి సంతృప్తి చెందారు. బదరీనారాయణ - ప్రేమకుమారి బుజాలమీద చేతులువేసి "ప్రేమ్, చాలా బాగుంది" అని అన్నాడు కళ్ళల్లోనూ, పెదవులపైనా చిరునవ్వును కొంటెగా చిలికిస్తూ.

"అవును. బాగానేవుంది." అని ఆమె ప్రకృతిని తిరిగి అతని ముఖంలోకి చూసింది ఆమె కళ్ళల్లో సజల బిందువులు చిలిపిగా నృత్యం చేస్తున్నాయి.

"మీ ఆలోచనలు చాలా సొగసైనవి బదరీ! నాకూ అలాంటి ఆలోచనలు కావాలనే కోరిక వుంది."

ఆమె తనకాంక్ష నిట్లా వెలిబుచ్చేసరికి బదరీ నవ్వాడు. ఆమె కన్నీటి ముత్యాల్ని తన చేతులతో తుడిచి ఆమెకు ఉపశమనం కలిగించాడు.

"నా ఆలోచనలేం మంచివికావు. భావాత్మకమైన స్త్రీని సృష్టించాలనుకున్నాను కాని అపురూప సౌందర్యవతిగా మారి కూర్చుంది. చాలా సున్నిత మనస్కురాలినిగా చిత్రించాలనుకున్నాను. కాని తన సోయగంతో జగత్తునే మురిపించే ప్రలోభాలూరించు అప్సరసలా రూపొందింది. ఎందుచేతనో మరి?"

"ఎందుచేతేముంది? నీఆలోచన్లు అంత సుందరమైనవి."

కొంచెంసేపు బదరీ మౌనంగా వుండిపోయాడు ఆలా చిత్రంవంక చూడటానికి. అందలి సౌందర్యాన్ని తనివితీరా ఆనందించేందుకు సంభాషణలవసరం లేకపోయినై.

"చక్కగా చేశావు ప్రేమ్ కృతజ్ఞుణ్ని."

"నాపై కోపంగా లేవా బదరీ?" చంటిపిల్లమాదరి భయపడుతూ అమాయకంగా ప్రశ్నించింది.

"లేదు. నాకు మతిపోయినట్లయింది. తర్వాత చాలా బాధపడ్డాను. నన్ను నువ్వే శాంతపరచావు."

"ఓ! అంత సత్యవాదివేం బదరీ!—నీవు చాలా మంచివాడవు. నీ ప్రభావం చెప్పలేనంత, చెప్పరానంత

గొప్పది బదరీ! ఇప్పుడు నా మనస్సు కుదటపడింది హమ్మయ్య!"

రోజులు దొర్లుతున్నకొద్దీ యిద్దరూ ఆ విహారాన్ని మనోజ్ఞ సౌందర్యాన్ని తీర్చిదిద్దారు. ఇద్దరూ కలసి పనిచేస్తూ వుండటంవల్ల ఆరోజుకారోజుకూ మళ్ళీ సన్నిహితులయ్యారు. విశ్రాంతి సమయాలలోగానీ, మరెప్పుడు అవకాశం చిక్కినప్పటికీ, యిద్దరూ చిత్రలేఖనాన్నిగురించే చర్చించేవారు.

"చిత్రం చూడవలసిందిగా ఆచార్య పద్మదత్ గార్ని ఆహ్వానిద్దాం. ఇది చూచి ఏమంటారని నీ వుద్దేశ్యం బదరీ?"

"ఊహలెందుకు? ఆహ్వానించి—విందాం"

ఆ మరునాడు తరగతి వదిలాక బదరీనారాయణ ఆచార్యులవారితో యిలా అన్నాడు,

"స్త్రీ అలంకరణను చిత్రించాము—అంటే స్త్రీ తన గదిలో అలంకరణలకై ప్రత్యేకించి వుంచుకొనే పరకరాల సముదాయాన్నీ, ఆ గది సౌందర్యగరిమనూ చిత్రించాము. చెడుగా ఏమీ లేదు. మీరొకసారి వచ్చి దాన్ని చూచి నిరా అభిప్రాయం తెలియపర్చాలని మా కోరిక."

"చూస్తాను."

అందరూకలసి కొండవన్న విహారానికి వెళ్లారు. ఆచార్య పద్మదత్ తన ముందున్న చిత్తరువుచూచి, చిఱునవ్వు నవ్వి "చాలా బాగుంది" అని అన్నారు. మళ్ళీ ఒక క్షణంచూచి, "ఆ శిరోజాల నెలా చిత్రించగల్గారు?" అని అడిగారు.

"బాగుండలేదా?", ఆందోళనగా అడిగాడు బదరీనారాయణ.

"బాగుంది... అది ఆమె తల దువ్వుకుంటున్నట్లు... అంతలో గాలి వీచినట్లు, గాలికి ముంగురులు చెదరి నుదుటి మీదపడినట్లు... యీ ముగ్ధసౌందర్యాన్ని, సౌకుమార్యాన్నీ చూచి దిగ్భ్రాంతి చెందుతారు—దీన్ని చూచిన ప్రతి వాళ్ళూరూ."

"అది ప్రేమ్ చెప్పిన సూచన." అని చెప్పాడు బదరీ నారాయణ.

ఆచార్య పద్మదత్ మళ్ళీ చిత్తరువువంక చూచాడు. బంగారు వన్నెల దేహచ్ఛాయ, మరులుగొలిపే ప్రౌఢిమ, కనుదోయి సోయగం... మైమరపించి, స్వప్నలోకాల్లో విహరింపజేసినవి.

"బాగుంది...చాలా బాగుంది" అని మళ్ళీ ప్రస్తుతించాడాయన. వారిద్దరివైపుకు తిరిగి యిలా అన్నాడు. "ఇప్పుడు మీ యిద్దరూ మంచి స్నేహితులు. నాకు చాలా సంతోషంగా వుంది. ఇద్దరిలోనూ పట్టుదల, ప్రతిభా వున్నాయి. ఇక్కడ మరింత సౌందర్యం వెల్లివిరియగలదనే నావిశ్వాసం."

"మీరు యెంతో ఆశిస్తారు గురుదేవా! కాని మేము ఎప్పుడో ఒకప్పుడు దేహం చాలించేవాళ్ళమేగదా."

"కావచ్చు. కాని కళ జీవిస్తుంది. మనం మరణించాక కూడా అది జీవిస్తూనే వుంటుంది ఇలాంటి చిత్తరువుల్ని ఎవరు చిత్రించారో ప్రజలకు తెలియకపోవచ్చు; కాని చిత్ర సౌందర్యాన్ని చూచి ఆనందిస్తారు. ఆ చిత్రకారుల్ని ప్రేమిస్తారు. అలా ప్రేమిస్తూ వాళ్ళొక అనిర్వచనీయమైన సౌఖ్యా

న్నను భవిస్తారు. బదరీ... నీవు బౌద్ధమతావలంబీకుడ వెందుకు కాగూడదు?"

"అంత అవసరంలేదు. నేనిప్పుడు సంతృప్తిగానే వుంటున్నాను."

"బౌద్ధమతావలంబీకుడవైతే, బుద్ధుణ్ని మరింత సౌందర్యవంతుణ్ని చేస్తావు. ఆయనను మహోన్నతంగా చిత్రించగలవు."

"బుద్ధుని చిత్రాన్ని గీయాలనే అభిలాష నాకు లేదు. నా మనస్సుకే ఆలోచనవస్తే, దాన్నే చిత్రిస్తూ వుంటాను."

"ఎందుచేత, బదరీ?"

"బౌద్ధమత మవలంబిస్తే కొన్ని కట్టుబాట్లుకూ, కొన్ని ఆచారవ్యవహారాలకూ బద్ధుణ్ని కావలసివస్తుంది. నా స్వేచ్ఛకు సంకెళ్ళు పడతాయి. నేనిలా స్వేచ్ఛగా వుండడమే నాకానందం."

"అలా భావిస్తే ఎవరేం చెప్తారింకా?"

"అర్థం చేసుకున్నందుకు కృతజ్ఞుణ్ని"

అందరూ బయటకు వెళ్ళారు. జలజలా పారుతూ వున్న వాఘురానదిని చూస్తూ నుంచున్నారు.

"ఇప్పుడేం జేస్తున్నావు ప్రేమానంద్!" అని ప్రశ్నించాడు ఆచార్య పద్మదద్.

"ఆనంద్ అదృశ్యమైపోతూ వుండగా, అతనికోసం కృశించి మరణిస్తున్న యువరాణిని చిత్రిస్తున్నా. ఇందులో

ప్రధాన పాత్ర మరణిస్తున్న రాణి. అయితే మొదట ఆనంద్‌ను గీచాను ఎందుకంటే బదరీను చూస్తే ఆనంద్‌ను స్మృతి పథంలో చూస్తాను."

"బహుశా నిన్ను వూహించుకునే, మరణిస్తున్న రాణిని చిత్రిస్తావనుకుంటాను." కంటిచూపుల్లో కొంటెతనం చిందిస్తూనే అన్నాడు ఆచార్య పద్మదత్.

ప్రేమకుమారి ఆయనవంక చూస్తూ నవ్వి "కావచ్చు" అని అన్నది.

"జాతక కథలను చిత్రిస్తానన్నమాటేం జేశావు?"

"రెండింటిని గీచాను."

"ఒక్కటే చూశానే- 'విధురపండితుని జాతకకథ!' రెండోదేమిటి?"

"హంస జాతకకథ."

"అది నువ్వు గీచిందేనా? నువ్వు గీచానని ఎప్పుడూ చెప్పలేదేం! ఎవరో గీచారనుకుంటున్నాను. ఎవరా గీచిందని కనుక్కుందామనికూడా అనుకుంటున్నా. అది చాలా బాగుంది."

"మీ సదభిప్రాయానికి కృతజ్ఞుణ్ని." అని అందామె. (స్త్రీ యైనా పురుషుడన్నట్లే వ్యవహరిస్తుంది )

ప్రకృతి రామణీయకతను తిలకిస్తూ, సౌందర్యాన్ని తనివితీరా ఆనందిస్తున్నాడాయన!

"ఇవాళ మంచిరోజు ఇద్దరూ ఏంచేద్దామనుకుంటు న్నారు?"

"తోటలో వున్న మా యింటికి వెళ్ళబోతున్నాం."

"మంచిది. మీ తల్లిదండ్రులు ఏం జేస్తున్నదీ, ఎట్లా వున్నదీ మళ్ళీ వచ్చినప్పుడు చెప్పు? ఎప్పుడో—వీలయినప్పుడొకసారి మీ యింటికొస్తానన్నానని మీ నాన్నగారితో చెప్పు" అని అన్నాడు ఆచార్య పద్మదత్ ప్రేమకుమారితో.

# 17

ఇద్దరూ వాఘురానదికి వెళ్ళారు.

"'సాటునుండి' దగ్గరకు వెళ్దాం పద. అక్కడ నదిలో ఆడుకుందాం," అన్నాడు బదరీ.

"ప్రమాదం కాదూ?"

"చాలా. కాని భయపడేదెవరు? జాగ్రత్తగా యీదితే ప్రమాదంలేదు. భయం భయంగా చేస్తే ప్రమాదం కానిదేముంది?"

"వెళ్దాంపద."

ఇద్దరూ జలపాతాల దగ్గరకు వెళ్ళారు. వాఘురా యేడు మార్గాలగుండా విరుచుకు పడుతోంది. ఏడు జలాశయాలుగా విరుచుకుపడుతోంది. అన్నిటికన్న చిన్నది చాలా లోతుగా వుంటుంది. దానినిండా చేపలే.

బదరీనారాయణ పై బట్ట విడిచేశాడు. చెప్పులు ప్రక్కన వదిలాడు. నీటిలోకి వురికాడు. ఆనందంగా యీదు

తున్నాడు. ఒక్షున నుంచుని తనను చూస్తూవున్న ప్రేమ కుమారిని చూచాడు.

"రా, బట్టలు విడచి నీటిలో కురుకు."

"ఎలా? నేను స్త్రీనిగానూ?"

"అయి తేఏమిటి? నిన్ను పురుషుడనుకొని వ్యవహరించ మన్నావా? లేదా? కనుక స్త్రీనన్నసంగతి మరచిపోయి, రా."

"ప్రేమకూడా చెప్పులు విడచి, బట్టలవీ తీసేసింది. వక్షోజద్వయం సిల్కుగుడ్డతో బిగువుగా కట్టుకొంది. నీటి లోకి దూకింది.

చేపల్లాగా యిద్దరూ యీదారు. దాగుడుమూత లాడుకున్నారు. ఒకరినొకరు పట్టుకోవాలని, ఒకరినుంచి ఒకరు తప్పించుకోవాలని నీటిలో వేట సాగించారు. అలా యీది అలసట కలిగాక వొడ్డుకొచ్చారు. తర్వాత యిద్దరూ ప్రక్కనే వున్న పచ్చికమీదకు వెళ్ళి కూర్చున్నారు, సూర్యరశ్మికి సైతం దాహం తీర్చాలన్నట్లు!

"ఇక్కడ బాగుందా బదరీ?" అని మృదువుగా అడి గింది ప్రేమ. బదరీనారాయణ క్షణంసేపు ఆమె వంక చూచాడు. ముందుకు వంగి ఆమెను ముద్దు పెట్టుకున్నాడు. చేతిమీద మొదట్లో ఆమె తప్పించుకోడానికి ప్రయత్నించింది కాని తర్వాత లొంగిపోయింది. మళ్ళీ ఆమెవంక చూచి యిలా అన్నాడు. "ఇప్పుడు చాలా హాయిగా వుంది"

ఆమె ముఖం ప్రక్కకు త్రిప్పుకొంది. కళ్ళల్లో నీటి ముత్యాలు నిలచినాయి.

"నీకు కష్టం కలిగించానా?" అని అడిగాడు బదరీ.

"నేనింతవరకూ పురుషుణ్ణెవర్నీ ప్రేమించలేదు. కాని యిప్పుడు మిమ్మల్ని ప్రేమిస్తున్నాను."

"నేనూ నిన్ను ప్రేమిస్తున్నాను ప్రేమ్."

"అయితే అప్పుడు నేనంటే ఎందుకంత కఠినంగా వున్నారు?"

"ప్రేమ చాలా క్రూరమైనది. అది - చాలా చాలా క్రూరమైనది. అది యిచ్చేదానికంటే పుచ్చుకోనేది కావాలని ఎక్కువ కోర్తుంది. దాని అధికృత చాలా హెచ్చు. అది ప్రతీదీ కావాలని అడుగుతుంది."అని సహజప్రేమలో నిగూఢ రహస్యాన్ని బయటపెట్తూ అన్నాడు బదరీ.

ప్రేమకుమారి బదరీవంక చూచింది. ఆ చూపులో గాంభీర్యము, ఆ కాటుక కళ్లు...గాఢ తమస్సూ...

"నన్ను ఎప్పుడూ ప్రేమిస్తావా? బదరీ? అని చిలిపి ప్రశ్న వేసింది.

"ప్రేమ పుష్పంవలె వాడిపోదు; రాలిపోదు. అది మారుతూ వుంటుంది." అని అంటూ ప్రక్కకు తిరిగి అతడు తన తలను ఆమె ఎదురురొమ్ముపై ఆన్చాడు. ఇంకా యిలా అన్నాడు.

"నాకు ప్రేమనుగురించి అంతగా తెలియదు నేనింతక మునుపు ఎవరినీ ప్రేమించలేదు. కనుక నువ్వేబోధించాలి."

"ఎందరో స్త్రీలతో గడిపానన్నావుగా బదరీ?"

"అవును. ఎందరు స్త్రీలతోనో గడిపాను... కాని ఎవరిన్నీ ప్రేమించలేదు. అదంతా క్షణికానందమే. కామో ద్రేకంతో గూడిన సుఖమూ, తాత్కాలిక తాపత్రయం."

"నేనూ అందరి స్త్రీలవంటి స్త్రీనేగా!"

"నువ్వు అందరివంటి స్త్రీవి కావు. వాళ్ళకూ నీకూ తేడా వుంది. నీవు నా స్త్రీవి. నేను ప్రేమిస్తున్న స్త్రీవి."

అతనలా అంటూంటే ప్రేమకుమారి పారవశ్యం చెందుతూ తన చేతివ్రేళ్ళను అతని తలలోకి చొప్పించి కేశ రాల్ని దువ్వింది.

"నీగురించి నేనెప్పుడూ కలలుకంటూనేవున్నా బదరీ. ఎన్నడైనా ఒక స్త్రీనంటూ ప్రేమించావా అని నిన్నడి గాను - గుర్తుందా?" ఎవరినీ ప్రేమించలేదన్నావు. ఎంతో ఆనందించాను. ఎందుకనో తెలుసా? ఆ ప్రేమింపబడే అమ్మా యిని నేనే కావడంవల్ల"

"అయితే నా గత జీవితాన్నిగురించి లక్ష్యపెట్టవా?" ఎదురు ప్రశ్న వేశాడు బదరీ.

లక్ష్యపెట్టనన్నట్లు ఆమె తలపంకించింది తన్మయత్వం కొద్దీ అతడామెను ముద్దాడాడు. అప్పుడు వెనక్కువచ్చి పచ్చికమీద వెల్లకిలా పడుకున్నాడు

"తరవాత ఏంజేయాలను కుంటున్నావు?" అని అడి గిందామె.

"తెలుసుకోవాలని వుందా?"

"అవును."

"ఇద్దరు ప్రేమికుల్ని గీస్తాను. 'నీవూ–నేనూ'."

"వద్దు బదరీ, వద్దు. భిక్షువులందరికీ తెలిసిపోతుంది."

"తెలుసుకోనీ. ప్రేమ వెన్నెల వెలుగుల్ని దాపరికం చేయలేము."

"కానీ – నన్నిక్కడ నుంచి వెళ్ళిపొమ్మనవచ్చు. ఆచార్య విజ్ఞానందులవారికి యిది నచ్చదు, బదరీ. నేను అజంతానుకూడా ప్రేమిస్తున్నాను బదరీ.

"నాకు తెలుసు. జాగ్రత్తగానే వుంటానులే."

ఆమె ప్రక్కకు తిరిగి అతనివంక చూచింది. ఆమె పెదవులు దేనో్న కోరుతున్నాయి. మృదువుగా, మాధురంగా.... నరనరాల్లో వుద్రేకం పొంగింది...

ఇద్దరి పెదవులూ... గట్టిగా.. ముడిపడిపోయినై.

# 18

ప్రేమకుమారి, బదరీనారాయణ లిద్దరూ కలసిరావడంతో రామగుప్తుని యింటిదగ్గర ఘనస్వాగతం కన్నమిన్నగా ముప్పిరిగొన్న హృదయానందంతో లోపలకు ఆహ్వానింపబడ్డారు.

కమలకుమారి బదరీనారాయణను చూచి నవ్వుతూ యిలాఅంది "మీరూ ప్రేమకుమారి మాట్లాడుకుంటూంటే

నాకెంతో సంతోషంగా వుంది. మీరిద్దరూ యిక మాట్లాడు కోరేమోనని నాకు చాలా భయమేసింది."

"మేమిద్దరం మాట్లాడుకోనేందుకు మా స్నేహితులు వలదన్నారు. మొత్తానికి మాట్లాడుకుంటున్నాము."

"పురుష వేషం వేసికుంటున్నా- ఆమె అంటే మీకిష్ట మేనా?"

"ఆ. దానికేంగాని, నీవు ఒకసారి మా చిత్రశాలకు రావాలి."

"ఎందుకూ?"

"ఒక స్త్రీ అలంకరణ తీర్చి దిద్దుకుంటున్నట్లు నిన్నే చిత్రించాను:"

"నిజంగానా? ప్రేమకు తెలుసా?"

"అబ్బొమ్మ నీవని ప్రేమకు తెలియదు. తెలిస్తే ఈర్ష్య పడిపోదూ?"

కమల ఘొల్లున నవ్వింది. ఆ నవ్వులో కలకలలు, సంగీతధ్వనుల్లా తీయగా ప్రతిధ్వనించిన్నై.

"అయితే, అంతవరకూ వెళ్ళిందన్నమాట వ్యవహారం."

అంతలో రామగుప్తుడు లోపలకొచ్చాడు. "నాగదిలోకి వెళ్దాంరా, బదరీ. క్రొత్తగా వ్రాసింది చూద్దువుగాని, మా కమల నాట్యకళానైపుణ్యం నన్ను ఉత్తేజితుణ్ని చేసింది."

వాళ్ళిద్దరూ లైబ్రరీగావున్న గదికి వెళ్లారు. కమల వంటగదిలోకి వెళ్ళి, తల్లితోను, అక్కతోను కలిసింది.

రామగుప్తుడు క్రొత్తగా వ్రాసిన కాగితాలను బదరీ నారాయణ కందించాడు. అదంతా నాట్యాన్నిగురించే. బదరీనారాయణ చదివాడు.

చిత్రలేఖనము, శిల్పకళ యివి నాట్యకళలో భాగాలు. నాట్యముకూడా ఒక శిల్పమే. కదలికలో శిల్పము, చిత్తరువు వైభవము స్పష్టమౌతుంది. నాట్యంయొక్క ప్రధానోద్దేశ్యము జీవిత గమనాన్ని స్పష్టీకరించే సంపుటిగా ప్రతిబింబించడమే.

"కమల మిమ్మల్నెలా ఉత్తేజితుణ్ని చేసింది?"

"ఆమె నాట్యంచేస్తోంది. ఆ నాట్యభంగిమలు, ఆ కదలికలు నన్ను ఆలోచనాసముద్రంలో ముంచాయి. ఈసృష్టి చేసింది- శివుడని నీకు తెలుసా, బదరీ? ఈలోకంలో ఎన్నెన్నో నాట్యాలు, ఎన్నో చిత్రవిచిత్రాలు చేసిసృష్టిచేసిందెవరో స్పష్టపరచడంలో, ఆయనే తన నాట్యంద్వారా తానే సృష్టి కర్తనని చెప్పి, మంత్రముగ్ధుల్ని చేయగలడు. ఈ నాట్య కళలో అంత గొప్పతనముంది."

"అయితే కమలకుమారిని, నేను చూడాలి, నాట్యం చెయ్యమని అడగవచ్చునా?"

"నాట్యం చెయ్యడమంటే దానికెంతో సరదా, అడుగుదాం. నాట్యం చేస్తుంటే చూస్తూ వుండటం, నాకూ యిష్టమే." అన్నాడు రామగుప్తుడు.

రామగుప్తుడు బదరీనారాయణను అక్కడే వదిలేసి, బయటకు వెళ్లాడు. కొన్ని నిముషాల్లో మళ్ళీ తిరిగొచ్చాడు.

"చేస్తుంది - సృష్టి రహస్యం తెలియపర్చే నాట్యం. హాల్లోకి వెడదాం.

## 19

కమల నాట్యం చేస్తోంది. గిరగిరా బొంగరంలా తిరిగి పోతోంది. అది శివతాండవ నృత్యం. ప్రత్యేకమైన అలంక రణలతో సగభాగం కనుల పండువగానూ, రెండో సగభాగము భయకంపితుల్ని చేసే విధంగానూ అలంకృతమైవుంది. అక్షరాలా శివుడే అన్నట్లు, ఆ జుట్టు విరబోసికొని, ఆ దుస్తుల ధారణ, ఆ కోపోద్దీతమైన ఆ చూపులు పర్వతాగ్రాలనుండి దిగివస్తున్న పిచ్చిమనిషిలా వుంది. కమల రూపురేఖల భంగిమ ప్రేమకుమారి డమరకి వాయిస్తూ వచ్చింది.

కథ ప్రారభమైంది. ప్రారంభంలో మంత్రోచ్చారణ. ఇది ప్రారంభము కాగానే శివుడు నడుస్తుంటాడు అప్పుడొక వింతభావం ఆయనలో మూర్తీభవిస్తుంది. అతని నడకలో, ఏదో గంభీరమైన ప్రేమోద్రేకం పొంగి పొర్లువారుతున్నట్లు స్పష్టమవుతుంది. తనేం జేస్తున్నాడో తనకే తెలియని స్థితిలో వున్నాడు. జీవిత స్థాయిలను ప్రతిబింబించే కాశ్మీర్ నృత్యం చేస్తున్నాడు. అది శివసృష్టి! జనన కారణము, సృష్టి రహస్యం, క్రొత్త జీవితము, పొంది కలరూపాల సృష్టించేసే నృత్యము. తరువాత "స్థితి" భంగిమ ప్రదర్శనము. సృష్టిం చినదాన్ని నాలుగు కాలాలపాటు మనగల్గేట్లు చేయాలనే తాపత్రయము, దానికి బ్రతుకు ప్రసాదించాలని, దానికి

కదలికను చేకూర్చాలని, చిరస్థాయి ఏలాచేయాలనే సంకల్పం ద్యోతకమవుతుంది. తరువాత "సంహారము": బాగులేనిదాన్ని వినాశనం చేసి వెయ్యటము, కంటికి ఇంపుకానిదాన్ని, జుగుప్స కలిగించేదాన్నంతనూ పూర్తిగా సర్వనాశనం చేసెయ్యాలనే భీకరరూపం వహించుట... ఇలా వివిధ భంగిమల్ని ప్రదర్శించే నాట్యంచేసి; శివుడు తిరిగి కైలాసానికి వెళ్ళిపోయాడు. కైలాసగిరి హిమాలయ పర్వతాల మాటున వున్నట్లుంది. అక్కడ కూర్చుని మళ్ళీ ఆలోచించసాగాడు!

బదరీనారాయణ నృత్యాన్ని చూచాడు. నృత్యం చూస్తూన్నంతసేపూ అతని కళ్ళల్లో ఆశారేఖలు, తృష్ణ, పుంజీభవించాయి. జీవితసృష్టి, దాని స్థితిగతులు, దాని వినాశనము - ఇవన్నీ అతనిలో మరింత ఉత్సుకత రేపి, శ్రద్ధాశక్తుల్ని మరింత పెంపొందింపజేసినవి.

రామగుప్తుడుకూడా నృత్యాం చూస్తూనే వున్నాడు. అతని కళ్ళు ఏవో ఆలోచనల్లో పొర్లాడుతూ వున్నవి. ఇతరుల కేదో నూతనానందం కలిగింది. ఆత్మ ప్రబోధం చేసినట్లుగా నృత్యం భావన కలిగించింది.

అంతలో "నాగదికి వెళ్తాను," అన్నాడు రామగుప్తుడు. అతనిలో రేకెత్తిన భావపరంపర అతన్ని తొందర పెడుతున్నట్లుంది.

"నేను వ్రాసుకోవాలి"

రామగుప్తుడు లేచి హాల్లోనుండి వెళ్ళిపోయాడు. అతని భార్య బదరీనారాయణ ముఖంలోకి చూస్తూ వుండల్లా,

రామగుప్తుని మాటలతో యీ లోకంలో కొచ్చింది. "ఓ, మరచిపోయాను, నామతిమండా. కూర మాడిపోతోంది." అని ఆమె గదిలోనుండి గబగబ వెళ్ళిపోయింది.

బదరీనారాయణ కమలవంక చూచి, చిన్నగా నవ్వాడు.

"నీ నృత్యం కల్గించినంత ఆనందాన్ని. మీ చిత్రకళ కూడా యివ్వదు."

"ఒకరోజున మా నాట్యాన్ని మించిన ఆనందము కలిగించే చిత్తరువు గీస్తారు. మీరు చూడండి."

"ఆ రోజుకోసం నిరీక్షిద్దాం. బహుశా ఆరోజు రాక ముందే చనిపోతామేమో."

"ఆమాట అనకండి."

బదరీనారాయణ మరేం చెప్పలేదు. కమలకన్న ముందుగా అతడు నిర్ఘాంతపోయి చూస్తున్నాడు. అతనివైఖరి గమనించిన కమల అతడు చూచిన దృశ్యమే చూచింది—

ప్రేమ స్త్రీగా అలంకరించుకొని వచ్చింది. ఆహా! ఎంత అందంగావుంది ఆమె శిరోజాలు, నల్లగా, పాముల్లా వంపులు తిరిగి, ఎంతో ఆకర్షణీయంగా వున్నాయి. ఆమె కోమలశరీరము. ఆకీవి, ఆలావణ్యము. - అవన్నీ చూచి ఒక్కసారి సంతోషంతో పొంగిపోయి పరవశమైపోయినట్లు భావించాడు బదరీ.

కమల తన అక్కవంక ఒక్కక్షణం చూచింది.

"నేనూ దుస్తులు మార్చుకొస్తాను" అని కమల వెళ్ళి పోయింది. కాని బదరీనారాయణ కమల చెప్పిన మాటల్ని ఆలకించలేదు. ఆమె వెళ్ళిపోయిందని కూడా గమనించనే లేదు. ప్రేమను ఆపాదమస్తకము పరిశీలనగా చూడటం లోనే మునిగిపోయాడు. ఆమెదగ్గరకు వెళ్లి, బుజాలమీద చేతులువేసి పట్టుకున్నాడు.

"తీసుకోండి... నేనువిూదాన్నేగా ... ఎలావున్నాను?"

అతను ఆమె కళ్ళల్లోకి చూశాడు ప్రశాంతమైనకళ్ళు చిలిపిగా తళతళా మెరుస్తున్నాయి.

"ఎందుకింత అందంగా వున్నావు?" అని అడిగాడు బదరీ ఆమెను.

"నీ హృదయ పీఠాన్నధివసించి, ప్రేమనై పుష్పించాను గనుక" అందామె అప్పుడతను ఆమెను తన బాహు ద్వయంతో బంధించి, గట్టిగా ముద్దు పెట్టుకున్నాడు.

# 20

నక్షత్రాల గురించి ప్రభుఘోష్‌కు చాలా లోతుగా తెలుసు. చిన్న కుర్రాడు క్రొత్తబొంగరం పట్ల ఎంతో ఉత్సాహాన్ని ప్రదర్శించి, దాన్ని విడిచిపెట్టకుండా ఎంత హుషారుగా ఆడుకుంటాడో, ప్రభుఘోష్ కూడా నక్షత్రాల విషయంలో అంతే! అజంతాకు తన తటతానుగా రావాలను కొని వచ్చినవాడు కాదు. కాని పరిస్థితులవల్ల రాక తప్ప లేదు. అతను వెళ్ళగలిగినచోటు మరొకటుంటే కనిపించలేదు. ఇంకెక్కడకూ వెళ్ళలేకపోయాడు. కాని యిక్కడకు రాగలిగి నందుకు సంతోషంగానే వున్నాడు. తనపని చేసికోటానికి కావలసినంత వ్యవధి వుంటోంది. నక్షత్రాలగురించి ఎంత గానో పరిశోధనచేసి, అనేకస ఘటనలను గురించి జోస్యం చెప్పాడు. అందువల్ల తోటి భిక్షువుల్లో ఆయనంటే ఎనలేని గౌరవం. ఆయన్ను అప్పుడప్పుడు సన్మానించేవారు కూడా.

ఒకరోజు వుదయం ప్రభుఘోష్ ఆచార్య విజ్ఞానందుల వారిని కలుసుకున్నాడు.

"ఇప్పటిలగాయతు పదిరోజులుంది, పది శతాబ్దాల క్రితం జన్మించిన తథాగతులవారి జన్మదినం. నక్షత్రాలను పరిశీలించి, మనకున్న కొద్ది ఆధారాలను పరిశోధించి, లెక్క గట్టి తెలుసుకున్నాను.

ఆచార్య విజ్ఞానంద్‌గారికి యీ వార్త విన్నంతనే పట్టరాని సంతోషమయింది. ప్రభుఘోష్ చూపించిన లెక్కల్ని చూచి, చదివాడు. అదే ఖచ్చితమైన రోజు అయివుంటుందనిపించింది ఆయనకూడా.

"చాలా సంతోషం, ప్రభుఘోష్. ఆరోజు చక్కగా వుత్సవం చేద్దాం. దానినే బుద్ధజయంతి దినోత్సవమని పిలుద్దాం."

ప్రభుఘోష్ వెళ్ళిపోయాడు. చైత్యారామానికి ప్రార్థనలు చేసేటందుకు ఆచార్య విజ్ఞానంద్‌గారు వెళ్ళినపుడు ఆ బుద్ధజయంతిని వైభవంగా చేయడమెట్లాగా అని ఆలోచించాడు. భిక్షువులనడిగి వారి అభిప్రాయాల్ని విందామనుకొని నిశ్చయించుకొన్నాడు. ప్రార్థన అయిపోయిన తరువాత వాళ్ళతో యిలా అన్నాడు.

"బుద్ధజయంతి దినోత్సవము యింకా పదిరోజులుంది. పది శతాబ్దాలక్రితం ఆ మహాపురుషుడు జన్మించాడు. ఆయన జన్మించిన దినం-మనకు పర్వదినం. ఆరోజు నేత్రోత్సవంగా, ఆనందసంధాయిగా చేసుకుందాం. ఏమంటారు?"

అందరూ ఒకరితో ఒకరు గుసగుసలాడారు. ఒకరితో ఒకరు సంప్రదించుకున్నారు. చర్చించారు. ఎవరికి తోచినట్లు వాళ్ళూహించారు.

"ఆ మహాపురుషుని గురించి ఒక నాటకము వేద్దాము" అన్నాడొక భిక్షువు.

"ఎవరు వ్రాస్తారు?" ప్రశ్నించాడు ఆచార్యుడు.

"మహాకవి దేవపాల్ గారు" అన్నది ప్రేమకుమారి.

ఆచార్య విజ్ఞానంద్, అక్కడ గుమిగూడిన భిక్షువులందరి ముఖాలవంక చూచాడు.

"దేవపాల్, నీకంగీకారమేనా?" అన్నాడు దేవపాల్ను పిలిచి. దేవపాల్ ముందుకొచ్చి, చేతులు కట్టుకొని నిలుచుని, విధేయుడై నమస్కరించి. "అలాగే వ్రాస్తానండి" అన్నాడు.

"సరే అయితే వ్రాయండి. అందులో పాత్రధారణకు తగిన వ్యక్తుల్ని ఏరుకోండి - ఇంకేమైనా వుందా?"

"కొన్ని నాట్యాలుంటే బాగుంటుందండి" బదరీనారాయణ అన్నాడు.

"ఎవరు చేస్తారు నాట్యం?"

"కమలకుమారి చేస్తుంది. ఇక్కడకు దగ్గరే ఒక తోటలో వుంటోంది."

"సరే అయితే."

"పురుషులమధ్య, ఒకస్త్రీ ఉండటం..." అంటూ వెంకన్న అభ్యంతరం లేవదీశాడు.

"మనం మానవ మాత్రులమే. ఈ భూదేవి వొడిలో మనగల్గుతున్నాము. కమలకుమారి చేసే నృత్యాలు మనల్ని ఇంద్రియ సుఖలాలసుల్ని చెయ్యవు మనల్ని భావోద్దీపితుల్ని చేస్తాయి. కమలకుమారిని నే నెరుగుదును" అన్నాడు ఆచార్య విజ్ఞానంద్.

"ఇరుగు పొరుగు గ్రామాల ప్రజల్నికూడా ఆహ్వాని ద్దామా ?" అన్నాడొక భిక్షువు.

"ఆహ్వానిద్దాము. ప్రజలకు నాటకాలద్వారా, నాట్యాలద్వారా బోధించటం మంచి విషయమే అవును, తప్పకుండా ఆహ్వానిద్దాము ఆంజనేయా, నువ్వా విషయం చూడు. వేరువేరు గ్రామాలవారికి యీ విషయా లందజే యండి." ఆంజనేయుడు లేచి, చేతులు కట్టుకొని నిలబడి తన అంగీకారాన్ని తెలియపరిచాడు. అక్కడ వున్నవారందరి లోనూ ఆంజనేయుడే మంచి అందమైనవాడు. భిక్షువైన ప్పటికీ అతని ఆలోచనలు చాలా స్థిరమైనవి. రాముడు పుత్రుని మాదిరిగా బాగా పొడవుగా వుంటాడు, అందమైన విగ్ర హము. అతని దేహం చక్కగా తైలచిత్రాల్లోని మనుష్యుల దేహాలున్నట్లు పొందికగా వుంటుందని బదరీనారాయణ అప్పుడప్పుడూ అనడంకద్దు. పరిసరాలందున్న గ్రామాలు, పట్టణాలు వెళ్ళి, బోధించి వస్తూవుండడంవల్ల అజంతాలో అతను చేసింది చాలా తక్కువ. కాని బోధిసత్త్వుని కథల గూర్చి మహత్తరంగా చెప్తాడు. అతని చమత్కృతీ, అదీ చూస్తే, పుట్టుకతోనే కథకుడిగా పుట్టాడా అనిపిస్తుంది. కాని ఎక్కడకు వెళ్ళినా, అజంతాకు మాత్రం తిరిగి వచ్చేస్తాడు. "ఇక్కడ నాకు హాయిగా వుంటుంది" అని అంటుంటాడు.

అప్పుడు భిక్షువుల సమూహం ఎవరి పనిమీదవారు వెళ్ళిపోయారు.

# 21

"బదరీ, అలా షికారుకెళ్దాం, వస్తావా? నేను రామ గుప్తుని యింటికి వెళ్తున్నా" అని ఆచార్య విజ్ఞానంద్, సమావేశానంతరం ఎవరిదారినవారు వెళ్ళిపోతుంటే అడిగాడు.

"వస్తానండి"

"నాకు తోడులేనిదే వొంటరిగా వెళ్ళబుద్ధికాదు. అందువల్ల అడుగుతున్నాను."

ఇద్దరూ కలసివెళ్తూ, ఎన్నో విషయాలగురించి మాట్లాడుకున్నారు. అజంతాకు రాకముందు ఎక్కడ వుండేవాడవని ఆచార్య విజ్ఞానంద్ బదరీనారాయణుని ప్రశ్నించాడు.

"నేను కుధిరావర్తంలో జన్మించాను. చదువుకోటానికి ఉజ్జయినికి వెళ్లాను. అక్కడొక్కచోటే గాకుండా, నలందా, విక్రమశిల, వలభినగరాల్లోకూడా విద్య నభ్యసించాను.

"విక్రమశిలలో ఎంతకాలం వున్నావు?"

"ఆరు మాసాలున్నా."

యిప్పుడెట్లావుందో తెలీదు "ఆవిశ్వవిద్యాలయం యిప్పుడెట్లావుంది? కాని నేనక్కడవుండగా రోజురోజుకూ నైతికంగా దిగజారిపోతోందని విన్నాను. అక్కడ ఒక్కటే త్రాగుడూ, వ్యభిచారం, ... స్వయంగా నాకళ్ళతో చూచాను."

"అది ఘోరపతనం పొందక తప్పదు. అక్కడ విద్యా భ్యాసానికి తావుండదేమోనని నా అనుమానం."

"మీరక్కడ చదివారా గురుదేవా?" అని ప్రశ్నిస్తూ బదరీనారాయణ విజ్ఞానంద్ వంక వింతగా చూశాడు. ఆచార్యులవారి కళ్లు నిశ్చలంగా వున్నాయి. ఆయన పెదవులపై చిఱునవ్వు తొణికిసలాడింది.

"అవును. అక్కడ చదివాను. అక్కడ చదవటం వల్లనే అజంతాకు రావలసివచ్చింది." అన్నాడు ఆచార్య విజ్ఞానంద్.

"ఎందుచేత?"

"అదొక పెద్దకథ."

"ఏమిటది? - చెప్పండి. ఇక్కడే కొంచెంసేపు కూర్చుందాం."

ఆచార్య విజ్ఞానంద్ ఒక చిన్న రాయిమీద కూర్చుంటూ, బరువుగా నిట్టూర్పు విడచాడు. బదరీనారాయణ నేలమీద చతికిలబడి కాళ్ళారజాపి కూర్చున్నాడు.

... ... ...

"నేనొక బ్రాహ్మణ కుటుంబంలో జన్మించాను. నా పేరు విజ్ఞగోత్రుడు. పొడవుగా, పుష్టిగా, చూపరులకు భయంగొల్పే తత్వంతో వుండేవాణ్ణి. చిన్నతనంలోనే వేదాలు ఉపనిషత్తులూ అభ్యసించాను. అనర్గళంగా ఉపన్యసించడంలోగాని, వాదన చేయడంలోగాని నాకెవ్వరూ సాటిరాలేదు. నన్నుజూచి మా నాన్నగారెంతో గర్వపడేవారు. ఉపాధ్యాయులు సైతం తమ తప్పులెక్కడ చూపుతానోనని

భయపడుతూ వుండేవారు. వాళ్ళ తప్పొప్పుల్ని నిర్భయంగా ఖండిస్తూ వుండేవాణ్ణి.

నాకు యిరవై రెండో యేడు వచ్చింది. మా నాన్నగారు నన్ను పెళ్ళిచేసికోమని అడిగారు.

"నాకిప్పుడు వివాహ మక్కర్లేదు. కాముక వాంఛ పట్ల నాకు మోజులేదు నాన్నగారూ... స్త్రీలంటే నాకిష్టం లేదు. కాని విజ్ఞానం సంపాదించుకోవాలనే తృష్ణ నాలో ఎక్కువగా వుంది. కనుక నేను విజ్ఞానార్జనకై ప్రయత్నిస్తాను. అందుకై తగిన మార్గాలు వెదుక్కుంటాను."

"ఎట్లా?"

"నేను వెళ్ళిపోతున్నాను నాకు కావలసిన విజ్ఞానం బోధిస్తారన్న విశ్వవిద్యాలయానికి వెళ్తాను. నాకు సంతృప్తి కాని పక్షంలో తిరిగి వచ్చేస్తాను."

"ఏ విశ్వవిద్యాలయానికీ - వెళ్ళేది"?

"విక్రమశీల."

"నువ్వు చాలా తెలివితక్కువవాడవురా. విశ్వవిద్యాలయాని కెందుకు వెళ్ళటం? నీకు నీవే ఒక విశ్వవిద్యాలయం. శృతిమించి నేర్చుకోవడంకూడా తప్పిదమే అవుతుంది. అది నీ జీవితాన్ని చిన్నాభిన్నం చేస్తుంది" "కాని నా మనస్సు తపిస్తోంది నాన్నగారూ. మేధాసంపత్తిని అలవరచుకోవాలనీ, విజ్ఞాన వికాసాన్ని కలగజేసుకోవాలని పదవళ్లు త్రొక్కుతోంది. నేనొక వదిని నన్ను అడ్డగించకండి. నాలో పొర్లు

నాకే తృష్ణను పొంగిపోనివ్వండి. నా దారిన నన్ను వెళ్ళని వ్వండి, నాన్నగారూ."

ఇలా అర్థించేసరికి మా నాన్నగారిక నన్ను అటకాయించలేరు. నా యిష్టానికి నన్ను వదిలేశారు. నేను విక్రమశీల విశ్వవిద్యాలయానికి వెళ్లాను.

"యువ్వనోత్సాహము, తెలివితేటలు, నా సుగుణ సంపద - యివి మూడూ నేను బాగా అభివృద్ధి చెందటానికి దోహదమిచ్చాయి. అదొక గొప్ప విశ్వవిద్యాలయం. అధ్యాపకుల అభిరుచుల కనుగుణ్యంగా ప్రవర్తిస్తూ, వేదాంతగోష్ఠిలోనూ, మతానికి సంబంధించిన చర్చల్లోనూ వారితో పాల్గొంటూండేవాణ్ని. అది కేవలం వాదన కొక్కదానికే వేదిక కాదు. ఎంతో లోతుగా చర్చించి సారాంశాన్ని చెఱకు రసం గ్రోలినట్లు అనుభవించేవాళ్ళం. వాళ్ళందరిలోనూ ఏదో నూతన వికాసము, అనుభవైక సామర్థ్యమూ అనుకూలనమూ గోచరించేది. అయినప్పటికీ వాదనలో వాళ్ళకేమీ లొంగే వాణ్నికాదు. అలాఅని ఒక్కదానిలోనూ నేను ఘటికుణ్ణని తేల్చుకోలేకపోయాను. అయినా ఆ వాదనలో ఎన్నో భావాలు గ్రహించేవాణ్ణి. నేను మాట్లాడుతూంటే తోటి విద్యార్థులంతా భయపడేవాళ్ళు. నేనింత తీవ్రంగా వాదించినప్పటికీ అధ్యాపకు లెవ్వరికీ కోపం వచ్చేది కాదు. వాళ్లంతా తమ తెలివితేటలకు యిదొక వ్యాయామంగా తలంచేవారు. వాళ్ళ యాభై యేళ్ళ జీవితంలో నాలాంటి వ్యక్తి వాళ్ళ కెప్పుడూ తారసపడలేదు.

అంతేయిదిగా నేను వాదప్రతివాదాల్లో భావసంఘర్షణాల్లో పాల్గొంటున్నా, అందరూ సన్మానంతో గౌరవంగా చూచేవారు నేనూ వాళ్ళనెప్పుడూ తిట్టలేదు. తక్కువగా భావించలేదు. ఆ విశ్వవిద్యాలయ పద్ధతులన్నీ జాగ్రత్తగా పరిశీలిస్తూ, వ్యసనాల జోలికి పోకుండా నా పనేదో నేను చేసుకుంటూ కాలం గడిపేవాణ్ని.

"ఇదంతా నీకు విసుగు కలిగిస్తోందా బదరీ?"

"మీరు చెప్పినంత గర్వంగా యిదివరలో వుండేవారంటే నమ్మశక్యం గాకుండా వుంది. మీరు చెప్తున్నా అలాంటి మనిషి యిప్పుడిలా మారిపోయారన్నా నమ్మడం కష్టమే!"

"అదే - ఎందుచేత ఇలామారిపోయానో వివరిస్తాను."

"విక్రమశీల నలందాకు చాలా దగ్గరేనని నీకు తెలుసుగా. అక్కడ బుద్ధుని ఉపదేశాలు తరచు వినిపిస్తుంటాయి. అయినా విక్రమశీలయొక్క ప్రాభవం రోజురోజుకూ తగ్గిపోతూ వుంది."

అక్కడ గుహ్యసమాజమనే గ్రంథమొకటి వుంది. బుద్ధుని ఉపదేశాల సంపుటే ఆ గ్రంథం. ఆ గ్రంథంలో బుద్ధుడొక పక్కా వ్యభిచారిగా వర్ణించబడ్డాడు. ఆయనెప్పుడూ దేవతలతో భావగాంభీర్యాన్నీ, సంతోషాన్నీ వాంఛిస్తూ వుండేవాడట. ఆ దేవతలకు త్రాగుడు, మాంసాహార భక్షణ వ్యభిచారవృత్తి మున్నగువాటితో సంబంధ ముండేదట. అలాగే మరికొన్ని పుస్తకాలున్నాయి. వాటిల్లో యిలాంటి వ్యసనలోలత్వానికి లోనైన జీవితంకూడా మంచిదేననీ,

అందరూ అనుసరించవచ్చుననే సిద్ధాంతంకూడా వున్నట్లు వివరించబడింది. అప్పుడొక సభ జరిగిందట. ఒక అధ్యాప కుడు చదువుతూ, సారాబుద్ధి ప్రక్కన పెట్టుకుని వున్నట్లు కనుగొనబడిందట. దానికి సంజాయిషీ అడిగితే తానొక వేశ్యను కలుసుకుంటూ వుండగా ఆమె యిస్తూ వుందని సమాధానం చెప్పాడట - ఆయన. దానిపై విశ్వవిద్యాలయ అధికారులు క్రమశిక్షణచర్య తీసుకోగా విశ్వవిద్యాలయ సభ్యులు రెండుగా చీలిపోయారట. ఆ కారణంతో యింకెన్నో కష్టా లెదుర్కోవలసివచ్చింది. ఇదంతా నాకు తెలిసింది. అయినా బౌద్ధమతంపట్ల నాకు విశ్వాసమే వుంది.

ఆ సమయంలో నాకు ఒక స్త్రీతో పరిచయ మేర్ప డింది. మంచి విద్యార్థుల్ని నగరంలో యధేచ్ఛగా తిరిగినా ఎవరూ యేమనేవారు కాదు. ఆ అవకాశాన్ని నేను పూర్తిగా వుపయోగించుకున్నాను. నాతో పరిచయంకల్గిన ఆ అమ్మాయి ఒక వేశ్య. చాలా అందంగా వుంటుంది ప్రాతఃకాలపు పిల్ల వాయువుల తాకిడి ఎంత హాయిగొల్పుతుందో, ఆమె అంత మృదువుగా మాట్లాడేది. వెన్నెలకాంతిలా ఆమె దేహచ్ఛాయ తెల్లగా వుండేది. ఆమె పేరు దీప్తి.

ఆమెను నేను ప్రేమించాను. అది మామూలు ప్రేమ కాదు. ప్రేమలో తహతహ లాడిపోయాను ... నా ప్రేమ గురించి ఎవ్వరికీ చెప్పకుండా రహస్యంగానే వుంచేసుకున్నాను నాలో నేను కుమిలిపోయేవాణ్ని.

ఇలా వుండగా, ఆమెదగ్గరకు వెళ్ళి, నా మనసులో భావం ఆమెకు చెప్పేయాలని నిర్ణయించుకున్నాను.

సహజంగా నేను దేనికీ జంకే ఘటాన్ని కాను. అయినా ఆమె యింటిదగ్గరకు వెళ్లేసరికి ఎకల్లాడినట్లు వణికిపోయాను. వెళ్ళి ఆమె యింటితలుపు తట్టాను. ఆమె తలుపుతీసి నన్ను లోపలకు తీసుకు వెళ్ళింది. లోపలకు వెళ్తూంటే ఏదో కలలో నడుస్తున్నానేమో ననిపించింది.

"ఆమె నావంక ప్రశ్నార్థకంగా చూచింది. ఏం చెప్పాలో నాకర్థం కాలేదు. ఆమెవంక చూచాను. ఆమెకై హృదయం కొట్టుకులాడింది. కాని భయం అవహింపచేసింది.

"ఏమైనా కావాలా?" అని ఆమె అడిగింది.

నేనలాగే నుంచునుండిపోయాను. కనీసం తలకూడా వూపలేదు. నా మౌనాన్ని ఆమె అర్థంచేసుకుని, అక్కడున్న యువతులనందర్నీ అవతలకు పంపించేసింది. ఇక మేమిద్దరమే అక్కడవున్నాం. ఆమె మళ్ళీ అడిగింది. ఆమెవంక చూచాను. ఏదో చెప్పాలని ప్రయత్నించాను. కాని మాట వెగిలి రాలేదు. దానికితోడు భయంకూడా వేసింది.

ఆమె నా చెయ్యిపుచ్చుకొని ఒక మంచందగ్గరకు తీసుకు వెళ్ళి నన్ను కూచోబెట్టింది. నా ప్రక్కనే ఆమె కూర్చుంది నేను భయంగా, కళ్ళల్లో కోపం నటిస్తూ ఆమెవంక చూశాను. ఆమె అదోలా చూసింది. నేనలా చూసినందుకు ఆమెకు కోపంరాలేదు. పైగా ఆమెముఖంలో ఏదో నూతన కాంతిద్యోతకమైంది అది నన్ను మంత్రముగ్ధుణ్ని చేసింది. గభాలున నేను లేచినిలబడి, "నేను వెళ్ళాలి" అని చెప్పాను. దానికి ఆమె సమాధానం రాకముందే నేను వెళ్లిపోయాను.

ఆ మరునాడు మళ్ళీ వెళ్ళాను. ఆ రాత్రంతా భయంతో పోరాడాను. రెండోరోజున - మొదటిరోజు భయపడినంతగా భయపడలేదు. బహుశా ఎవరూ అంతకన్న ధైర్యంగా వుండలేరేమో కూడా.

ఆమె చిన్నగా నవ్వింది ఆమెకళ్లు చిలిపిగాచూశాయి.

"ఈసారేం కావాలి!" ఆమె అడిగింది

"నిన్ను ప్రేమిస్తున్నాను!" అని మొండిధైర్యంతో చెప్పేశాను.

ఆమె నావంక ప్రశాంతంగా చూచింది. ఇలా యెందరో ఆమెతో చెప్పడం ఆమెకు బాగా తెలుసు. అందువల్ల నా మాటలు ఆమెకేమీ వింతగా తోచలేదు. కాని ఆమె ముఖంలోమాత్రం ఏదో తీక్ష్ణత గోచరించింది.

"ప్రేమిస్తున్నారా ?" ఆమె ప్రశ్నించింది.

"అవును, గాఢంగా ప్రేమిస్తున్నాను."

నా కళ్ళల్లో ముత్యాల్లా కన్నీటి బిందువులు మెరిశాయి. నాలో ఆ ప్రేమ ప్రభావం అలా వుప్పొంగింది. ఆ వుద్రిక్తత ఆపుకోలేకపోయాను.

"నేను నిన్ను యెంతో యిదిగా ప్రేమిస్తున్నాను." అని అన్నాను.

బహుశా నేనిలా చెప్పడంతో ఆమె కొంచెం చలించినట్లు కనిపించింది. ఆమె నా దగ్గరకొచ్చి యిలా అంది.

"నేను వేశ్యను. నన్ను ప్రేమించినందువల్ల ప్రయోజనంలేదు. నా ప్రేమను ఎవరికైనా, ఎందరికైనా అమ్ము

కుంటుంటాను. మీ భావాలపొంగు నాపై ప్రయోగించకండి."

"నీవు నీ దేహాన్ని మాత్రమే అమ్ముకుంటావు. ప్రేమను అమ్మలేవు. ప్రేమ కొనేందుకూ, అమ్ముకునేందుకూ లభ్యమయ్యే వస్తువుకాదు అది అజరామరమైన అనురాగం."

ఆమె నావంక చూచింది. తనకాలి బొటన వ్రేళ్ళపై నిలబడి నా పెదవుల్ని ముద్దు పెట్టుకుంది. నేనేం కదల్లేను. అలాగే నుంచున్నాను.

"మీరు నిజంగా నన్ను ప్రేమిస్తున్నారా?" ఆమె అడిగింది.

"అవును నీవు కోరితే నా జీవితాన్నయినా యిస్తాను."

"అయితే నన్ను మీ బాహుబంధనల్లోకి తీసుకోండి" అందామె.

ఇప్పుడు నా కాలాన్నెక్కువ దీప్తితోనే గడుపుతున్నాను. చర్చలన్నా వాదోపవాదాలన్నా యిప్పుడేనుంత పట్టించుకోవడంలేదు. నాకిప్పుడు ఒకేఒక జ్యోతివుంది. అదే దీప్తి. ఆమెను నా కళ్ళముందునుంచి ఎక్కడకూ వెళ్ళనిచ్చేవాణ్నికాను. ఆమెనే ఆరాధిస్తూ, ఆమెకే నా జీవితాన్నంకితం చేసేటంత గాఢంగా ఆమెను ప్రేమిస్తున్నాను.

ఆమెకూడా నన్ను ప్రేమించడంలో సఫలత చెందింది. రోజులు గడుస్తున్నకొద్దీ ఆమె నన్ను ప్రేమించటం నేర్చుకొంది. నేర్చుకుంటూనే, తన గత జీవితవిధానాన్ని పూర్తిగా మరచిపోయి, దీప్తి నా హృదయదీపిక అయిపోయింది. ఈ

సంగతి విద్యార్థి బృందానికి తెలిసింది. అందరూ ఆశ్చర్య పోయారు. దీన్నే అందరూ చర్చనీయాంశంగా తీసికున్నారు ఈ వార్త అధికారుల దృష్టికికూడా వెళ్ళింది. వాళ్లు నా చర్యను గర్హించారు; అంతేకాదు, నన్ను విశ్వవిద్యాలయా న్నుండి వెళ్ళగొట్టారు.

అయినా నేను విచారించలేను. దీప్తి ప్రేమలోనే ఆనందమూ, ఓదార్పూ, విశ్రాంతి - అన్నీ పొందాను.

"నేను కామేచ్ఛపట్ల విముఖుణ్ణని ఆమెతో వొకప్పుడు చెప్పాను. కానీ నేనుయిప్పుడు ఒక బిడ్డకు తండ్రిని కాబోతు న్నాను.

"ఇది నీకు ఆనందంకాదా దీప్తీ?" అని ప్రశ్నించా నామెను.

"నాకు చాలా సంతోషంగా వుంది" అని చిరునవ్వు చిలికిస్తూ పలికింది దీప్తి.

"కాని, నీలో నిరాశ రేగుతున్నట్లు, నువ్వు బాధ పడుతున్నట్లు అప్పుడప్పుడూ అనిపిస్తుంది. దేన్ని గురించి అలా బాధ పడటం!"

"ఏమీ లేదు విజ్ఞా! నాకు బాధేముంది?"

"నువ్వు అబద్ధమాడుతున్నావు నిజం చెప్పు. నాగురించి చింతించడంలేదూ? నాకు తెలుసు. నేను వెళ్ళిపోతానేమో ననుకుంటున్నావుగదూ? నన్ను వెళ్ళిపొమ్మంటావా?"

"ఆమాట యెలా అంటాననుకున్నారు? విచారం ముసురుకున్న మనసుతో అంది దీప్తి. "మీరు వెళ్లిపోతే

నేను చచ్చిపోతాను. మీరు లేకపోతే నేను క్షణంసేపు బ్రతకలేను. గుండె రాయి చేసుకోకండి. నన్నెప్పటికీ విడచిపెట్టకండి."

"లేదు దీప్తి ఎలా విడచిపెట్టాను? నీవే నా ఆత్మవు. నీవే నా సర్వస్వానివి. కాని, నిజంచెప్పవూ? ఎందుకలా బాధపడుతున్నావూ?"

చాలాసేపటివరకూ దీప్తి సమాధానం చెప్పలేదు. చివరికెలాగయితే చెప్పింది.

"మీ రెప్పుడూ వాదన చేస్తూనే వుంటారు. ఎప్పుడూ యేదో మాట్లాడుతూ వుంటారు. ఏ సందర్భంలోనూ, ఏ విషయాన్నిగురించీ సంతృప్తి చెందరు. ఎందుకని? ఎప్పుడు చూచినా ఏదో సతమతమవుతూ వుంటారు. విశ్రాంతనేది లేదు. అందుకే నేను బాధపడుతుంటాను. మీరంత బాధ పడటమెందుకా అనే నేను తీవ్రంగా ఆలోచిస్తుంటాను,"

"నువ్వు నన్నింత లోతుగా అడుగుతావనుకోలేదు దీప్తీ. నిజంమాట్లాడాలంటే నా హృదయానికి శాంతి లేనే లేదు. నీ ప్రేమవల్ల కొంతగాకపోతే కొంతయినా జోల పాడించుకోగల్గుతున్నానుగాని, నిజంగా నేనొక ఘోరసమరంలో పాల్గొంటున్నానేమో ననిపిస్తుంది. ప్రతి విషయంలోనూ, ప్రతివానిమీదా నేను కత్తులు ప్రయోగిస్తున్నాను."

నా భావాలను జీర్ణించుకునే ప్రయత్నంలో వుంది కాబోలు కొంచెంసేపు మౌనంగా వుండిపోయింది:

"నేనొకటి అడిగితే మీకు కోపం రాదుగదా!" అని నిశ్శబ్ద నిశీథిని చీల్చింది.

"రాదు. ఏమిటో చెప్పు?"

"మీరు బౌద్ధమత మెందుకవలంబించకూడదు?"

"ఎంత తెలివితక్కువగా మాట్లాడతావు దీప్తి? బౌద్ధ మతమా? హుంచూడు. బౌద్ధభిక్షువులంతా యెలా తప్ప త్రాగి, జూదాలాడుతూ, దుర్వ్యసనపరులయ్యారో! పైగా బుద్ధుడుకూడా అలాంటివాడేనని గ్రంధాలు వ్రాస్తున్నారు. నన్నుకూడా వాళ్ళమాదిరిగానే కావాలనే కాంక్షిస్తున్నావా? నేను ఆలోచనాపాటవం గలవాణ్ణి. నేనలాంటి తప్పిదం చేయను?"

"కాని బుద్ధుడు అలాంటివాడుకాడు. విజ్జూ! నువ్వు చదివిందంతా శుద్ధ తప్పు. ఆ గ్రంధాలన్నీ అబద్ధాల పుట్టలు. నీకు తారసపడినవాళ్ళంతా వొట్టి వ్యసనపరులు."

"మన అధ్యాపకులు సైతం కొందరు వాటిని విశ్వ సిస్తున్నారు. లాభంలేదు, దీప్తీ, బౌద్ధమతం యేదో గ్రుడ్డిగా పుట్టింది. దాన్ని అవలంబించడానికి ఒక దారితెన్నూ లేదు. నీతీ నిజాయితీ లంతకన్నా లేవు. అది తెలివితక్కువ దద్దమ్మచే కల్పించబడిన సిగ్గూ, యెగ్గూలేని సిద్ధాంతం!"

"విజ్జూ!" అని రౌద్రంగా కేకవేసి నా నోటిని తన చేత్తో గట్టిగా మూసింది.

"అలా తూలనాడకు. ఇంత చులకనగా, అర్ధరహితంగా యింకెప్పుడూ మాట్లాడకు భూమాత కడుపున అవతరించిన మహాపురుషుల్లో బుద్ధుడొకడు."

ఆమెపై చెప్పలేనంత కోపం వచ్చింది.

"అయితే నువ్వు బౌద్ధమతావలంబీకురాలివా?" అని అడిగాను.

"అవును, శాంతంగా సమాధాన మిచ్చింది.

"ఉహూం! కనుకనే నువ్విలా వేశ్యవయ్యావు. సిగ్గులేనిరకం - బౌద్ధమతస్థులంతా అంతే! చాలు. నాకు తగిన శాస్తి జరిగింది. నేను వెళ్ళిపోతున్నాను." అనిలేచి నుంచునేసరికి గభాలున ఆమె నాచెయ్యి గట్టిగా పట్టుకొంది. నన్ను రెండుచేతులూ పుచ్చుకొని కదలనీయలేదు. ఆమె ముఖంలోకి చూచేసరికి కళ్ళనిండా నీళ్ళు నింపుకొని వెక్కి-వెక్కి ఏడ్చేసింది. ఆమె స్థితిచూచి నేనూ నా తొందరపాటుకు విచారించాను.

"నువ్వు విన్నదంతా తప్పే విన్నా! సత్యాన్వేషణకై కృషి చేస్తున్నాననుకున్నావుగదా. ఇప్పుడు చెపుతున్న సత్యం వినిపించుకోవే!" అంటూ దీనంగా, బతిమాలుతున్నట్లు చెప్పింది.

ఆమె యిలా చెప్పడంతో నేను మళ్ళీ చతికిలబడ్డాను.

"సరే చెప్పు; ఏమిటి నీసత్యం?"

అప్పుడామె చెప్పింది - బుద్ధ చరిత్రంతా కొన్ని జాతక కథలు చెప్పింది బౌద్ధసిద్ధాంతం యెలా వ్యాప్తి చెందిందీ - అశోకుడు బౌద్ధమత మవలంబించిన తీరూ, చైనా యాత్రికుడు ఫాహియాను రాక - ఈ నాటికి బౌద్ధమతం ప్రపంచంలో సజీవంగా నిలచేట్లు చేసిన మహత్తర సత్యాలు ఇవన్నీ స్పష్టంగా అర్థమయ్యేట్లు విశదీకరించింది.

"బౌద్ధమతం చాలా సామాన్యమైనది విజ్ఞా. అది వాదనకు తావిస్తుంది; అంతే నీకు కావలసిందల్లా అర్థం చేసుకోగల శక్తీ, సత్యాన్ని విశ్వసించగల వివేకమూ... అవి వుండాలి. నేను వేశ్యగా వున్నందువల్ల నీకు ఆశ్చర్యం కలగవచ్చు. కాని నేనూ బ్రతకాలిగా. కేవలం ఆదర్శాలు వల్లించినంత మాత్రంచేతనే బ్రతకలేం వేశ్యగా బ్రతకడం తప్పుకాదని నా అభిప్రాయం. అదొక జీవనమార్గం."

ఇక నేనేం సమాధానం చెప్పలేదు. ఆమె చెప్పదలుచుకొచ్చిందాన్ని గురించే ఆలోచించాను.........

తరువాత ఏమైనా బౌద్ధమత గ్రంధాలు దొరుకుతాయేమోనని ప్రయత్నిస్తూ వచ్చాను. దొరికినవన్నీ చదివాను. అయినా సంతృప్తి చెందలేకపోయాను నలందాకు వెళ్ళాను. అక్కడ అధ్యాపకులంతా నాకెంతో తోడ్పడ్డారు. నేను బౌద్ధమతస్థుణ్ని కావడానికెంతో కాలం పట్టలేదు.

అది నాకొక జ్యోతిగా తోచింది. బౌద్ధమతాన్ని గురించి సత్యాసత్యాలు గ్రహించగలిగినందుకు పరమానంద భరితుణ్ణయ్యాను. కాని నా సహచరులకది అగమ్యగోచరంగా తోచింది. అయినా నేనెవర్నీ లక్ష్యపెట్టలేను. అదివరకెన్నడూ ఎరగని శాంతి నాకు చేకూరింది నా మనస్సుకు ప్రశాంతత లభించింది. అది తలచుకొని అప్పుడప్పుడూ నేనే ఆశ్చర్యపోయేవాణ్ని. అలా నేను చాలా హాయిగా వుంటున్నాను.

కాని దీప్తి మరణించింది. కారణం శిశువును కనడంలో ప్రమాదానికి లోనయింది ఆమెతోపాటు శిశువుకూడా

చనిపోవడం జరిగింది. వాళ్ళను సమాధిచేశాను. ఆ విశ్వవిద్యాలయం వదిలేశాను. గమ్యంలేని తిరుగుడు తిరిగాను. అయినా నా హృదయానికి యీ షణ్మాత్రమైనా చీకూ చింతా లేదు. చాలా ప్రశాంతంగా గడిపాను. అప్పుడు అజంతానుగురించి విని యిక్కడకొచ్చాను. ఇది నాకు ఆదర్శవంతమైన స్థలం. సంవత్సరాల తరబడి వుంటున్నాను. ఎక్కడా పొందలేని ఆనందాన్నీ, ఎక్కడా శక్యంకాని శాంతినీ పొందగల్గుతున్నాను. ఇప్పుడు నన్నేవీ చెదరగొట్టలేవు. నా ప్రశాంత జీవితాన్నెవరూ ఛిన్నాభిన్నం చెయ్యలేరు."

"బదరీ-ఇదీ నా కథ! నువ్వు చాలా చిన్నవాడవు. కాలం నిన్నుగూడా నావంటిస్థితికే తీసుకొస్తుందేమో ఎవరు చెప్పగలరు? నాకన్నా ఉన్నతస్థాయికికూడా గొంపోవచ్చు."

ఇదంతా బదరీనారాయణ మౌనంగా వుండివిన్నాడు. ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. అప్పుడు పెద్ద నిట్టూర్పు విడుస్తూ, లేచినుంచొని యిలా అన్నాడు.

"నాకు మీ గాథంతా చెప్పినందుకు కృతజ్ఞుణ్ని", గురుదేవా!

"గతస్మృతులూ, పాత సంఘటనలన్నీ అడుగున పడిపోయే కాలమొస్తుంది. సిగ్గనీ, బాధనీ - ఇలాంటివేమీ మనముందు తలెత్తుకొని నిలబడవు. నీవు వీటన్నిటికి అతీతంగా సాగిపోతావు. నిన్న, నేడు, రేపులన్నీ ఒకటిగానే తోస్తాయి. అప్పుడు కాలమే ప్రత్యేక పరిధిగా భావించ గల్గుతావు."

"అంతరంగంలో ప్రశాంతత సాధించింది కాలమేనా? సంగీత స్వరమై మీలో ఆహ్లాదం కలిగించే శాంతిని ప్రసాదించింది కాలమేనా గురుదేవా?"

"అవును" అని సమాధానం చెప్తూ ఆచార్య విజ్ఞానంద్ లేచినుంచున్నాడు.

"రామగుప్తుడు వ్రాసిన గ్రంథం చదువుతున్నావు కదా, మంచిదే చదువు. రామగుప్తుడు చాలా లోతుగా ఆలోచించే మనిషే! సత్యాన్వేషణ అతని గ్రంథంలో చాలా హృద్యంగమంగా చిత్రించబడుతోంది వెళ్దాం, రా... ఇప్పటికే చాలా ఆలస్యమయ్యింది."

ఇద్దరూ కలసి వెళ్తూవుండగా, దారిలో విజ్ఞానంద్ యిలా చెప్పాడు. "నేను శాంతంగా వుండటం సాధ్యమయ్యాక నా పేరులో "శ్రోతకు" బదులుగా ఆనంద్ అని మార్చుకున్నాను. ఇలావుంటే బాగుంటుందనుకున్నాను."

"అవును. మీ పేరు చాలా బాగుంది" అని బదరీనారాయణ తన సంతృప్తిని వెల్లడించాడు."

# 22

రిహార్సల్సు జోరుగా సాగుతున్నాయి. ప్రతిభిక్షువూ ఏదో ఒకరకమైన పాత్రను - అది పెద్దది, చిన్నది అనే మీమాంసకు తావులేకుండా. అభినయించేందుకు సిద్ధపడ్డారు. బుద్ధునిపాత్ర ఆంజనేయుడువేస్తున్నాడు. అతడు గొప్ప నటుడు. అతని జీవితమంతా మహాపురుషులుగానో, దేవుళ్లు గానో పాత్ర ధరించి వారివారి మహిమల్నిగానీ, వారి మహోన్నత శక్తిప్రభావాలనుగానీ, మానవత్వ బలహీనతల్నిగానీ చాలా గొప్పగా ప్రదర్శించేవాడు. 'రాముడు'గా 'కృష్ణుడు'-గా నటించాడు. భక్తప్రహ్లాద నాటకం వేసినప్పుడు అందులో నరసింహావతార పాత్ర ధరించాడు. ఆ పాత్రధారణే - అతన్ని నాటక రంగాన్ని సంపూర్ణంగా విడచిపెట్టేసి, అజంతాకు వచ్చేసేటట్లు చేసింది.

అది సింహపురిలో తటస్థించింది: అదొక పెద్ద నగరం. ఎప్పుడు నాటకాలు ప్రదర్శించినా అందులో ఆంజనేయుడు పాత్ర ధరిస్తున్నాడంటే, జనం తండోప తండాలుగా వచ్చేవారు. డబ్బు కనకవర్షం కురిసేది

అతని నటన యెంతో సహజంగా, ప్రేక్షకుల హృదయ ఫలకంపై చెరగని ముద్ర వేసేది. అతడు నడుస్తున్న, ఒక తావునుండి మరోతావుకు వెడుతున్న - అతడే శ్రీరాముడనీ,

అతడే శ్రీకృష్ణుడనీ, ప్రజలు అతన్ని వెంబడించి 'రామా! రామా!' యని, 'కృష్ణా! కృష్ణా!' అని అతని కాళ్ళమీద పడి మ్రొక్కేటంత తన్మయుల్ని చేసే నటనా నైపుణ్యం అతనిలోవుంది. ఆ ప్రభావమే అతనికి చాలా చిక్కు తెచ్చి పెట్టింది కూడా.

ఒకరికి అపకారం చేస్తేనే ప్రత్యపకారం జరుగుతుందనుకోరాదు. కొన్ని సందర్భాల్లో ఉపకారం చేసినందువల్ల కూడా అపకారం జరుగుతూ వుంటుంది. అట్లాగే ఒకరిలో మూర్తీభవించిన ప్రతిభా ప్రభావాలుకూడా ఒక్కొక్కప్పుడు బెడసికొట్టి ఎనలేని అపకారం కలిగిస్తాయి!

ఆంజనేయుడు అక్కగారైన తులసి తన స్నేహితురాలైన కామాక్షిని యింటికి తీసికొచ్చింది. కామాక్షి అప్సరసలా వుంటుంది. ఆ చక్కని చుక్కను చూశాడో లేదో, ఆంజనేయుడు ప్రథమ వీక్షణంలోనే ఆమెను ప్రేమించేశాడు. కామాక్షికూడా అంతే. తొలి చూపులోనే అతన్ని వలచింది. తన హృదయాన్ని అతనికే అంకితం చేసింది. ఇద్దరూ ఆ యింట్లోనే రహస్యంగా సమావేశం కాజొచ్చారు. ఒకరిపై ఒకరికి ఎనలేని ప్రేమాయె మరి!

కాని తులసిమాత్రం సామాన్యురాలా! ఈ రహస్యం వెంటనే పసిగట్టేసింది. తులసికీ చరసంగంపట్ల సానుభూతి లేదు. కామాక్షి తల్లిదండ్రుల్లేని పిల్ల. కొండపల్లిలో తన భర్తగారింటికని వెళ్ళినప్పుడు తులసికీ, కామాక్షికీ పరిచయం ఏర్పడి, అది గాఢస్నేహంగా పరిణవిల్లింది. పెంచుకున్న తల్లిదండ్రుల అనుమతిపొంది, తులసితోపాటు సింహపురిలో తన

భర్తగారింటికి కామాక్షివచ్చింది. ఆంజనేయుడు తన నాటక బృందంతోసహా అప్పుడు అక్కడేవున్నాడు.

అది మనసారా ప్రేమించిన ప్రేమకాదు. కేవలం నాటకంలో నటిస్తున్నట్లు, ఉద్రేకపుహంగే ఆ ప్రేమ! ఏమైనా తులసిమాత్రం వారి ప్రణయకలాపానికి అభ్యంతర పెట్టింది.

"ఆమె ఎవరనుకున్నావు? మన వంశం పరువుప్రతిష్ఠల నాలోచి చావా! కనీసం ఆమెవంక కన్నెత్తయినా చూడ కూడదు" అన్నది తులసి.

"కాదు, నేనామెను పెళ్ళిచేసుకుంటాను," అన్నాడు ఆంజనేయుడు – తనవాగ్ధోరణిలో మనోనిశ్చయాన్ని ప్రస్ఫుటింపజేస్తూ.

"ఆ పిచ్చిపనే చెయ్యొద్దంటున్నాను," అని కోపంతో మండిపడింది తులసి.

ఇంతకన్న అందమైనవాళ్లూ, ధనవంతులైన పిల్లలూ దేశంలో చాలామంది వున్నారు. వాళ్ళలో ఎవరినో ఒకర్తెను నేను చూస్తాను. కాని కామాక్షి సంగతి మాత్రం మరచిపో."

"కామాక్షి అంటే నీకెంతో యిష్టంగా అక్కా... నీ స్నేహితురాలుకూడా."

కావచ్చు ఆ స్నేహానికీ, నీ ప్రణయానికి ముడిపెట్టకు. కామాక్షిని నాకు మరదలుగా చేసికోటానికి నేనిష్టపడను."

"అయితే కామాక్షిని లేవదీసుకుపోతాను."

"ఆ పనే చెయ్యకు. నీవాపని చేస్తే మనవంశాని కెంత మచ్చ వస్తుందో ఆలోచించు. స్వర్గంలో శాంతిగా

వున్న నాన్నగారి ఆత్మకు కష్టం కలిగిస్తావా? నీవు కామాక్షిని లేవదీసుకుపోవటం జరిగిందంటే నీయీ అక్కను యిక చూడ లేవు. తులసి ఒక్క క్షణంకూడా బ్రతకదని గుర్తుంచుకో."

"అది కాదక్కా. కొంచెం ఆలోచించక్కా;" అని అర్థిస్తూ ఆంజనేయుడు ఆమె కళ్ళల్లోకి చూశాడు. ఆమె చూపుల్లో పగబట్టిన సర్పం కాటువేసే క్షణంకొరకు పొంచి వుండి నిరీక్షిస్తున్నట్లుగా - ఆమెనైఖరి ద్యోతకమయ్యేసరికి ఆంజనేయుడు హడలిపోయాడు. ఏం చేసేందుకూ అతనికేం పాలుపోలేదు. బందెలదొడ్డిలో పెట్టిన జంతువులా వుంది అతని స్థితి. అతనెంతో ప్రాధేయపడి, బ్రతిమాలుకున్నాడు - అక్కగార్ని. కాని అవన్నీ గాలిలో కలిసిపోయినై.

## 23

ఆరోజురాత్రి క్రొత్తనాటకం వేస్తున్నారు. అది భక్త ప్రహ్లాద. భగవంతునిపై విశ్వాసంకలిగి భక్తిప్రపత్తులతో మెలగే కొడుకునకూ- తానే భగవంతుడననీ, వేరేభగవంతుడు లేడనుకొనే దురహంకారి, అంధవిశ్వాసీ అయిన అతనితండ్రి హిరణ్యకశిపునకూ భావసంఘర్షణ యితివృత్తంగా గల కథ అది! రెండు విభిన్నభావాలకు పోరుఘోరంగా జరిగిన విషాద గాథ! అప్పుడు శ్రీ మహావిష్ణువు నరసింహావతార మెత్తి యీ సంఘర్షణలో జోక్యంకలగజేసుకొని, భయంకరంగా తగాదా పరిష్కరించిన విధానం చిత్రించబడినట్టి కథ!

ఆంజనేయుడు నరసింహావతార పాత్ర ధరించాడు.

ఆ రాత్రి - ఆంజనేయుడు గ్రీన్‌రూములో (వేషధారణ చేసికోనేగది) తన సన్నివేశం వచ్చేసమయం కొరకు నిరీక్షిస్తూ వున్నాడు. కాని, చాలా నిరుత్సాహంగాను, ఏమిటో యిదిగా వున్నాడు. మానసికంగా వ్యధితుడై వున్నట్లు అతని ముఖకవళికలు స్పష్టం చేస్తూవున్నాయి. ప్రేమకై అర్రులు జాపి, అందుకోలేక పరితపించే ఘట్టమంటూ అతని జీవితంలో అదే తొలిసారి. అసలు ప్రేమప్రవాహంలో యీది, కలలు గనడంకూడా అదే ప్రథమం! అందువల్ల క్రొత్తగా కలిగిన యీ ప్రేమోద్రేకం - అక్కగారి అటంకం ఎదురయ్యేసరికి అతని మనస్సుపై గట్టి దెబ్బకొట్టింది. మనిషిని ఉన్మత్తుణ్ని చేసినంత యిదిగా - నిర్లక్ష్యపరుణ్ని చేసింది. అతడు అక్క గారంటే హడలెత్తిపోతాడు. ఆమె మాట్లాడితే కిక్కురు మనకుండా కూర్చుంటాడు. తులసిఅంటే ఆంజనేయునకు అంతభయం.

అయితే ఆభయం యిప్పుడు ధైర్యంగా అవతార మెత్తి, విజృంభించింది. భయంకరరూపం దాల్చింది. ఆంజనేయుడు రంగస్థలంపైకి వెళ్ళాడు. నరసింహావతార పాత్ర అభినయిస్తున్నాడు. అతడు రాజైన హిరణ్యకశిపునిమీదకు మహోగ్రుడై దూకి, క్రిందపడేసి, అతని పొట్టచీల్చి, ప్రేవులు బయటకు లాగవలసిన సన్నివేశం అది! అది రెండు ఘట్టాలుగా జరగవలసిన భాగం. కాని ప్రేమోన్మాదంలో పడ్డ ఆంజనేయుడు యీ సంగతి మరచిపోయాడు. అంతా ఒకే రంగంలో చేస్తూ, తనను తాను మరచిపోయి రాజు పాత్ర

ధరించినవాణ్ణి క్రిందపడేసి, పొట్టచీల్చి, ప్రేవులు బయటకు లాగినట్లు నటించవలసింది పోయి, నిజంగానే పొట్టచీల్చి, ప్రేవులు బయటకు లాగేశాడు

దానితో ప్రేక్షకుల్లో అలజడి వచ్చేసింది భయాందోళనలు నలుమూలలా రేగినాయి. ఆంజనేయుడు తన పాత్ర నటించేసి లోపల కొచ్చేశాడు. తానుధరించిన సింహాంతల తీసేశాడు. ప్రతిఒక్కరి ముఖంమీదా భయవిహ్వలతా చిహ్నాలు ప్రత్యక్షంగా చూచి, అందుకు కారణమేమిటా యని ఆశ్చర్యపోయాడు. నిజంగ్రహించేసరికి అతడు నివ్వెర పోయాడు. వెంటనే అతనికి పక్షవాతం వచ్చేసింది.

అలా చపలచిత్తుడై మంచంలో కొంతకాలం గడిపాక, అక్కగారిల్లు వదలిపెట్టి ఎక్కడెక్కడో తిరుగుతూ వెళ్లిపోయాడు. అతని ప్రేమ - అతనికి ఉల్లాసానికి బదులు విషాదాన్ని కలిగించింది. అక్కడక్కడా తిరిగి, చివరకు అజంతాకు వచ్చాక, బౌద్ధమతస్థుడుగా మారిపోయాడు. ఇక్కడ ఒక కథకుడుగా వుంటున్నాడు.

మళ్ళీ యింతకాలానికి రంగస్థలంపై నటించే అవకాశం లభించింది. బుద్ధుని పాత్ర అభినయించాలనే అతని చిరకాలవాంఛ యీనాడే అవకాశం చిక్కింది. నటనలో ఆంజనేయుడు మంచి సమర్థుడు. ఇక కవిదేవపాల్ ఆంజనేయుడిపాత్రకు జీవంపోసే కవిత్వం వ్రాశాడు.

రోజులు గిర్రున తిరిగిపోయినై. ప్రతివొక్కరూ బుద్ధ జయంత్యుత్సవాలగురించి ఆలోచించేవారే ఎవరు మాట్లాడినా వుత్సవ సంరంభంగురించే అందరూ తమ నిత్య

కృత్యాల్ని మాని, వృత్సనసన్నాహాల్లో మునిగిపోయారు. ప్రేమకుమారికూడా అందులో పాల్గొంటోంది. బుద్ధుని జీవితంలో ప్రముఖపాత్ర వహించిన - యశోధర, అంబాపాలి పాత్రలకు ప్రేమకుమారిని దేవపాల్ నిశ్చయించాడు. దేవదత్తుడిపాత్ర వెంకన్నకూ, అజాతశత్రువుపాత్ర గోపీకుమార్ కూ యివ్వబడ్డాయి. ఇతరభిక్షువులుకూడా, ఆనందుడు, మౌద్గల్యాయనుడు, సారిపుత్రుడు, అలారుడు, ఉపాలి తదితర పాత్రలను తలొకటి ధరించేందుకు పూనుకున్నారు.

కొండగుట్టలకు పశ్చిమంగావున్న విశాలమైన పచ్చిక మైదానాన్ని వేదికగా నిర్ణయించారు. రెండు పక్కలా రెండు స్తంభాలు పాతారు. వాటికి తెరలు కట్టారు. ప్రేక్షకులకు స్థలం కావలసినంత!

# 24

ఆరోజే బుద్ధ జయంత్యుత్సవం. అంతా హడావిడిగా వున్నారు. చీకటి పడుతోంది. భిక్షువులందరిలోనూ ఉద్వేగం హెచ్చవుతోంది.

అది వెండిరాత్రి. మహాపౌర్ణమి. వెన్నెల పుచ్చ పువ్వుల్లా విచ్చుకొంది. అయినా లైట్లు అమర్చారు. పర్వత సామీప్యాన రంగస్థలవేదిక ప్రకాశవంతంగా అలరారుతోంది. ఖర్జూరపు చెట్ల ఆకులు పక్క తెరలుగా అమర్చబడినాయి. వెనుక తెర వివిధ రకాలుగా మారుతుంది.

ప్రజలు తండోపతండాలుగా వచ్చారు. వాళ్ళంతా నాటకం చూడాలనే ఔత్సుక్యంతో, భిక్షువుల చెంతనే కూర్చున్నారు. బదరీనారాయణ మాత్రం ఏపాత్రా తీసుకోలేదు. రామగుప్తునితోపాటు సామాన్య ప్రేక్షకుల్లో ఒకమూల కూర్చున్నాడు.

దేవపాల్ సూత్రధారుడు. అందువల్ల కథా పరిచయం చదివాడు. వాతాపి నగరరాజుదగ్గర దేవపాల్ ఒక పండితుడూ, ఆస్థానకవీనూ. వాతాపిరాజు రాజరికపు సుఖభోగాలన్నిటినీ త్యజించి. దేశంలో ప్రశాంతంగా వుండేచోటుకు వెళ్ళిపోయాడు.

పరిచయంలో బుద్ధుడు వస్తున్నట్లు చెప్పారు. ప్రతికాలంలోనూ మానవుల్లో ఉత్తము భావుకుడుజన్మించి, మహత్తర త్యాగశక్తి కలిగివుండి, భగవంతుడే అన్నంత విశ్వాసం కలిగించేట్లు విరాజిల్లుతూ వుండడం సహజం. అల్లకల్లోలమై, నానాభీభత్సము అలముకొన్న ప్రపంచంలో ఒక శాంతిమాతగా, పసుత్వాన్ని, తప్పిదాన్ని, మోసాన్ని, మృత్యువునూ సవాలు చేయడానికి ఎవరోఒకరు జన్మిస్తారు. ఒక మునిపుంగవుని పథ ముక కత్తిపదును అంచులా ఎలా వుంటుందో- అలాగే విచారాన్నుండి వోదార్చి, నిరాశాజనకమైయున్న జనావళికి ఆశగొల్పుతూ, చీకటిలోయ గుండా బాధామయ వాతావరణంలో నడక ఎలా సాగించాలో, భౌతిక జీవితాన్ని, ఆధ్యాత్మిక జీవితంగా ఎలా మారుస్తారో- అన్నిటికీ ఆయన చూపే త్రోవ శరణం.

ఈ విధంగా దేవపాల్ పరిచయ సారాంశాన్ని పఠించి "తథాగతుడు" బోధించిన అమృతోపదేశాల్ని కొన్నింటిని కూడా చదివాడు.

"మనం నిత్యం చూచే జీవితాన్నుండి
మనం నేర్చుకోవచ్చు యీ పాఠాన్ని:
ఒక రాసిగా పేర్చివున్న పుష్పాలను
ఒక రెన్నో మాలలుగా తయారించవచ్చు:

అలాగే

లోకంలో మానవుడై జన్మించిన ప్రతివాడూ
ఎక్కువ మంచినే చేసి తీరాలి!"

రంగస్థలంపై తెర తొలగింది. చనిపోతున్న హంసను గురించి గౌతముడు, దేవదత్తుల సంవాదంతో నాటకం ప్రారంభమైంది. ఒక బాణం హంస శరీరంలో గుచ్చుకొంది. గౌతముడు కరుణా సముద్రుడై, హంస శరీరాన్నుండి ఆ బాణాన్ని లాగేసి, దానికి తగిన చికిత్స చేస్తున్నాడు. దేవదత్తునకేమో పట్టరానంత కోపం వచ్చింది. తన సోదరుడైన గౌతమునిపై ఆగ్రహపరవశుడైపోయి, హంసకై చాలా తీవ్రంగా వాదించాడు. గౌతముడుమాత్రం ఉద్రేకానికి లోనుగాక చాలా ప్రశాంతంగా వున్నాడు. అప్పుడు దేవదత్తునితో యిలా అన్నాడు.

"మానవధర్మం ప్రకారం...
జీవితమే ప్రధానమయితే, జీవిని
చంపినవానికన్న, దాన్ని రక్షించినవాడే

దానిపై ఎక్కువ హక్కుదారుడౌతాడు,
కనుక, యీ పక్షి నాది."

దేవదత్తుడు కోపంతో మండిపోయి మారుమాట్లాడ లేక వెళ్ళిపోయాడు. తరవాత గౌతముని మానసిక చింతనను మార్చే రంగాలు కొన్ని జరిగినాయి. ఆ చిహ్నాలు కొన్నిటిని చూచాడు.

మొదటి వార్థక్యం!

ఒక ముదుసలి తన కెదురుగా రావడం గౌతముడదే తొలిసారిగా చూచాడు. ఆతని శారీరక దుస్థితి గౌతముని హృదయాన్ని చలింపచేసింది. ఆ సన్నివేశాన్నిగురించి దేవపాల్ యిలా చదివాడు.

"మానవునకు దీర్ఘకాల జ్వరంలా వయసొస్తుంది.
మానవుణ్ణి పీల్చి పిప్పిచేసి, నిస్సహాయుణ్ణి చేస్తుంది.
సాలెగూడు, దాన్ని ప్రౌఢతరుణమే ఛేదించేది.
చుట్టూవున్న ప్రపంచమంతా ఆశ్చర్యం..."
అంత బుద్ధుడాలోచించి యిలా చెప్పాడు.
"ఇదే మానవ జీవితాంత దశ అయేటట్లయితే
ఇందుకాకారణం నేను తెలుసుకోవాలి:
ఎందుకు? ఎందుకు? ఎందుకు?"

తరువాత రోగప్రసక్తి :—

ఒక వ్యాధిగ్రస్థుణ్ని చూచాడు. అతడు ముందుకు పోలేకపోతున్నాడు. సుఖజీవనానికి నోచుకోలేకపోతున్నాడు. దుర్భర జీవితాన్ననుభవిస్తున్నాడు. తథాగతుని కన్నులలో

బాధ ద్యోతకమౌతోంది. తన ముందున్న వ్యక్తిని చూచాక ఆయన వొళ్లు జలదరించినట్లయింది.

మూడవ భాగం: మృత్యువు.

తథాగతునిలో ఏదో-భావసంచలనం కలిగింది. మృత కళేబరం దహన సంస్కారానికై మోసుకు పోబడుతూన్నట్లుగా ప్రారంభింపబడింది. ఇదేనా జీవితం సమాప్త మయ్యే దశ?

ఇదేనా అన్నిటికీ అంతిమదశ?
లేదా యింకో ప్రపంచమేమైనా వుందా?
ఇంకో పుట్టుక ఏదైనా వుందా!

ఇలా బుద్ధుడు తర్కించుకొంటాడని దేవపాల్ చదువుతున్నాడు.

"మృత్యువు మానవుణ్ణి యిలాకొట్టి, మూగవాణ్ణిచేసి, నిశ్చలపణ్ణి చేయటానికి గలహేతువేమిటి? ఈరహస్యం తెలిసికోవడానికి ఆయన తనకృషిని ఏకోన్ముఖించేశాడు.

చివరదశ- ఒకభిక్షువు.

కాషాయగుడ్డకట్టి. చేతిలోఒకభిక్షాపాత్ర పుచ్చుకొనివుంటాడు. ఇది చూచి బుద్ధుడు స్థిరసంకల్పుడౌతాడు. తన సందేహాలన్నిటికీ సమాధానాలను తెలుసుకునే నిమిత్తమై సర్వసంగ పరిత్యాగియై, తానుకూడా భిక్షువుకావాలని నిశ్చయించుకొన్నాడు తాను చూచిన ప్రతి విషయానికీ కారణం తెలుసుకోవాలనే నిర్ణయించుకున్నాడు తన పరిశోధన ఆ రాత్రి నుంచే కొనసాగించాలని స్థిరపరచుకొన్నాడు.

తరవాత రంగం - తథాగతుని నిష్క్రమణ నిద్రపోతున్న భార్యనూ బిడ్డనూ చూచి వెనకేసుకున్న దుఃఖ భారంతో వారిని విడచి వెళ్తాడు. ఈ విషాద సన్నివేశాన్ని దేవపాల్ యిలా చదివాడు.

"ఆవిధంగా-ఔదార్యంకోసం, ఔదార్యాన్ని త్యజించాడు,
జీవితసుఖాలను కాలదన్నాడు, మహోన్నత
సుఖంకోసం...
మానవాళికి శాంతిసాధనకై ముళ్ళదారినే
కోరుకున్నాడు...

తరవాత రంగాలు గబగబ జరిగిపోయినై. ఆలరాడనే బ్రాహ్మణోత్తముణ్ని బుద్ధుడు కలిసికొని ఆయనదగ్గర ఆలోచనల నెలా కొనసాగించుకోవాలో అలవరచుకొన్నాడు. కాని తనకు కావలసిన రహస్యం అక్కడ పట్టుబడన దువలన అసంతృప్తి చెందాడు. అక్కడనుండి ఉద్రక మహాశయుని దగ్గరకు వెళ్ళాడు కాని అక్కడకూడా తాను వాంఛించిన దారి లభ్యం కాలేదు. అసంతృప్తే యెదురయింది.

అప్పుడు బోధి వృక్షంక్రింద జ్ఞానోదయ మవుతుంది. ఆజ్ఞానోదయం కొరకు ఆయనెట్లా నిరీక్షించిందీ, అయ్యాక, ఆయన నేత్రాల్లో నూతనకాంతు లుద్భవించి, దీప్తిచెంది, గతయుగాల, రాబోయే యుగాల విజ్ఞాన ప్రభాస విరిసిల్లి ద్యోతకమవుతుంది దేవపాల్ యిలా చదివాడు.

"ఈ విధంగా గౌతముడు బుద్ధుడయ్యాడు,
విజ్ఞానజ్యోతిగా అలరారాడు,

అంధకారాన్ని పటాపంచలుచేసి, నూతన వెల్గుల్ని
పునీతంచేసి

వాస్తవికతను సృష్టించాడు.

ఆ వాస్తవికతే నిర్వాణానికి సోపానం."

అప్పుడు బుద్ధిని ప్రభావం స్పష్టీకరించబడింది. అయిదుగురు వ్యక్తులు బౌద్ధమత మవలంబించారు. వారు కొండన్న, వప్ప, భద్దియ, మహానామ్ అస్సాజీలు. ఈ పరివర్తన కాశీ దగ్గర సారనాధ్‌లో జరిగింది. శారిపుత్రుడు మౌద్గల్యాయనుడు- యీ యిద్దరూ చాలా విచిత్రంగా మారిపోయారు. ఒకసారి శారిపుత్రుడు నడుస్తూండగా అస్సాజీని కలుసుకున్నాడు. అతనిలో నూతన తేజము, హుందాతనము, అచంచల విశ్వాసాలు తొణికిసలాడటం గమనించి యిలా అడిగాడు.

"మీ అధ్యాపకుడెవరు!"

ఈ అజరామరమైన సత్యసూత్రాలను, విజ్ఞాన దీప్తిని ఎక్కడ నేర్చుకున్నావు?

నేనుకూడా నేర్చుకుంటాను. చెప్పగలరా?"

ఆ దానికి అస్సాజీ యిలా బదులు పలికాడు.

"వస్తువులనుండి కారణం ఉద్భవిస్తుంది

ఆ కారణమేమిటో తథాగతుడు చెప్పాడు"

శారిపుత్రుడు ఆ పరమ సత్యాన్నవగాహనం చేసుకొని, నూతన జ్యోతిని ఆత్మలో వెలిగించుకొన్నాడు అతడు మౌద్గల్యాయనుని దగ్గరకు వెళ్ళగా, అతను ఆత్మజ్యోతిని వెలిగించుకొని శారిపుత్రునితోపాటు బౌద్ధమత మవలంబించాడు.

వైశాలి నగరానికి చెందిన అంబాపాలి అనే వేశ్య వొకామె వుంది. ఆమెకూడా బౌద్ధమత మవలంబించింది. అంగులీమాలి అనే గజదొంగ ఒకడు, మగధ రాజ్యాధిపతి యైన బింబిసారుని కుమారుడు అజాతశత్రుడు - వీళ్ళంతా తమ తమ జీవిత విధానాలనే ఏవగించుకున్నారు చివరకు వీరంతా బౌద్ధమత మవలంబించి జ్యోతిర్మయ మార్గాన్ని అర్థం చేసికోగల శక్తిని సంపాదించారు. అప్పుడు దేవపాల్ యిలా వ్యాఖ్యానించాడు.

"బుద్ధుడు క్రొత్తనాటికోసం పాతదుస్తుల్ని విడిచాడు.

పాము కూసం విడచినట్లుగా

కొత్తరూపం దాల్చారు-నిత్య సంభరితులయ్యేట్లుగా;

ఇట్లు అందరూ విజ్ఞాన వికాసం కల్గి ప్రభవించారు. చివరకు ఆ పురాణపురుషుడు దేహం చాలించి మహాపరి నిర్వాణం చెందాడు

తరువాత దేవపాల్ యీవిధంగా ముగించాడు

నిర్వాణం! జనన మరణాల చక్రీయుత కంతం,
శాంతి లభించే దారి అదే!

నిర్వాణం! శ్వాసపీల్చేందుకే శ్వాసను విడచెదవో
అదే పెద్ద ముక్తి!

నిర్వాణం! ఎక్కడ బాధ, వేదన సుఖ్ఫృతిరగనో
అదే చక్రనిజీవితానికి సోపానం!

నిర్వాణం! ఎక్కడ దేవతలూ, మానవులూ కృషి-
చేసేతావు వీక్షిస్తారో
అదే సోమరితనాని కావలి తీరం!

నిర్వాణం! ఎక్కడ - సందేహము, జుగుప్సా,
బహిష్కరింపబడుతుందో అదే ముక్తి!

నిర్వాణం! ఎక్కడ - కోరికలు, కాంక్షలూ
లేకుండా మనస్సు నిర్మలంగా వుంటుందో
అదే పునర్జన్మకు లయం!

... ... ...

ఇదీ ఆనాడు ప్రదర్శించిన నాటకం నాటకంలో రంగ రంగానికీ సౌజన్యతా, సౌభ్రాతృత్వమూ - ఉద్రేక జనితంగా హృదయానికి హత్తుకొని పోయేట్లుగా వుంది. బదరీనారాయణుడా నాటకం చూచి బుద్ధుడు భూమిమీద నడుస్తున్నాడా, తాను బుద్ధునిచూచే అదృష్టానికి నోచుకోవటం జరిగిందా! అన్నంత భ్రమనుగొల్పేరీతి తన్మయత్వం చెందాడు ఆ కథ - అతని హృదయాన్ని మేల్కొల్పింది. కళ్ళల్లో నీళ్లు తిరిగినవి. గద్గదస్వరంతో యిలా వాపోయాడు, "బుద్ధుడింత మహిమాన్వితుడా! అరే, యీ సంగతి యింతకుముందే ఎందుచేత గుర్తించలేకపోయాను?"

రామగుప్తుడు ప్రశాంతంగా కూర్చునే వున్నాడు. బదరీ మాటలు విన్నాక ఆయన బదరీతో యిలా చెప్పాడు. "ఆయన మానవలాంటివాడే. కాని తానేంచేయదలచుకున్నాడో అది చేసేందుకు కావలసిన ధైర్యం ప్రదర్శించేవాడు. ఆయ

నలో తదితర మానవకోటికన్న మహత్తరమైన విజ్ఞానఖని వుంది."

నాటకానంతరం కమలకుమారి స్టేజిమీద కొచ్చింది. దేవలోకాన్నుండి దిగివచ్చిన అప్సరసలావుంది. ఆ సౌందర్యం చూచేసరికి బదరీనారాయణలో పిచ్చి కోరికలు పుట్టినై. ఆమె అవయవసౌష్ఠవం నిశ్చలమనస్కుల్ని సైతం చలింప చేసేలావుంది బదరీనారాయణుని నయనాలుదృశ్యం చూస్తూ వూరికే కూర్చోటానికి చాలా అవస్థపడుతున్నాడని స్పష్టం చేస్తున్నాయి కాని మిగతా భిక్షువులూ, ప్రేక్షకులూ ఏదో చేస్తున్నారు, ఆనందిస్తున్నారేగాని, వాళ్ళల్లో ఎలాంటి కోరికా లేదు.

ఆ నాట్య భంగిమలు ప్రేక్షకుల హృదయాలను గిలిగింతలు పెట్టడమేకాదు, నవనవోన్మేష భావవీచికల్ని అంకురింపజేసి, పులకరింపజేస్తూవున్నాయి. ఆమె పాడే పాటలో, చేసే అభినయంలో, ఆ కదలికల్లో తమకు తెలిసిన పరమ సత్యాలున్నవనీ యీ నాట్యం చూడటంవల్ల వాటిని మరొక మారు స్ఫురణకు తెచ్చుకోవటం జరిగిందనీ అనుకున్నారు.

ఒక నాట్య భంగిమ! - విందు చేసుకోటానికిగాను, ఒక బాతును కొట్టాలని, చెట్ల గుబురుల్లోనుంచి, పుట్టా పొదలమాటుగా, దాన్ని వెంటాడుతూ క్రింద విషపురుగుల బారినుండి తప్పించుకొంటూ కాటువేయబోయిన పాములూ, తేళ్లూ, జెర్రుల్ని చంపుతూ, దాన్ని వెంటాడుతూ వెళ్తుంటాడు. చివర కన్నీ దాటి వెళ్ళి బాతు ఎక్కడుందో చూచి

చంపగల్గాను. కాని అది కొట్టుకొంటూంటే చూడలేక, చాలా విచారిస్తాను. కారణం - తన తృప్తికోసం, ఆనందం కోసం సాగించిన వేటలో, తృప్తికన్న, ఆనందంకన్న హృదయం కదలించే విషాదం ఎదురయింది. తన వొళ్లు జలదరింప చేసింది.

"ఒక మానవుడు తన ఆదర్శంకోసం, తన ఆనందం కోసం ఎన్నో అవస్థలు పడతాడు. చివరకు అది సాధించాక - తాను యింకా సాధించవలసిందేమీ లేదేయని విచారిస్తాడు. ఇదీ ఆ నాటకంలో యితివృత్తంయొక్క సారాంశం!

తరవాత నాట్యభంగిమ - చనిపోతున్న గ్రద్ద. ఆకాశంలో విహారిస్తున్న గ్రద్ద, భరత పక్షిని చూడగానే పిడుగు పడినట్లుగా దానిమీద వాలుతుంది ఆ ప్రక్కనే పొంచి యున్న వేటగాడు శరీరంలోకి చొచ్చుకుపోయేటట్లు బాణంతో ఆ గ్రద్దను కొడతాడు. అది చావుబ్రతుకుల్లో వుండికూడా ఎలాగైనా బ్రతకాలనే తన్నుకులాడుతుంది ఆ బాధంతా అక్కడ నాట్యభంగిమల్లో ప్రదర్శింపబడింది. ఆ బాధ అందరి హృదయాల్లోనూ కలతపెట్టి, ఒక్కసారి విప్లవం రేకెత్తించింది. బదరీ నారాయణ, తదితర భిక్షువులు యీ బాధను చక్కగా అవగాహన చేసుకున్నారు.

ప్రతి మానవుడూ వందచావులు చూస్తున్నా, బ్రతకాలనే ప్రయత్నిస్తుంటాడు. బ్రతుకుతున్నా, ఎక్కువ బాధలిన్ని చూడటానికీ మళ్ళీ చనిపోయేందుకే! డేగ బాధతో అరిచే అరుపులు దేహాన్ని జలదరింపజేసి రోమాలు నిక్కబొడుచుకొనేలా చేసినై.

కునేలా చేసిన్నై. ఆ అరుపు భయంతోనూ, వృథా ప్రయత్నంతోనూ కూడుకొనివుంది. ఆ డేగ నేలమీదపడటం, చచ్చిపోతూ గట్టిగా శ్వాస పీల్చడం, శ్వాస పీల్చడానికి బలవంతంగా ప్రయత్నించడం, కళ్ళు తేల్ల్రగుడ్లు పడటం, ముఖం పాలిపోవటం యిదంతా చూడటానికి చాలా భయంకరంగా వుంది. ఈ దృశ్యం చూడలేక అందరి పళ్లూ గట్టిగా కరచుకున్నాయి. చచ్చిపోతూకూడా బ్రతకటానికై బాధపడటం, అంత బాధలోనూ 'చచ్చిపోయినా బాగుణ్ణు' అనే భావానికి తావివ్వకపోవడం, గత్యంతరంలేక చివరకు చనిపోవడం - యిదంతా చూస్తే అదోరకం పిచ్చితనమనిపించింది.

తరువాత శివతాండవం. శివునికి కోపంరాగా ముల్లోకాలనూ భస్మీపటలం చేయడం, - భ్రమల్నీ, అసత్యాన్నీ, అసూయనూ నాశనం చేసేసి, తనలో తానేసన్యసించి, శక్తిని కేంద్రీకరించి హుషారుగా వుంటాడు. తాను తిరిగి సృష్టించవచ్చు. ఆ సృష్టిలో తిరిగి జన్మించవచ్చుననే వాదాన్ని శివుడు నాశనం చేసేశాడు.

# 25

ఈవిధంగా తెల్లవారేవరకూ కార్యక్రమాలుసాగినై. ఉత్సవంముగిశాక ప్రేక్షకులు, భిక్షువులుఅంతా అలసటచెందా మనిగానీ, నిద్రలేమివల్ల నిరుల్లాసంతో వున్నట్లుగాక, వినిర్మల హృదయాలతో, రాత్రిజరిగిన కార్యక్రమాలగురించి, ఆహ్లాదకరంగా, ఆనందంగా చర్చించుకుంటూ వాఘురా దగ్గరకు వెళ్లారు.

కాని బదరీనారాయణ మాత్రము అడుగులు లెక్క బెట్టుకుంటున్నట్లు నెమ్మదిగా నడచివెళ్లాడు. బుద్ధునిచరిత్ర, ఆనాట్యాలు అతనిపై ఎంతో ప్రభావం కలిగించినవి అలాగే కూర్చుండిపోయాడు. ప్రేమికుమారియొక్క ఉల్లాసంగాని, కమలయొక్క దేహసౌందర్యంగాని, అతని అలోచనల్ని చెదరగొట్టలేకపోయినై.

రామగుప్తుడు ప్రక్కనున్న బదరీనారాయణుని భుజంపై చెయ్యివేసి తట్టాడు. బదరీనారాయణ ఆయన వంక చూశాడు. అతని కళ్ళుప్రకాశిస్తున్నవి.

"నేను చనిపోయినట్లయితే బాగుండేది. నాలోఏదో క్ష్వారత్వమున్నట్లుగా అనిపిస్తోంది." అన్నాడు బదరీనారాయణ.

"ఆవిముక్తి లభిస్తే చాలాగొప్పసంగతే. అదినిన్నొక క్రొత్తమనిషిని చేస్తుంది. నాకుభయం వేస్తోంది నిన్ను చూస్తూంటే" అన్నాడు రామగుప్తుడు.

"ఎందుకు?"

"ఆ మార్పుచాలా మహత్తరమైంది. అదేజరిగితే యిప్పుడున్నట్లు నిన్నుకలుసుకోవడం చాలా కష్టమవుతుంది."

"ఏంనేను మారిపోతానా?"

"ఆ సంగతి నాకుతెలుసు. నిజంచెప్పాలంటే నేను చాలా ఆనందిస్తున్నాను."

వర్షాలు ప్రారంభించాయి. కుండపోతగా కురిశాయి. వాఘురా మహోధృతంగా పొంగి ది. మహావేగంతో ప్రవహిస్తోంది. ఎక్కడోదూరాన విరుచుకుపడుతున్న జలపాతాల ధ్వని చెవుల్ని బ్రద్దలుగొట్టి వింతభయం గొల్పుతో ది. నదిపొంగటంతో ఏక్షణాన ఏముప్పు వాటిల్లుతుందోనని చూచేవారికి అనిపిస్తోంది.

అయినా అజంతాలో వుంటున్న ప్రజలకేభయము లేదు. ఏ ఆందోళనాలేదు వాళ్ళంతా తమతమ విహారాల్లోనే నిశ్చింతగా వున్నారు. శిల్పాలు చెక్కుతూనో, చిత్తరువులు గీస్తూనో కాలం గడుపుతున్నారు. ఒకవేళ పై కప్పులకు చిల్లులేవైనావుండి వాటిల్లోంచి నీరు కారినప్పుడు, వాటిని బాగుచేసుకున్నారు. అలసట కలిగినప్పుడు బౌద్ధమత సిద్ధాంతాల స్మరణాఅన్నట్లుగా పాటలవీ పాడుకున్నారు. తాము అజంతాకు రాకముందు తమ తమ జీవితాల్లో జరిగిన సంఘటన

లన్నిటినీ, కథలుగా చెప్పుకున్నారు. కొన్ని సందర్భాల్లో ఎవరికివారు ఏకాంతంగా ఆలోచనల్లో నిమగ్నులయ్యారు. తరువాత ఆత్మయొక్క ప్రభావంగురించీ, నిర్వాణంవల్ల లభించే ఆనందంగురించీ, అటుతరువాత మోక్షసాధన ఎట్లా సాధ్యమయ్యేదీ - యివన్నీ చర్చించుకున్నారు.

ఇన్ని జరిగినా బదరీనారాయణమాత్రం అలా నిశ్చలంగానే కూర్చునియున్నాడు. కమలకుమారి చేసిన నృత్య భంగిమల్నిగురించీ, దేవపాల్ చెప్పిన బుద్ధచరిత్రగురించీ చాలాసేపు ఆలోచించాడు. సృష్టిని భస్మీపటలం గావింప నెంచిన శివుని నృత్యభంగిమ, ఒక వేటగాడు ఒక గ్రద్దను చంపటానికి సన్నద్ధుడై, చివరకు అది చస్తుండగా చూడలేక ఎనలేనిబాధ ననుభవించినట్లు చేసిన నృత్యభంగిమ, అతని హృదయ ఫలకంపై విచిత్రమైన ముద్రవేశాయి. మానవుడు బ్రతకాలని కోరుకోవడం. ఆ ప్రయత్నంలో అనుభవించే బాధలన్నీ కళ్ళకు కట్టినట్లు అతని మనస్సులో మెదిలాయి. బుద్ధునిచరిత్ర హృదయాన్ని కదలించి వేసేట్లుగా వుంది. ఆహా! ఎంత ప్రశాంతత! ఎంతటి ధ్యాన ముద్ర! బదరీనారాయణుని నొసట ఒక నూతనకాంతి ద్యోతకమవుతోంది. ముఖంలో ప్రశాంత స్వభావం వుట్టిపడుతోంది.

ఆ రాత్రంతా అతడు అటూ యిటూ తిరిగాడు. ప్రేమకుమారి కొంతసేపు అతనితోనే వుంది. కాని వర్షం పడటంవల్ల ఆమె తన యింటికి వెళ్ళిపోయింది. ప్రేమకుమారి తనదగ్గర వున్నట్లయితే బాగుండే దనుకున్నాడు బదరీనారాయణ. ఆమె లేకుండా వెళ్ళిపోవడంవల్ల ఏదో

అమూల్య వస్తువు చేజారిపోయినట్లు బాధపడ్డాడు. పెదవులు కొరుక్కొని ప్రేమకుమారి కోసం పిచ్చిగా విరహతాపం అనుభవించ సాగాడు.

అతనిలో నరాలన్నీ ఉద్రేకంతో పొంగినై. నిగ్రహించుకుంటూ వస్తున్న యౌవనోద్రేకం ఒక్కసారి పొంగి పొరలింది. మనిషి మోహావేశ పరవశుడైపోయాడు.

ఎడతెరిపి లేకుండా వర్షం కుండపోతగా కురుస్తోంది. కొంచెంసేపు సన్న తుపరలతో మెల్లగా జోలపాడినట్లుగా, నురుక్షణాల్లోనే మహా భయంకరంగా, పెంకులు పగిలిపోయేటంత జోరుగా కురవసాగింది. ఆ వర్షం, బదరీనారాయణలో నరాల ఉద్రేకాన్ని అతిశయింప జేసింది.

ఒకరోజున పట్టుకొచ్చి, ప్రక్కనే దాచివుంచిన తైల వర్ణచిత్రాన్ని బయటకు తీసి, వాటిని తదేకంగా చూశాడు. మోహం కమ్ముకొచ్చింది. ఆ ఆవేశంలో తాను ఏవేవో చిత్రాల్ని గీచాడు. తనేం జేస్తున్నాడో తనకే తెలియని స్థితిలో వున్నాడు. కొంచెంసేపట్లో గోడమీదే బొమ్మలు గీయడం మొదలు పెట్టాడు.

మొదట్లో పిచ్చిగీతలు మాదిరిగా వున్నాయి. మరి కొంచెం సేపట్లో ఒక రకమైన ఆకృతు లేర్పడ్డాయి. ఎద్దులు పోట్లాడు కుంటున్నాయి. కోపంతో రెచ్చిపోయి ఒకదాన్నొకటి చంపేసుకోవాలన్నంత భయంకరంగా వుంది ఆ సన్నివేశం. కొమ్ములు లంకెలు పడ్డాయి ముక్కులేగ పొగసెగ గాలిలో కలుస్తున్నట్లు తోస్తోంది. బుసలుకొట్టూ, రంకెలు

వేస్తూ, మహా భయంకరంగా పోట్లాడుతున్నాయి. ఈవిధంగా ఆ చిత్రంవేస్తూ, బదరీనారాయణ కూడా ఉద్రేక పరుడై పోయి, పట్టరాని ఆవేశంతో చిత్రం గీస్తున్నాడు.

ఆరాత్రి వర్షం బ్రహ్మాండంగా కురవడం ప్రారంభించింది. క్రమేపీ మరింత ఎక్కువ కాసాగింది. భిక్షువులంతా భయభ్రాంతులై, వర్షం తగ్గిపోవాలని, ఏవో ప్రార్థనలూ అవీ చేయసాగారు. వర్షంతోపాటు గాలికూడా తీవ్రంగా వీచడంతో, శబ్దమేదో విపరీతంగా వినిపించసాగింది. ఇది వినిపిస్తూంటే భిక్షువులు మరింత భయపడి పోయారు. చెట్లుకూకటి వేళ్ళతో పెగిలి, మరికొన్ని విరిగి - పడిపోతున్నాయి.

ఆరాత్రి నిజంగా ప్రళయం ముంచుకొచ్చిందన్నట్లు ప్రతివొక్కరూ తమ ప్రాణాలన్నీ గుప్పిట్లో పెట్టుకున్నారు. ప్రాణభయం అందరికీ కలిగింది.

కాని ఆ భయం లేనిదల్లా ఒక్క బదరీనారాయణకు మాత్రమే. బదరీనారాయణ తనను తాను గుర్తించుకోగల స్థితిలోవుంటె ఆరాత్రి అంతసాహసానికి వొడిగట్టేవాడు కాడు. మొత్తానికి అతనిలో ఏదో పిచ్చి ఆవేశం ఆవహించింది. దానిని అతడు నిగ్రహించుకోలేక పోయాడు. ఆ ఆవేశానికి దాసుడై పోయాడు. ఆ ఆవేశం యొక్క పొంగును తనివితీరా త్రాగాడు.

తన ప్రక్కనే వున్న అవకాశాలు గోరంత అయితే, తాను కల్పించుకునేవి కొండంత! ఆ ఎద్దు అంత భయంకరంగా పోరాడుతున్నాయనుకుంటే. బదరీనారాయణ అంతకంటే

భయంకరమైన పోరాటానికి తాంసిల్లాడు. అడవి మృగాలన్నీ భయపడిపోయి రక్షణకోసం అరుస్తున్నట్లుగా అనిపించిందతనికి. కూకటి వేళ్ళతో పెల్లగిల్లిన చెట్లు దభీమని నేల మీద విరుచుకుపడుతున్నాయి అయినా బదరీనారాయణ ఏమాత్రం భయపడలేదు. వాఘురానది దగ్గరకు వచ్చాడు. వురకలువేస్తూ పొర్లుతూ పారుతూవున్న నీటిని చూచాడు.

బదరీనారాయణ అప్పటికే తడిసి ముద్దయిపోయాడు. అతని ముఖంమీద కొడ్తుందా అన్నంత యిదిగా వర్షం కుండపోతగా కురుస్తూవుంది. బదరీనారాయణ నీటిలోకి వురికాడు. మహోధృతంగా పారుతున్న ప్రవాహంలో సుడిగుండాల్లో గిరగిర తిరుగుతూ, ప్రవాహపు వాలులో కొట్టుకుపోసాగాడు. అయినా బదరీనారాయణ ప్రవాహవేగం తనపై ఆధిక్యత చెలాయించగూడదనే పట్టుదలతో పోరాడాడు. చివరకు జయించాడు. అతి ప్రయాసతో, సుడిగుండాలతో నిండిన ఆ ప్రవాహవేగాన్ని తట్టుకొని అవతలి గట్టుకు చేరాడు అప్పటికే పూర్తిగా అలసిపోయాడు. దేహంమీద నీటిని జారతుడుస్తూ, వూపిరి పీల్చుకోవడంలో నిమగ్నుడయ్యాడు కొంచెంసేపు.

అలసటనుండి తేరుకున్నాక, తిన్నగా తోటవైపుకు వెళ్లాడు. వర్షం కురవడం మూలంగా దారంతా బురదగా వుంది. కొన్ని చోట్ల కాలుజారి క్రిందపడిపోయాడుకూడాను. అయినా కష్టాలన్నీదాటి తోటదగ్గరకు వెళ్లాడు. తోటచుట్టూ వున్న ప్రహరీగోడ అక్కడక్కడా పడిపోయింది. లోపలకు వెళ్ళి తలుపు తట్టాడు. కాని వినిపించుకున్నవారు లేకపోయారు.

గట్టిగా తట్టేసరికి యింటి యజమాని తలుపు తెరిచాడు. కాని బదరీనారాయణను చూడటంతోనే నిశ్చేష్టుడైపోయాడు.

బదరీనారాయణ లోపలకు వచ్చాక, తిరిగి తలుపు గడియ వేసేసి, "ఇలాంటి రాత్రప్పుడు కూడా బయట యేం జేస్తున్నావు?" అని అడిగాడు రామగుప్తుడు.

"ఏం జేస్తున్నానో నాకే తెలియదు. నాకేం తోచడంలేదు. మనసంతా గజిబిజిగా వుంది. ఆ కుటీరాల్లోనుండి ముందుబయటపడాలని అనిపించింది. వచ్చేశాను." అని బదులు పలికాడు బదరీనారాయణ. "ముందుదీంతో వొళ్ళుతుడుచుకో. ఆ బట్టలు తీసెయ్. పొడిబట్టలిస్తాను." అని రామగుప్తుడు తువాలు యిచ్చాడు.

అంతలో అప్పుడే అక్కడకొచ్చిన రామగుప్తుని భార్య బదరీనారాయణుని చూచి అర్ధరాత్రి వేళ, అందులోనూ గాలీవానతో భయంకరంగా వున్న ఆ చీకటిరాత్రి అలా సాహసించి రావటం చూచి, భయవిహ్వల అయింది.

"అక్కడనుండే వచ్చారా?" అని అడిగింది.

"అవును."

"ఇక్కడకు రావాలని ఎందుకంత ఆదుర్దా!"

"ఏమో నాకు తెలియదు. నన్నడిగితే నేనేం చెప్పగలను?"

"వాఘురా యిప్పుడు దాటి వచ్చావా?"

"ఆ"

"నీవు మనిషివి కానట్లున్నావే! వరదలొస్తోంటే ఎలా దాటగల్గావు! వర్షాకాలంలో వాఘురా దాటడానికి మానవు డన్న వాడెవడూ సాహసించడు."

"నేను దాటే వచ్చానుగా."

తరువాత బదరీనారాయణ తడిబట్టలుతీసేసి పొడి బట్టలు వేసుకున్నాడు. అంతలో అక్కా- చెల్లెళ్ళిద్దరూ అక్కడ కొచ్చారు. "బదరీ!" అని ఒక్కసారి సంభ్రమాశ్చ ర్యాల్లో మునిగిపోయింది ప్రేమకుమారి.

"ఇప్పుడిక నేను ఆదుర్దాపడి వచ్చానని అనకండి. ఎలా వచ్చానో నాకు తెలుసు." అని 'ప్రేమ' వంక చిలిపిగా చూస్తూ అన్నాడు బదరీ.

"ఏమిటో మీామొండి ధైర్యం. ఎప్పుడు చేసినా యిలాంటి దుడుకు పనులేనా చేసేది?" అని అంది ప్రేమ కుమారి.

"నీవెందు కొచ్చావో నాకు తెలుసు" అని మృదు వుగా పలికింది కమల. బదరీనారాయణ చిరునవ్వు చిలికిస్తూ ఆమెవంక వోరకంటితో చూశాడు.

"కాని ఇవాళనీవు బాగా విచారిస్తావుకూడా" అనిఆమె చెప్పేసరికి, ఏవుద్దేశంతో అంటోందో ఎవరికీ అర్థంకాలేదు.

"నీవుచెప్పింది నాకేంఅర్థంకాలేదు." అన్నాడుబదరీ.

అంతలో రామగుప్తుని భార్య ఒక గ్లాసుతో పాలు తీసికొచ్చి యిచ్చింది. బదరీనారాయణ త్రాగేశాడు.

"అసలేం జరిగింది బదరీ!" అని, యీ రాత్రివేళ అత నిట్లా రావటానికి కారణమేమిటో తెలిసికోవాలనే వుద్దేశ్యంతో రామగుప్తన్ని అడిగాడు.

"అక్కడంతా బీభత్సంగా వుంది. చాలా యిరుకుగా కూడా వుంటే ఎక్కడికైనా వెళ్ళిపోదా మనిపించింది. బయలుదేరి ఇక్కడికొచ్చాను. ఏం? నేనేమైనా తప్పు చేశానా?"

"ఊహూ" కాని నీవు యింత సాహసం చేసినందుకు మాకు ఆశ్చర్యంగా వుంది. ఈ గాలివానలో, వరదలతో మహోధృతంగా పొంగి పారుతూవున్న వాఘురాదాటి ఎలా రాగలిగావని మాకు వింతగా వుంది."

"అక్కడెట్లావుంది? దేవపాల్, వెంకన్న, ఆచార్య పద్మదత్, ఆచార్య విజ్ఞానంద్, తదితరులూ ఎట్లావున్నారు?"

"ఏమో నాకేమీ తెలియదు. అందరూ తలోక విహారంలో వుంటారాయె ఒకరూ బయటకొచ్చే పనిలేదు. బయట వారు లోపలకు వెళ్ళే పనిలేదు లోపల కూర్చొని మంత్రాలు జపిస్తూ, కథలు చెప్పుకుంటూ కూర్చుంటారు. వాళ్ళంతా భయాభ్రాంతులయి పోయారు. ఆ వాతావరణంలో లేకుండా వుండాలనే నేనిక్కడకొచ్చాను."

తరువాత అతను పడుకోటానికి ఒకపరుపూ, దిండూ, ఒక దుప్పటీ యిచ్చారు. అప్పటికే బాగా ప్రొద్దుపోవటం వల్ల అందరూ వెళ్ళి పడుకున్నారు. బయట గాలివాన ప్రతాపం చీకటితో కుస్తీపడ్తూనే వుంది.

బదరీనారాయణకు నిద్ర పట్టలేదు. అతను కావాలనే మేల్కొన్నాడు. తల క్రింద చేతులు పెట్టుకొని, యింటి పైకప్పువంక చూస్తూ పడుకున్నాడు. పోనీ ఏదైనా ఆలోచిస్తున్నాడా అంటే ఏమీ ఆలోచించటం లేదు. మరేం చేస్తున్నట్లు? ఎందుకోసమో నిరీక్షిస్తున్నాడు.

అందరూ నిద్రపోయారనే నమ్మకం కలిగాక, బదరీనారాయణ పక్కనుంచి లేచాడు. ఒక గదినుంచి యింకో గదికి, యిలా ప్రతి గదికి తిరిగాడు. నడిచేటప్పుడు శబ్దం కాకుండా పిల్లిలా నడిచాడు చివరకు ఒక గది తలుపుల్ని నెమ్మదిగా త్రోసి, లోపలకు వెళ్లాడు. అక్కడ యిద్దరు కన్యలు నిద్రపోతున్నట్లు గుడ్డి వెలుతురునుబట్టి గమనించాడు. తలుపుదగ్గరే ఆగి ఒక్క క్షణం ఆలోచించాడు. వెంటనే అతనిలో ఎక్కడలేని ధైర్యం వచ్చింది. కేవలం రావటమేకాదు అతన్ని సాహసవంతుణ్ని చేసిందికూడాను. ఆ యిద్దరిలో ఒకమ్మాయి దగ్గరకు వెళ్ళి లేపాడు. కళ్లు తెరవడంతో ఏదో ఆకారం కనిపించటంతో భయకంపితురాలై పోయి, ఆమె కెవ్వున కేక వేయబోగా, అతను ఆమె నోటిని తన చేత్తో గట్టిగా మూసేశాడు. తరువాత మాట్లాడవద్దని ఆమెను హెచ్చరించి, తనతో రమ్మని చెప్పాడు.

ఆమె వచ్చేవరకు బదరీనారాయణ తలుపుదగ్గరనే నుంచున్నాడు ఆమెను అక్కడనుంచి హాలులోగుండా తన మంచం వున్న గదిలోకి తీసుకు వెళ్లాడు.

"నేను నీకోసమే వచ్చాను. ఎల్లవేళలా నీగురించే ఆలోచిస్తున్నాను నన్ను నేను గ్రహించుకోలేకపోవటం వలన యిక్కడకొచ్చాను. నా హృదయాన్ని నీకే అంకితమిచ్చాను. నా ప్రణయరాశివి నీవే." అని చెవిలో చాలా నెమ్మదిగా చెప్పాడు.

ఆమె ఏమీ మాట్లాడలేదు. కాని ఆమె వైఖరి చూస్తే కంగారుపడి, భయపడినట్లుగా వుంది. ఆమె అతని కత్యంతసమీపంలో వుందన్నమాటేగాని, ఆమెలో కలిగిన భావవైవిధ్యాన్ని అతడు గ్రహించలేకపోయాడు. ఆమె సన్నిధానంలో వుండటం అతన్ని మరింత ఉన్మాదని చేసింది. యౌవనోద్రేకము పురకలువేసింది. శారీరక సౌఖ్య కోసం తొందరపెట్టింది. అతని కళ్ళు చూస్తే చింత నిప్పుల్లా, వేటగాని కళ్ళులా వున్నాయి అతనిలో ఏదో క్రొత్తభావం ద్యోతకమవుతోంది. గట్టిగా వూపిరి పీల్చుకోవాలని ప్రయత్నించినా, అంతకు మించిన తొందరపని మరేదో ఉన్నట్లు అతనికి కనిపించింది. ఆమెను పట్టుకొని దగ్గరకు లాక్కొన్నాడు. "వదలాండి ... మిమ్మల్నే ... అబ్బ... దయచేసి నన్నొదలండి" అని అందామె ఆమె అన్న మాటలు అతనికి వినిపించనేలేదు. వినిపించుకొనే దశలో వుంటేగా!

ఆమె పెదవులపై తన పెదవులాన్చి ముద్దులవర్షం కురిపించాడు. అతన్నుండి తప్పించుకోటాని కెంతో ప్రయత్నించింది. కానీ కప్పను బట్టిన పాములా ఆమెను వదలిపెట్టలేదు. ఆమె బుగ్గల్ని కసిగా కొరికాడు ఆమెలో విద్యుత్ప్రసారంలా ఉద్రేకాన్ని జనింపచేశాడు. మొదట్లో ఆమె

తప్పించుకోటానికెంతో ప్రయత్నించింది. చివరకు అతనికి లొంగిపోక తప్పలేదు. తరువాత ఆమెకూడా అతనితోపాటు ఆనందం పొందటంలో భాగస్వామిని అయింది. కొంతసేపటికి ఇద్దరినీ ఏదో అతీతమైన శక్తి లోబరచుకున్నట్లయింది. తపన తగ్గింది. అతని హృదయంలో తుఫాను నెమ్మదించింది. అతనిలో రేకెత్తిన వాంఛ, అతన్ని చాలాకాలంనుంచి వేధిస్తున్న బాధ తొలగిపోయింది. ఏదో ఆ ఛాయలు నామరూపంగా మాత్రం మిగిలివున్నాయి. అవేమంత గణనకు వచ్చేవికావు. ఇదంతా ఒక నొప్పి, అంతలో వచ్చి అంతలో పోయినట్లుంది కానీ ఆమె ఏడవటం మొదలు పెట్టింది.

అంతలో, గదిగుమ్మందగ్గర ఏదో చిన్న కాంతిరావటం ఇద్దరూ చూచారు. ఒకవ్యక్తి చేతిలో దీపం పుచ్చుకొని మహాకోపంతో, పళ్ళునూరుతూ చూస్తూవుంది.

బదరీనారాయణ ఒక్కనిట్టూర్పు మాత్రం విడిచాడు. అతనిలో మొదట కలిగిన ఆశ్చర్యం అంతరించి పోయింది. గుమ్మందగ్గర నుంచున్న మనిషివంక, తన వెనుకనున్న మనిషి వంక, పరకాయించి చూచాడు అంతే. గొంతుఎండిపోయింది. నోట్లోనుంచి మాట పెగిలిరాలేదు. దీపం పట్టుకొని గుమ్మం చెంత నుంచున్న వ్యక్తివంక మళ్ళీ చూచాడు.

"ఇలా జరుగుతుందని నాకుమాత్రం ఏం తెలుసు? నాకు నిజంగా తెలియదు. ఈ మనిషిని నిజంగా నే వేడుకున్నాను.

"వెళ్ళిపో, బదరీ. మానాన్నగారు నిద్రనుంచి లేవక ముందే నీ విక్కడనుండి వెళ్ళిపో ఈసంగతి ఆయనకు తెలిసిందంటే నిలువునా నిన్ను నాశనంచేస్తారు. వెళ్ళిపో బదరీ. ఇంక యిక్కడ ఒక్కక్షణం కూడ వుండకు. వెళ్ళు" అని తడబడుతూ చెప్పింది ప్రేమకుమారి. ఆమెచేతిలో దీపం కోపంతో నిప్పులు గ్రక్కుతున్నట్లుగా మండుతూ ఉంది.

తన ప్రక్క నే నుంచుని వెక్కి వెక్కి ఏడుస్తున్న కమల కుమారిని చూశాడు బదరీనారాయణ.

"నిన్నైనా చెప్పకూడదూ ?" అని కమలను ప్రశ్నించాడు.

"మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. మొదటినుంచీ ప్రేమిస్తూనే వున్నాను."

"ప్రేమిస్తున్న సంగతి అసలు నీకు తెలుసా ?"

"ఆ! ఎప్పటికీ మీరే నా హృదయాధిపతులు" అని కళ్ళనిండా నీళ్ళు తళతళ లాడుతూంటే, అంది కమల.

బదరీనారాయణ అక్కడనుండి ప్రేమకుమారి దగ్గరకు వెళ్లాడు. ఆమెముఖం కందగడ్డలా ఎఱ్ఱబారి కోపాగ్నిని ప్రతిబింబిస్తూ వుంది. బదరీనారాయణ దగ్గరకొస్తూంటె ముఖం చిట్లించుకుంది బదరీ ఆమె వంక కేసి చూస్తూ, ఆమెలో గోచరించిన మార్పుకు కంగారుపడిపోయి ఖిన్నుడై పోయాడు. ఆమెను పేరుపెట్టి పిలవాలనుకున్నాడు. కానిమాట పెగిలి రాలేదు.

సిగ్గుతో తలవంచుకొని బయటకువెళ్ళిపోయి మళ్ళీ తుఫానుమధ్యలో కలిసిపోయాడు. వర్షం జోరుగా కురుస్తూనేవుంది. అయినా దాన్ని బదరీనారాయణలక్ష్యపెట్టలేదు. గాలిభయంకర ధ్వనిచేస్తూ వీస్తూవుంది. దాన్ని లక్ష్యపెట్టలేదు. ఒక ప్రక్కనుంచి చలి కరుస్తోంది. వేళ్ళు కొంకర్లు పోతున్నాయి. అతనికి తలనొప్పి వచ్చింది. ఇప్పుడు మనిషి వ్యక్తిత్వాన్ని కోల్పోయి నట్లయ్యాడు. అతని కిప్పుడు యిక ఏ ఆశా లేదు.

తిన్నగా వాఘురానదీ తీరాని కొచ్చేశాడు. గర్జనలు చేస్తూ పారుతున్న దాని ఉధృతాన్ని చూశాడు. ఎవరో కక్షకొద్దీ రాళ్ళువిసిరి కొట్టినట్లుగా వర్షం కురుస్తోంది. బదరీనారాయణ అక్కడే కూలబడిపోయి పెద్దగా ఏడ్చాడు. ఆ ఏడుపులో అతని శరీరమంతా నలిగిపోయింది

అట్లాగే ఆరాత్రంతా అక్కడే కూర్చున్నాడు. తెల్లవారాక, నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకొంటూ తన విహారానికి చేరుకున్నాడు. వర్షం యింకా కురుస్తూనేవుంది. తుఫాను తగ్గే సూచనలేవీ కానరాలేదు.

# 26

బదరీనారాయణ వేదనాభారంతో క్రుంగిపోతూ ఏదో ఆలోచనతో అస్తమానం పెదవుల్ని కొరుక్కుంటూ, తీరని వ్యథ ననుభవిస్తూ కాలం వెళ్ళబుచ్చుతున్నాడు. కొంచెం సేపు, తాను రోజూ పడుకుంటూవుండే రాయిమీద పడుకొనేవాడు. కొంచెంసేపు అటూయిటూ దొర్లేవాడు. చేతుల్లో ముఖం దాచుకొని వెక్కి వెక్కి ఏడ్చేవాడు. ధ్యానముద్రలో వున్న ఒక ఋషిపుంగవుని మాదిరి, బదరీనారాయణ తన కుటీరం విడిచి బయటికైనా వెళ్ళేవాడుకాడు.

అతనిలో ఏదో క్రొత్తవ్యాధి అంకురించి అంటువ్యాధిలా అది హృదయాంతరాళంలోకికూడా చొచ్చుకుపోయింది. ఎప్పుడూ వ్యథతో కుమిలిపోయేవాడు, విచారంతో క్రుంగిపోతుండేవాడు, తనను తానే అసహ్యించుకోసాగాడు.

కాలం యిలా దొర్లుతూవుంది. ఒకరోజున బదరీనారాయణను చూడటానికి గోపీకుమార్ వచ్చాడు.

"బదరీ, ఈమధ్య కొన్ని రోజులనుంచీ నేనొక మంచి పనిచేస్తున్నానోయ్" అని ఏదో చెప్పబోయి, బదరీనారాయణను ఆపాదమస్తకమూ పరిశీలించి, నొసలు విరిచి – "ఏమిటి బదరీ, రోజురోజుకూ యిలా అయిపోతున్నావేం? ఏం జరిగింది?" అని అడిగాడు.

"కూర్చో గోపీ" అన్నాడు బదరీనారాయణ.

గోపీకుమార్ కూర్చున్నాడు.

"నేనొక మహాపరాధం చేశాను."

బదరీనారాయణ మాటలు గోపీకుమార్‌కు అర్థం కాలేదు.

"ఏమిటీ?" అని ప్రశ్నించాడు.

గోపీకుమార్ ప్రశ్న బదరీనారాయణకు, కొరడాతో దెబ్బకొట్టినట్లనిపించింది.

"ఒక కన్య శీలాన్ని పాడుజేశాను."

"ఎప్పుడు?"

"గాలివాన వచ్చిన రాత్రే"

"ప్రేమానంద్ నేనా?"

"కాదు, వాళ్ల చెల్లిల్ని."

"ఎందుకట్లా చేశావు?"

"అదే తెలియదు గోపీ... నిజంగా తెలియదు... గోపీ, నాకు చనిపోవాలని వుంది. కాని చావు భయంకరమైనది కదూ?"

"చనిపోవటంగురించి ఆలోచించవద్దని లోగడే నీకొకటి రెండుసార్లు చెప్పానుగా." అని బోనులోపెట్టిన జంతువు బయటకు రావాలనే అటూ యిటూ తిరుగుతూ వ్యర్థప్రయత్నాన్ని ఎలా చేస్తుందో, అలా తిరుగుతున్నాడు కుటీరంలో. అతని కళ్ళల్లో నీళ్లు తిరిగినై. "పోనీ నీకు యింకొకరు సలహా

యిస్సేనైనా తెలుసుకోలేవా బదరీ!" అని గాద్గదికంగా అన్నాడు.

బదరీనారాయణ ఏమీ మాట్లాడలేదు.

"నీవిలా చేయవలసింది కాదు బదరీ. నీకెప్పుడో చెప్పానుకూడా. అసలు యిలా ఎందుకు చేశావు?" అని ప్రశ్నించాడు గోపీకుమార్.

బదరీనారాయణ గోపీవంక అదోరకంగా చూశాడు. ఆ చూపుల్లో జాలితనం ద్యోతకమౌతూవుంది. మళ్ళీ పెదవులు కొరుక్కున్నాడు.

"నీ వెప్పుడైనా, ఎవరినైనా మానభంగం చేశావా, గోపీ!"

ఇలా బదరీనారాయణ అడగటంతో గోపీకుమార్కు పిడుగు పడ్డంత పనయింది. వెంటనే గోపీ భయంగా బదరీవంక చూచాడు. గోపీకుమార్కు యిదొక అగ్నిపరీక్ష.

బౌద్ధమతావలంబీకుడు - అబద్ధమాడకూడదు!

కాని యిలాంటి విషయాల్లో నిజం చెప్పడంమాత్రం ఎట్లా?

"నీకెట్లా తెలుసు, బదరీ?"

"నాకు తెలియదు గోపీ. నీ వెప్పుడయినా యిట్లా ప్రవర్తించావా అని అడుగుతున్నాను."

"ప్రవర్తించాను."

"ఎప్పుడు?"

"నేనిక్కడకు రాకముందు."

కొంచెంసేపు నిశ్శబ్దతరంగాలు కుటీరంనిండా ఆవరించాయి. బయటనుండి వర్షం కురుస్తున్నట్లు శబ్దం వినిపిస్తోంది. ఒక శిల్పి వులితో రాతిని చెక్కుతున్న శబ్దంకూడా వినిపిస్తోంది.

"గోపీ - నీ గాధేమిటో చెప్తావా గోపీ!"

గోపీకుమార్ కొంచెంసేపు నిశ్శబ్దాన్ని పాటించాడు. చెప్పటమా? చెప్పకపోవడమా అనేది నిశ్చయించుకోలేకపోయాడు. అతడు సృష్టించిన చరిత్ర స్మృతిపథంలో మెదలుతూనే వుంది.

అదొక విచిత్రగాధ. దాన్ని విచిత్రగాధ అనడానికీ వీల్లేదు; విషాదగాధ అనడానికీవీల్లేదు గతించిన దాన్ని వెలికి తీయడం గోపీకుమార్ కే మాత్రం ఇష్టంలేదు. కాని, బదరీనారాయణ వినాలనే కుతూహలంతో అడుగుతున్నాడేమో ననుకొని, ముఖంమీద చెమట తుడుచుకొని, "సరే చెప్తాను, విను" అని అన్నాడు ...

# 27

కొండవీడు దాని పరిసర ప్రాంతమంతా కొండల మయం. అక్కడంతా అనాగరిక జాతి వాళ్ళుండేవారు. ఆ కొండజాతి వారందరికీ శ్రీశ్రీ గౌరీనాధుడు నాయకుడు. ఆజాతి వారంతా వొట్టిక్రూరులు. దయా దాక్షిణ్యా లేకోశానా లేని వాళ్ళు. వాళ్ళంతా దోపిడీ, దొంగతనాలే వృత్తిగా జీవనం సాగించేవారు. ఆ కొండలమీదనుంచి, ఆపరిసర ప్రాంతాల గుండా వెళ్ళే ప్రయాణీకులందర్నీ బెదరించి, భయపెట్టి దోచుకుంటూండేవారు. మధ్యమధ్య దరిదాపుల్లోవున్న పట్టణాల మీద, పల్లెలమీద పడి దోచుకొనేవారు. వాళ్ళపేరు చెబితేనే ఆచుట్టుప్రక్కల కొన్ని మైళ్ళవరకూ జనం నిద్రపోయే వారు కారు.

శ్రీ శ్రీ గౌరీనాధుడు వాళ్ళందరికీ నాయకుడై, అందర్నీ గుప్పిట్లో పెట్టుకొని చేతిలో బొమ్మను ఆడించినట్లు, వాళ్ళచేత పనులు చేయించుకొనేవాడు. తనకేం కావాలనుకుంటే దాన్ని బలవంతంగా, నిర్బంధంగా తీసికొనేవాడు. శ్రీశ్రీ గౌరీనాధుడే ఆకొండజాతి వాళ్ళందరికీ నాయకుడు. అందువలన అతనికి ఎదురంటూ లేదు. అతను కోరింది, కోరిన మరుక్షణంలో అతనిముందు సిద్ధపరచ బడేది.

కాని అతడు పక్కా స్త్రీలోలుడు. కావలసింది అంద మైన ఆడవాళ్ళు. ఆనందం కలిగించే దక్షతకలిగిన ఆడవాళ్ళు. ఎందరోన్ని భార్యలుగా చేసుకున్నా, తానెన్ని సుఖాలనుభ వించినా, తనకు చిరకాలంగా వుంటున్న ఒక్క కోరిక మాత్రం తీరలేదు. అదొక్కటే అతనికి జరిగినలోటు. దాన్నిగురించే అతడు బాధపడి, ఆకోరిక కోసమే మరికొందరి స్త్రీలనుకూడా భార్యలుగా చేసుకున్నాడు. పుత్రసంతానం కావాలనేది అతని తీరని కోరిక ! ఆ కోరిక తీర్చమని దేవతలందరికీ మొక్కాడు. విగ్రహాలకు పూజా పునస్కారాలన్నీ చేశాడు. వాళ్ల జాతి ఆచారాల ప్రకారం జంతుబలులెన్నో చేయిం చాడు. దోపిడి సందర్భాలలో తనపై తిరగబడిన వారందర్నీ బంధించి, వాళ్లనుకూడా తన యిష్టసిద్ధి కోసం బలియిచ్చిన సందర్భాలనేకం వున్నాయి.

ఇలా ఎన్నో జీవరాసుల ప్రాణార్పణతో రక్తం యేరులు పారాక-చివరి కెలాగయితే అతనికొక కొడుకు కలిగాడు. యువరాజుల్ని సంబోధించినట్లు కొడుకునకు 'కుమార్' అని నామకరణం చేయించాడు. అతనిలో అంద చందాలు, చలాకీతనం చూచి శ్రీకృష్ణుని తర్వాత, శ్రీకృష్ణు డంతటివాడని, కనుక గోపాల్ అనిపిలవడం మొదలుపెట్టాడు. ఆ గోపాల కుమారుడే చివరకు గోపీకుమార్‌గా పిలవబడు తున్నాడు.

... ... ...

గోపీకుమార్ క్రమంగా పెరిగి పెద్దవాడవుతున్నాడు. కాని తండ్రిగుణాలు అతనికేం అబ్బడంలేదు. ప్రశాంతతనూ,

గంభీరతకూ అతడు నిలయం. ఎప్పుడూ ఏవో ఆలోచనలతో కాలు గడుపుతూ యుండేవాడు. అతనికి కొండప్రాంతాలకు విహార యాత్రలు చేయడమంటేనూ, అరణ్యప్రదేశాల్లో తిరగట మంటేనూ చాలసరదా. అలా తిరుగుతూ నేరకరకాలైన మొక్క లను పరీక్షించి, పరిశోధన చేస్తూ, కొన్నిటిని యింటికి తీసుకొచ్చి ఏవో ఔషధాన్ని తయారు చేస్తూ యుండేవాడు. భూతవైద్యాలు, మంత్రాలవైద్యాలూ అతనంటే సంబరపడే వారు. అతనికెన్నో సలహాలిస్తూ ఉండేవారు. అతనెప్పుడూ రోగుల చెంతనే కాలంగడుపుతుండేవాడు. తానుపరిశోధించి తయారుచేసిన మందుల్నివాడి, సత్ఫలితాలు సాధిస్తుండే వాడు.

అచిరకాలంలోనే అతనిపేరు యింటింటా మారుమ్రోగింది. మంత్రాల వైద్యులు మొదట్లో మొంతయిదిగా అభిమానించారో, యిప్పుడంతకు రెట్టింపు యిదిగా ద్వేషించసాగారు. అసూయకు దాసులయ్యారు. ప్రజలెవ్వరూ వాళ్ళ మందులు తీసుకోవడంలేదు. అందరికీ గోపీకృష్ణారే అభిమాన వైద్యుడైపోయాడు. ఇప్పుడా మంత్రాలు, తంత్రాలూ వైద్యాని కుపయోగించడంలేదు. కేవలం వేళకు మందులు వాడటం, తగినంతగా విశ్రాంతి తీసికోవడ మొక్కటే నిత్యాచారమైపోయింది.

గోపీ అపారకష్మైన వింతమనిషి. కొండజాతుల ప్రాంతాలు దాటికూడా మైళ్ళ తరబడి వెళ్ళి క్రొత్తమొక్కలేమైనా కనిపిస్తాయేమోనని అన్వేషించేవాడు. ఏదైనా కంట బడితే దాన్ని పరిశీలించి, పరిశోధించి, దానివలన ఏదో ఒక

రకమైన ఉపయోగం కనిపెట్టేవరకూ నిద్రపోయేవాడు కాదు.

ఒకసారి యింకా కొంతదూరం వెళ్ళాడు. నాగార్జున కొండదగ్గరకు వెళ్ళాడు. అక్కడ ఒకరకమైన జాతివారు నివసిస్తున్నారు ఒక్కరికీ తలపై వెంట్రుకల్లేవు. అందరూ నున్నగా బోడి చేయించుకున్నవారే. వారు అదో పద్ధతిగా ప్రార్థనలు చేస్తున్నారు వాళ్లు మాట్లాడే భాషకూడా వేరుగా వుంది. వారిని దోపిడిచేసి శ్రీ శ్రీ గోరీనాధ్ పొందిన ప్రయోజనమేమీ లేకపోయింది. కేవలం ఒక పుస్తకాల కట్టమాత్రం తనతో తీసుకువెళ్ళిపోయాడు; అంతే.

ఇంతా దోపిడిచేస్తే ఒక్క పుస్తకాలకట్ట మినహాయించి మరేమీ దొరక్కపోవడంతో గోరీనాధ్‌కు విపరీతంగా కోపం వచ్చింది. ఒకమంట వేయించి, యీ పుస్తకాలన్నిటినీ ఆ మంటలో పడవేయించి తగులబెట్టించాడు. మంట పూర్తిగా ఆరిపోయాక, ఆ బూడిద, అటూ యిటూ కదిలిస్తే, అడుగున ఒక పుస్తకం సగం కాలీకాలకుండా వుండిపోయింది దాన్నిగురించి ఎవరూ పట్టించుకోలేదు. గోరీనాధుడుకూడా అమరావతిలో డబ్బు దోచుకోవడంపట్లనే దృష్టి నిలిపినందువలన యీ పుస్తకాలన్నీ కాలాయా లేదా అనే ఆలోచన పట్ల శ్రద్ధ కనబరచలేదు.

గోపీకుమార్ దృష్టి ఆ సగం కాలీకాలకుండా పడివున్న పుస్తకంమీద పడింది. దాన్ని తీసుకున్నాడు. కాగితాలవీ అటూయిటూ తిరగేసి చూశాడు. అందులో దస్తూరీ అతన్ని ముగ్ధుణ్ణి చేసింది. కాని అదేంభాషో అతనికి తెలి

యను. ఆభాష ఏమిటో తెలుసుకోవాలనే కాంక్ష కలిగింది. కళ్ళు తళుక్కుమని ఆనందంతో మెరిశాయి.

గోపీ నాగార్జునకొండకు వెళ్లాడు. అక్కడవున్న విశ్వ విద్యాలయానికి వెళ్ళాడు. అందులో వుంటున్న బౌద్ధభిక్షు వులు అతన్ని చేర్చుకోడానికీ, అతనికి భాష నేర్పేందుకూ అంగీకరించలేదు. కాని వృద్ధాప్యంలో వున్న 'ప్రభాకర్' అనే బౌద్ధభిక్షువు గోపీలోవున్న ఆకాంక్షనర్థంచేసుకున్నాడు. అతని కోర్కె, పట్టుదల, ఆసక్తి అన్నీ వాస్తవమైనవేనని గుర్తించాడు.

ప్రభాకర్ గోపీని తన చేతిక్రిందకు తీసుకుని, అతనికి కావలసిందల్లా నేర్పేందుకు సంసిద్ధుడయ్యాడు.

... ... ...

## 28

అప్పుడప్పుడు గోపీకుమార్ కొండవీడునుంచి నాగార్జున కొండకు వెళ్ళి వస్తూవుండేవాడు. వారిభాషను కేవలం చద వటం, వ్రాయడం, నేర్చుకోవడమేగాక, తానొక బౌద్ధమతా వలంబీకుడయ్యాడు. ఒక భిక్షువుగా మారకపోయినప్పటికీ, బుద్ధుని సూత్రాలను తు. చ. తప్పకుండా ఆచరించే శిష్యా గ్రేసరుడయ్యాడు.

చదవడం బాగా అలవడేసరికి వారి గ్రంథాలలో వేరు వేరు మొక్కలను గురించి, వాటి వుపయోగముల గూర్చి, ఎన్నో కొత్తవిషయాలు తెలుసుకున్నాడు. నాగార్జునుడు వ్రాసిన "శుశ్రుత సంహిత" అనే వైద్యగ్రంథాన్ని క్షుణ్ణంగా చదివాడు. నాగార్జునుడు వ్రాసిన యితర శాస్త్ర విజ్ఞాన విషయాలను కూడా ఆకళింపు చేసుకున్నాడు. ఇక అప్పటినుంచీ, బాడపద్ధతుల్ని విరమించేసి, ప్రతి విషయాన్నీ, శాస్త్రీయ దృక్పథంతో పరిశీలించడం ప్రారంభించాడు.

గోపీ యీవిధంగా తయారవుతూంటే, అతని తండ్రి శ్రీశ్రీ గౌరీనాథునకు ముసలితనం ఒక ప్రక్కనుంచి ముంచుకొస్తోంది. కొడుకులో యీ మార్పుల్ని చూచి తండ్రి సంతోషించలేకపోయాడు. కొడుకు తన అడుగు జాడల్లోనే నడచుకోవాలని తండ్రి కోరిక. కాని దోపిడిఅన్నా, రక్తపుబొట్టు క్రింద పడటమన్నా గోపీకుమార్‌కు సుతరామూ యిష్టంలేదు. శ్రీశ్రీ గౌరీనాథుడు చిలక్కి చెప్పినట్లు కొడుక్కి హితవు చెప్పాడు.

గోపీకుమార్ విని వూరుకున్నాడు. మళ్లీ యథా ప్రకారం తన సంచులు, మూలికలూ దొరికేచోటుకు వెళ్ళిపోయాడు. ఆ మరుక్షణంలోనే తండ్రి కోపంతో అన్నమాటలన్నిటిని మరచిపోయాడు. గోపీ నవయౌవనపు పొంగులతో మిసమిస లాడుతూ, ఆజానుబాహువిలా పొడుగ్గా వున్నాడు. నగరంలో వున్న కన్యలందరూ చారెడేసి కళ్లు చేసుకొని అతనివంక ఆశగా చూచేవారు. కాని అతని కెవరియాదా దృష్టే లేదు.

అంతలో అతను 'సౌజన్య' అనే కన్యను కలిసికోవడం జరిగింది ఆమె కొండజాతివారి కన్య. ఆమెకు చెప్పలేనంత గర్వం. ఆమెఅంటే ప్రతి వొక్కరికీ భయం. ఎవరేమాటన్నా ఎదురు నాలుగు మాటలని మళ్ళీ మాట్లాడకుండా చేసేది. శ్రుతి మించితే మీదపడి పొడుగ్గా పెంచివుంచిన గోళ్ళతో పిశాచంలా రక్కేది. శ్రీ శ్రీ కాశీనాధునికి కుడిభుజంగా వుంటున్న బలరాముడనే కొండజాతి నాయకుని కూతురామె.

ఎప్పుడూ ఆ కొండచరియల్లో తిరుగుతూ, అప్సరసలు విహారయాత్రకు వెళ్ళినట్లు, వెళ్తూవుండేది. స్వేచ్ఛగా ఆడుతూ పాడుతూ కాలంవినోదంగా గడుపుతూ సంతృప్తి పడుతుండేది.

ఒకరోజున గోపీకుమార్ ఆమెకు ఎదురు పడ్డాడు. అతన్ని చూచింది. అతనంటే ఆమెలో నిర్లక్ష్యభావ మొక్కటే తప్పనరే అభిప్రాయమూకలుగలేదు. కాని గోపీ కుమార్ మాత్రము ఆమెసౌందర్యానికి చకితుడయ్యాడు. అలాంటి అందమైన కన్యను అతడప్పటి వరకూ ఎవరినీ చూచి యెరగడు.

"ఎవరు మీరు? ఈ అడవిలో ఏంజేస్తున్నట్లు?" అని మృదువుగా, నిర్మలంగా ప్రశ్నించాడు గోపీకుమార్.

"నే నెవరినైతే నీకేందుకు? నేనేంజేస్తే నీకెందుకు? అది నీకేంసంబంధం?" అనితూణీరంలా ప్రశ్నించిందామె, తీక్షణదృష్టిసారిస్తూ.

"అంత నిర్లక్ష్యంగా మాట్లాడడం సబబనిపించుకోదు." అన్నాడు గోపీ.

"నా యిష్టం. ఎవరేమనుకున్నా నేనేం లక్ష్యపెట్టను. తెలివితక్కువగా యితరులు నావిషయంలో జోక్యం చేసుకోవడం నేనుసహించను.

"ఒకవేళ జోక్యంచేసుకుంటే యేంజేస్తారు?

"చంపుతాను."

"చంపగలరా?"

"ఇప్పటికి ముగ్గురయ్యారు. మరికొందర్ని ఆజాబితాకు చేర్చడం నాకంతకష్టమైన పనేంకాదు."అని ఆమె కటువుగా చెప్పి, అక్కడనుండి రుసరుసలాడుతూ వెళ్లిపోయింది. ఆమెవైఖరితో గోపీకుమార్ హృదయంలో మరోక్రొత్తరకమైననొప్పి ప్రవేశించింది.

తరువాత రోజులు గడుస్తున్నకొద్ది ఆమెను కలసికోవాలనేకాంక్ష అతనిలో దినదినాభివృద్ధిచెందింది. కాని ఆమె మళ్ళీఎప్పుడూ ఆప్రాంతాలకేసి రావటేను. కొండల్లో ఆచివర ప్రక్క ఏవోక్రొత్తమొక్కలు దొరుకుతాయన్న సంగతితెలిసి అక్కడకు వెళ్ళాడు. వెళ్లినరోజునే సౌజన్య అక్కడ కనిపించింది

కళ్ళు పెద్దవిచేసి అతన్ని ఒక్కసారి నిలువెల్లా చూచింది.

"అయితే తమరు నేనెక్కడ వుంటున్నానా అని వెతుక్కుంటూ వచ్చారన్నమాట!"అని బరువుగా నిట్టూర్పు విడుస్తూ అందామె.

"లేదు. ఇదివరలో మీరు కనిపిస్తారేమోనని తిరిగాను. అప్పుడు మీరు కనపించలేదు ఇప్పుడసలు మీకోసం వెదక టమే లేదు. కాని మీరు కనిపించారు, ఒకవేళ - నేనెక్కడ వుంటున్నానో తెలుసుకోవాలని వచ్చారేమోనని ఆశ్చ ర్యంగా వుంది."

"నీవు చాలా తెలివితక్కువవాడివి" అని అందామె.

"నేనేకాదు; అందరమూ అంతే."

"నీవు ఏం చేస్తుంటావు? ఎప్పుడు చూచినా ఏవో మూలికలు ఏరుకొంటూ వుంటావు. అక్కడ మన పట్టణంలో నీవు వైద్యం చేస్తుంటావని నాకు తెలుసు. కాని యువరాజు చేయదగిన పని అదికాదు."

"అయితే నేనెవరో నీకు తెలుసన్నమాట,"

"తెలిసేతీరాలి. మా నాన్న మీ నాన్నగారికి కుడి భుజం."

"ఎవరూ? బలరాంగారా?"

"అవును."

"అరె, ఆయనకు నీలాంటి కూతురుందని నాకింత వరకూ తెలియదే?"

"తెలిస్తే ఏంజేసేవారు?"

"నాకిచ్చి పెళ్ళి చేయమని అడిగివుండేవాణ్ని."

ఆమె ఫకాలున నవ్వింది.

"నీవు యువరాజువయినా - చాలా తెలివితక్కువ వాడవు. నేను కన్నెయనైనా వెన్నెలవంటిదాన్ని. వెన్నె

లను పట్టుకోవడం ఎవరితరం? ఎవరి చేతులకైనా చిక్కుతుందా వెన్నెల? అంతే నేనుకూడా. పెళ్ళి అనేమాట అంటేనే నాకు వొళ్ళుమంట. నన్ను పెళ్ళిచేసుకోవాలని ఏ తెలివితక్కువవాడయినా ప్రయత్నిస్తే, అతన్ని అమాంతం చంపిపారేస్తాను" అని స్వాతిశయంతో అందామె. గోపీకుమార్ ప్రశాంతంగా విని వూరుకున్నాడు. గబగబ అక్కడనుండి వెళ్ళిపోయాడు. అతనలా వెళ్ళిపోతూంటే, ఆమె అక్కడే నుంచొని, అతనివంక తదేకదృష్టితో – అతనొక వింతరకం మనిషి అనుకొని, చూస్తూ వుండిపోయింది.

# 29

తరువాత ఒకసారి గోపీకుమార్ నాగార్జున కొండకు వెళ్తూ సౌజన్యను చూశాడు. ఆమె ఒక బండరాయికి ఆనుకొని దిగులుగా కూర్చునివుంది. అతడు ఆమెదగ్గరకు వెళ్ళాడు. ఆమె అతనివంక కోపముగా చూసింది.

"నన్నుచూసి, బాధపడ్తున్నానని ఏదో సహాయము చేద్దాంగదా అని వచ్చారల్లేవుంది. నన్ను ఏకాంతముగా వుండనిస్తే చాలు. నాకే సహాయము అక్కర్లేదు."

"అసలేం జరిగింది !" అని కొంచెం గట్టిగా అడిగాడు గోపీకుమార్.

"ఏమీలేదు."

గోపీ నవ్వాడు. "ఏమీ జరగలేదా? ఏమీ జరగక పోయినా బాధపడుతున్నావన్నమాట. నిజంచెప్పు, ఏం జరిగిం-ది?"

"ఏదో చిన్న పురుగొకటి నా కాలుమీద పాకింది. దాన్ని లాగిపారేసి చంపేశాను. కొంచెంసేపయాక నాకాలు బాధపెట్టడం మొదలు పెట్టింది. ఇప్పుడు నడవలేకుండా వున్నాను."

గోపీ ఆమె కెదురుగాకూర్చుని ఆమెపాదాన్ని పరీక్షగాచూశాడు. కుట్టినచోటునుంచి స్వల్పంగా రక్తంబయటకు కారోంది. కాని పాదమంతా బాగావాచిపోయింది. గోపీచేత్తో ఆమెపాదంమీద వాచినచోటనొక్కి పరిశీలిస్తూంటే బాధతో కెవ్వున కేకవేసిందామె.

"ఎంతసేపయింది యిదికుట్టి?"

ఆమెకాలు వంకచూసుకొని, ఎంతసేపయి వుంటుందో ఆలోచించింది. దాదాపు ఒకగంటసేపయి వుంటుంది.

గోపీ తనతో తెస్తున్న ఒకచిన్నమూటవిప్పి, అందులోనుంచి ఒకవేరుముక్క తీశాడు. అది ఒకపాముసూదిరిగా వంకరలు తిరిగి చారలుచారలుగా వుంది. అది ఎండిపోవటమువలన గోధుమ వర్ణంగా వుంది. నున్నగా వున్న ఒకచిన్న రాయితీసికొని, దానిమీద వుమ్మి వేశాడు. ఆ మూలిక ముక్కను దానిమీద అరగదీసి దానిసారం తయారు చేశాడు. ఆమెపాదంపై పురుగు కుట్టినచోట దాన్ని వేశాడు.

"ఏమిటిది?" అని అడిగిందామె.

"సర్పగంధం. ఇదిఒక చెట్టువేరు. దీన్ని నాగార్జున కొండదగ్గర సంపాదించాను. పాముకాటుకుగానీ, మరోక విషపురుగు కాటుకైనా ఇది చక్కని మందు. నాకు పాము లంటే చాలాభయం. అందుకే దీన్ని ఎప్పుడూ నావెంట తీసి కెళ్తుంటాను."

"నేను నడచి వెళ్లాలంటే యింకెంత సేపటికి తగ్గు తుంది?"

"కొంచెంసే పుండాలిమరి!"

"అయితే యిక్కడ జపంచేస్తూ కూర్చోవాలన్న మాట."

"నాతోపాటు నడచిరావాలనాన్న, చనిపోకుండా మరి కొంతకాలం బ్రతకాలనాన్న నీవిట్లా కూర్చోక తప్పదు."

గోపీ యిలా అనేసరికి సౌజన్య అతనివంక కోపంగా చూసింది.

"ఎక్కడకు వెళ్తున్నావు?"

"నాగార్జున కొండకు."

"ఎందుకు?"

"కొంచెం పనుంది,"

ఆమె అతనివంక, అదేమిటో తెలుసుకోవాలనే ఆకాం క్షతో చూసింది.

"అయితే నన్నిక్కడవదిలేసి వెళ్ళిపోతారన్నమాట?"

"వెళ్లనిస్తే, వెళ్ళిపోతాను."

"తప్పనిసరిగా వెళ్లాల్సిందేనా ?"

"వెళ్ళాలి."

"అయితే నేను పట్టుకోనులే... మళ్ళీ ఎప్పుడు తిరిగొస్తారు ?"

"చీకటి పడేముందుగానే."

"అంతత్వరగా రాగలరా ?"

"రాగలను."

"ఎలా రాగలరేమిటి?"

"ఎలా అంటే? - రాగలను. కొంచెం సేపట్లో కొండగిరి చేరుకుంటాను

అక్కడ ఒక గుఱ్ఱం తీసుకొని దాని మీద వెళ్తాను.

"మీరొచ్చేవరకూ నేనిక్కడ వుండనా?"

"వుండాలనుకుంటే వుండు"

"వుంటాన్లెండి."

గోపీ లేచినుంచుని ఆమెవంక చూశాడు. తర్వాత మళ్ళీ వెనక్కు తిరిగి చూడనైనా చూడకుండా వెళ్ళిపోయాడు.

సౌజన్య గోపీకుమార్ రాకకోసం నిరీక్షించింది. ఆమెకు ఆకలి వేస్తోంది. దాహం విపరీతముగా అవుతోంది. నాలుక పిడచగట్టుక పోతూవుంది. కాలువాపు తగ్గింది బాధ కూడా పూర్తిగా తగ్గిపోయింది. సాయంకాల మయ్యేసరికి

కొంచెం నడవగల శక్తి వచ్చింది. నెమ్మదిగా నడుస్తూ కొండ రాళ్ళు ఎక్కుతూవుంది.

... ... ...

గోపీ తన వాగ్దానం ప్రకారం తిరిగొచ్చాడు. అప్పటికి చీకటిపడుతూ పడుతూవుంది. తాను వస్తూ కొంత తినుబండారము, కొంచెం నీరుకూడా తీసుకొచ్చాడు. అతడు తిరిగొచ్చినందుకు ఆమెకు సంతోషం కలిగింది.

మబ్బుచాటునుండి చంద్రబింబము బయటపడినప్పుడు, గప్పుమని వెన్నెల తెల్లనికాంతిని ప్రసరించినట్లు, గోపీ తెచ్చిన తినుబండారాన్ని యిద్దరూ కలసి గబగబా తిన్నారు. తినేటప్పుడు ఎక్కువగా యేం మాట్లాడుకోలేదు. తినడం పూర్తయ్యేసరికి ఏదో పెద్దభారం తొలగిపోయినట్లుంది.

"ఇక్కడ యింకెంతసేపు కూచ్చుంటావు?" అని అడిగింది సౌజన్య.

"ఇంకొంచెంసేపుంటాను" తర్వాత కొండపైకి వెళ్దాం. ఇప్పుడెట్లావుంది నీకు?

"ఫరవాలేదు. నడవగల్గుతున్నాను. నెమ్మదిగా రాళ్ళపై దాటుతున్నాను."

"అప్పుడే నడుస్తున్నావా? ఇంకా కొంతసేపు కూర్చోవలసింది."

"త్వరపడి నడిస్తే మళ్ళీ నొప్పిచేస్తుంది. తెలుసా?"

"నొప్పిచేయదు. పూర్తిగా తగ్గిపోయిందిగా."

అంతలో ఉదయాద్రి మీద చంద్రబింబం నాట్య మాడుతున్నట్లు వెన్నెల వెదజల్లుతూంది. ఆ వెన్నెల కాంతిలో ఆమె దేహ సౌందర్యం, ఆమె ముగ్ధమోహన రూపం చూసి, అతనిచేతులు ఎందుకో ప్రకంపిస్తున్నాయి.

"నాగార్జునకొండకు ఏం పనిమీద వెళ్ళారు?" అని సౌజన్య అడిగింది.

"క్రొత్తరకం మొక్క ఒకటి దొరికింది. దాన్ని అక్కడ విశ్వవిద్యాలయానికి తీసికెళ్ళాను. వారు దాన్ని పరిశీలించి, దాని ప్రయోజనాలను తర్వాత తెలియపరుస్తామన్నారు."

"మీరే అక్కడవుండి పరిశీలించలేక పోయారా?"

"అలా చేసేవాణ్ణే, కాని నీగురించి వచ్చాను."

అతడు యిలా చెప్పినమాటల్లో 'నీగురించి' అన్న పదానికి అర్థం ఎలా తీసుకోవాలో తెలియక ఆమె తికమక పడింది. ఆ - 'నీగురించి' - అనే పదం ఆమె హృదయానికి బలమైన దెబ్బ కొట్టింది.

"నాగురించే వచ్చారా?" అని అడిగిందామె.

"అవురాలా" అని అదోరకమైన గొంతుతోఅన్నాడు గోపీ...

ఆమాట లనేటప్పుడు అతని చూపుల్లో భావాన్నిగానీ అతని గొంతుకలో ద్యోతకమైన భావాన్నిగానీ ఆమె అంగీకరించలేదు. ఆమెలో ఏదో గమ్మత్తైన మార్పు గోచరించింది. ఏదో బాధపడుతున్నట్లుగా కనిపించింది.

అప్పుడు గోపీకుమార్ ఆమెదగ్గరకు వెళ్ళాడు.

"సౌజన్యా" అని ఆమె భుజంపై చేయివేస్తూ పిలచాడు.

అతడు దగ్గరకు వచ్చేసరికి ఆమె కంగారుపడింది. తన భుజంపై చేయి వేయటంవలన భయపడిపోయింది. అయినా ప్రక్కకు వెళ్లిపోయేందుకు ఆమెకు శక్తి లేకపోయింది.

"చెయ్యి తీయండి, పదండి, వెళ్ళిపోదాం."

అంతే, గోపీ వెంటనే ఒక చక్రాన్ని తిప్పినట్లు ఆమెను తన వైపుకు త్రిప్పుకున్నాడు. ఆమెను రెండు చేతులతో గట్టిగా పట్టుకొని ముద్దు పెట్టుకున్నాడు. పెద్దపులి పోట్లాడినట్లు ఆమె పోట్లాడింది. కాని అతని పట్టు రాక్షసపట్టులా వుంది. గోపీ ఆ మైకంలో ఆమె బుగ్గల్ని కొరికాడు. గుప్పిట్లో పెట్టుకొని పుష్పాన్ని నలిపినట్లు తన బాహుబంధనంలో ఆమె నట్లా నలిపేశాడు. తప్పించుకోడానికి ఆమె ఎంతో ప్రయత్నించింది. ఆ పెనుగులాటలో యిద్దరూ నేలమీద పడిపోయారు. అటూ, యిటూ పచ్చికమీద దొర్లారు.

అతనినుండి తప్పించుకోవటానికై ఆమెకూడా దౌర్జన్యానికి దిగింది. పిడికిలి బిగించి గ్రుద్దింది; గోళ్ళతో రక్కింది. అతని ముఖమంతా గీరుకుపోయి రక్తం కారడంకూడా జరిగింది. అయినా అతడుమాత్రం ఆమెను వొదిలిపెట్టలేదు.

మదపిచ్చి పట్టిన మగవాడు తన భార్యను బంధించి కామేచ్ఛ తీర్చుకున్నట్లుగా, గోపీ ఆమెను పట్టుకున్నాడు. ఆమె ఎంత ప్రయత్నిస్తేమట్టుకు అలాంటి పట్టునుండి ఎలా తప్పించుకోగల్గుతుంది? చివరకతను ఆమె తన చేతుల్లో యిక

బరువనిపించేంతవరకూ, ప్రేమకూడా ఒక బాధేనని అనిపించేంతవరకూ ఆమెను తన కౌగిట్లో బంధించి వుంచుకున్నాడు... ...

# 30

తరువాత ఆమెను వాళ్ళ జాతివారితో కలసి మెలసి వుండగా గోపీ ఎన్నోసార్లు చూచాడు. కాని ఆమె మళ్ళీ ఎప్పుడు బయటకు వెళ్ళిన పాపాన పోలేదు. ఆమెకోసం వెంటాడుతున్నట్లుగా అతని చూపులు స్పష్టమయ్యేవి. ఆమె అందచందాలు క్రమంగా క్షీణత చెందసాగాయి. మళ్ళీ ఆ అందచందా లెప్పుడూ తిరిగి ఆమెలో మూర్తీభవించే అవకాశం లేనట్లుగానే తోచింది. ఆమెలో ఉదాసీనత గోపీ కుమార్‌ను చాలా కలవరపెట్టింది. ఆమె ఆవిధంగా అయిపోతూంటే అతడు చూడలేకపోయాడు. ఒకరోజున ఆమె దగ్గరకు వెళ్ళాడు.

"నేను నిన్ను పెళ్ళిచేసుకుంటాను. ఈ విషయం మీ నాన్నగారిని అడగనా!"

"వద్దు. ఆ ప్రయత్నమే జరిగితే, పెళ్ళికి ముందుగానే నేను చచ్చిపోయినట్లు మీరువింటారు. పెళ్ళి జరగటం అసంభవం!"

"సౌజన్యా! నిన్నెంతగా ప్రేమిస్తున్నానో తెలుసా? అప్పుడు అలా మూర్ఖంగా ప్రవర్తించినందుకు యిప్పుడెంతో విచారిస్తున్నాను."

"నాకేం చెప్పొద్దు. మీరు వెళ్ళిపొండి" అని కఠినంగా పలికింది.

ఆమె యింత కఠినముగా మాట్లాడేసరికి అతనిలో ఉత్సాహం చచ్చిపోయింది. అంతే. అప్పటినుంచీ అతనిలోనూ మార్పులు స్పష్టమయ్యాయి.

ఇద్దరిలో యీ మార్పులు జరగటంతో ప్రజలంతా ఆశ్చర్యపోయారు. అసలు సంగతేమిటో ఎవరికేమీ తెలియడం లేదు,

కాని గోపీకుమార్ తండ్రి శ్రీశ్రీ గారీనాథునకు మాత్రమే తెలుసు.

"నీ విలాటివాడ వవుతావని నేనెప్పుడూ అనుకోలేదు. లేక లేక కలిగావని ఎంతో ఆనందించాను. తండ్రికి తగిన బిడ్డ వనిపించుకుంటావని గర్వపడ్డాను. ఆవొక్క సౌజన్య తప్ప దేశములో యింకెవరూ ఆడవాళ్లులేరా? ఆమాత్రం అందగత్తెలు లేరా? దేశమేమన్నా గొడ్డుపోయిం దనుకొన్నావా? వెళ్ళు. వేరే కన్యను కోరుకో. ఆనందించు. జీవితము సుఖమయము చేసుకో" అని హితవచనాలు పలికాడు తండ్రి.

ఇలా తండ్రిచెప్పినప్పుడు తండ్రిపై అసహ్యంకలిగింది.

ఇప్పుడు తనపైన తనకు అసహ్యం కలిగింది. అంతే కాదు. తానువుంటున్న పరిసరవ్యక్తు లందరిమీదా, అసలు ఆ జాతిమీదనే అసహ్యం కలిగింది.

అప్పుడు ఒకరోజున నాగార్జున కొండకు వెళ్ళాడు. తాను చేసిన తప్పిదానికి పశ్చాత్తాప పడ్డాడు. తర్వాత అజంతాకు వెళ్ళాడు. ఇప్పుడతను చాలా ఉదాత్తమైన వ్యక్తి. చాలా గంభీరమైన వ్యక్తి. ఎంతో లోతైన మనిషి. ఇతరుల సౌఖ్యమే ముఖ్యంగా అనుక్షణమూ ఎంచి, ఆచరించే వ్యక్తి! కాని తనుమాత్రం అసౌఖ్యంతో బాధ పడుతూనే వుంటాడు. బదరీ! ఆవ్యక్తే - ఆ గోపీకుమారే - నీతో ఆ కథంతా చెప్తున్న గోపీకుమారుణ్ణి. ఇదీ నాకథ!

ఇదంతా విన్నాక బదరీనారాయణ ముఖం ప్రక్కకు తిప్పుకున్నాడు. అతడు ఏడుస్తున్నాడు.

"అది చాలా కష్టంగోపీ! ఇది మహాపాపం. నేనూ పశ్చాత్తాప పడతాను. పశ్చాత్తాపం చెందుతాను." అన్నాడు బదరీ.

గోపీకుమార్ అతన్ని ఓదార్చాడు.

"కాలగమనంతోపాటు అన్ని గాయాలూ మాను పట్టాయి బదరీ" అని చెప్పి గోపీకుమార్ వెళ్ళిపోయాడు.

# 31

గాలివాన సద్దుమణిగాక, ప్రేమకుమారి బౌద్ధ భిక్షువుల విహారానికి వచ్చింది. వచ్చీ రావడంతోనే తన మకాం 'జివ విహారాని'కి మార్చేసింది. ఈమార్పు బదరీనారాయణకు చాలా బాధ కలిగించింది. అతనెంతో నొచ్చుకున్నాడు. అప్పటినుంచీ రోజులు చాల విషమంగా గడుస్తున్నాయి. దానికి తగ్గట్టు ప్రేమకుమారి కూడా చాల ముభావంగానే వ్యవహరిస్తూవుంది. ఆమెతో కలిసిమెలిసి తిరగాలనీ, చనువుగా వ్యవహరించాలనీ ప్రయత్నించాడు. కాని అతను ఎదురైతే చాలు ముఖం ప్రక్కకు తిప్పేసుకునేది. ఏమీ ఎరగనట్లు అతన్ని అసలు చూడనట్లు తలవంచుకొని వెళ్ళిపోయేది. బదరీనారాయణకు చిత్రాలు గీయటంద్వారా తప్ప కాలం గడపటం యింకోరకంగా సాధ్యంగాకపోయింది. అదివరకు గీస్తూ గీస్తూవున్న చిత్రాలు పూర్తిచేయ సంకల్పించాడు. అంతకుముందు సగంగీసి ఆపుజేసిన ఎద్దుల పోట్లాట చిత్రాన్ని పూర్తిచేశాడు. తరువాత ప్రేయసీ ప్రియుల చిత్రాన్ని ప్రారంభించాడు.

కాని చెయ్యి ఆడటం లేదు. చిత్రం గీయలేకపోతున్నాడు. ఏదో మోయలేనంత పెద్దబరువుగా తోచింది. అందువలన చిత్రం గీయడం మానేశాడు. ప్రేమ్ సంగతి

గుర్తొచ్చింది. అక్కడకు వెళ్లాడు. ప్రేమ మంచి పనివాత్తి డీలో వుంది. రాజమందిరాలూ, అక్కడ పరివారమూ, గుర్రాలూ పచ్చని మైదానాలు చిత్రించి ఆనంద్ వాటి నన్ని టినీ విడిచిపెట్టి వెళ్ళిపోతున్నట్లుగా చిత్రించింది. ఇంకా రాణి మనోవ్యధతో చనిపోతున్న దృశ్యం మాత్రం చిత్రించలేదు.

బదరీనారాయణ ఆమెను పలకరించాడు. కాని ఆమె బదులు చెప్పకుండా మానంగా వుండిపోయింది.

బదరీనారాయణ నిరుత్సాహపడ్డాడు. ఈనిరుత్సాహం అతనిలో ఏదో ఒక వింతైనమార్పు కలుగజేసింది. తను చేసినపని పునశ్చరణ చేసికొని పశ్చాత్తాపపడ్డాడు. ప్రేమ కుమారి యిదేమీ పట్టించుకోలేదు.

ఇప్పుడు బదరీ వొంటరిగానే భోజనం చేసేవాడు. ఎవరైనా జతగా వున్నా, వస్తున్నా వద్దనేవాడు. ఘోర తపస్సుచేస్తున్న మునిపుంగవుని మాదిరిగా ఎప్పుడూమౌనంగా వుంటూవుండేవాడు. దేనిపట్లాఅతడు వుత్సాహంచూపేవాడు కాదు. ఒక్కడేవెళ్లి అటు పర్వతప్రాంతాలన్నీ తిరిగొస్తుండే వాడు. తననుతానే అసహ్యించుకొనేవాడు. వైధవ జీవితమని బ్రతుకుపట్ల విరక్తి చెందేవాడు. ఒకటి రెండుసార్లు ఆత్మహత్య కూడా చేసుకుందామనుకున్నాడు. కాని అందుకు అతనికి ధైర్యం చాల్లేదు.

తిరిగి తన విహారానికి తిరిగొచ్చేశాడు. తనలో తను కుళ్ళి కృశించేవాడు. మనోవ్యధతో మంచం పట్టాడు. పడు కుంటే నిద్రపట్టేదికాదు. ప్రతిక్షణమూ ఆలోచనలతో అంతు

లేని మనోవ్యథతో సతమత మయ్యేవాడు. రోజులు క్రమంగా గడచిపోతున్నాయి.

... .... ....

ఒక రోజున బదరీనారాయణ మంచంమీద పడుకున్న వాడల్లా గభాలున లేచి కూచున్నాడు. చూపులో ఏదో తీక్ష్ణతస్పష్టమవుతోంది. అరచేతిని జాపి, తీక్షణంగాచూశాడు. ముఖములో ఏదో నూతనకాంతి ద్యోతక మవుతోంది. కాని ముఖం పాలిపోయి వుంది. కళ్లు గుంటలుపడిపోయి లోయల్లో వున్నట్లుగా వున్నవి.

తాను వుంటున్న విహారం గోడనే నేస్థంగా కోరు కున్నాడు. రోజంతా ఆ గోడచెంతనే వుండి పనిచేస్తున్నాడు. తనకు సహకార మివ్వదలచిన వాళ్ళను పొమ్మన్నాడు. అందరూ నిద్రపోయాక, ఒక టార్చిలైటు సాయంతో గరుకుగా వున్న రాయినంతా చాలా సున్నితంగా తయారుచేశాడు. తెల్లవారింది. అయినా అతడు తన పని కొనసాగిస్తూనే వున్నాడు. విశ్రాంతి లేదు అయినా అలసట చెందలేదు. తన దీక్ష, పట్టుదల నెరవేర్చుకోవాలనే తహతహ స్పష్టమవు తోంది.

బయటకు వెళ్ళి ఒక పెద్దచట్టి పట్టుకొచ్చాడు. అందులో ఆవుపేడ, రేగడమట్టికలిపాడు. దానికి సున్నముకలిపాడు. అదొక జిగురుపదార్ధంలా తయారైంది. మధ్యాహ్ననికి కుంచెతో గోడమీద పూశాడు, గుంటలు, గుట్టలు అనేతార తమ్యము మచ్చుకైనా లేకుండా వుండేటట్లు పూతబెట్టాడు.

అది పూర్తిగా తడి ఆరిపోకముందే, చక్కగా సున్నపు ఘాతకూడా పెట్టాడు. ఈసున్నాన్ని మొదటిపూత లాగాని చక్కటి సౌందర్యాన్నొనగూర్చింది. అప్పుడు తన రంగుల్ని తీసుకొన్నాడు.

కాలగమనంలో ఎన్నో రాత్రులు, పవళ్లూ దొర్లి పోతున్నాయి. బదరీనారాయణ నెమ్మదిగా, ప్రశాంతంగా, చిక్కు రొక్కురుగా వుండే గీతల్ని ఎంతో నేర్పుగా, సుస్పష్టంగా చిత్రించాడు.

చుట్టూ గీచిన అంచులు నారింజ రంగులో వున్నాయి. ఆ చిత్రం బుద్ధభగవానుడు తామరపువ్వును పీటగా ఎంచి దానిపై కూర్చొని ధ్యాననిమగ్నుడై వున్నట్లు వుంది. ఆయనలో శాంతము, సహనం వుట్టిపడుతూవుంది. విశాల భావ వీచికల్లో మునిగి ఏదో ఆలోచిస్తున్నట్లుంది. ఆయనచుట్టూ ఏవో జంతువులు గంతులు వేస్తున్నాయి. శిష్యబృందంకూడా చుట్టూ వున్నారు. అందులో స్త్రీ పురుషులున్నారు. ఒక మాత్రగత్తె ముక్కున కాడపెట్టుకొని కళ్ళల్లో యింతేసి కాటుక పెట్టుకొనివుంది. ఒక కసాయివాడు గొఱ్ఱెల నత్తికి చేత్తోపట్టుకొని వున్నాడు ఒక యుద్ధవీరుడు ఎవరినో నరకాలని కత్తిపుచ్చుకొని సిద్ధంగా వున్నాడు.

ఒకరు తన జీవితమంతా తప్పుదారుల్లో గడిపి, చివరకు వైరాగ్యము చెంది వేదాంతిగా మారినట్టివాడు. ఇంకొకడు – రాక్షసుని రూపము, ఆ చెవులు, ఆ పళ్ళు చూచేందుకు పరమ అసహ్యంగా వున్నాడు. మరొకడు స్త్రీలపట్ల

కాంతో చలితమైన చూపుల్ని కళ్ళల్లో స్పష్టం చేస్తున్నాడు. ఏడుగురు అప్సరసలు ప్రేమ మధువును చిలికిస్తున్నట్లు వున్నారు. ఒకరు విరహాగ్నితో వున్నారు. ఒకరు మద్యము సేవించమని అందిస్తున్నారు. మరొకరు పడకగదిలోకి వెళ్దామని దారి చూపుతున్నారు. ఒకరు బుగ్గమీద మచ్చ తడుము కొన్నట్లు నటిస్తూ, సిగ్గు నభినయిస్తూ, ఆకర్షిస్తున్నారు. కొందరు స్త్రీలు - పురుషుల్ని మూర్ఖులుగానూ, మూర్ఖుల్ని రాక్షసుల్నిగానూ మార్చుతున్నారు. కొందరు స్త్రీలలో అంద చందాలను, పురుషుల్లో కామోద్రేకాన్ని రెచ్చగొడ్తున్నారు. మరికొందరి సోయగం ప్రకృతి శోభనే పరిహసిస్తూ, ప్రపం చాన్నే తనకై చెయిజాపి,ఎదురు తెన్నులు చూచేటట్లు చేస్తున్న సవాలును ప్రతిబింబిస్తోంది. ఇలా రకరకాల భావాలతో ప్రతిబింబించబడిన చిత్రాలెన్నో గీచాడు. ఎన్నో భయంకర మైన చిత్రాల్ని గీచాడు. ఒకరికి ముక్కు లేదు. ఇంకొకరు నాలుక బయటకుచాచి హాహాకారం చేస్తున్నట్లు - శిష్య కోటి, అనుచరబృందం, యుద్ధభటులు - సర్వానిష్టాలకు మూలమైన శని - మోక్షసాధనకై కృషిచేస్తున్న బుద్ధభగ వానుని పెడమార్గాలు పట్టించాలని శని చేసే ప్రయత్నాలు - మానవుడు కుటిలమార్గాలకు, క్షణిక సుఖాలకు, లొంగగూడ దనుకొని నిర్ణయించుకొన్న వాటికి లొంగిపోక తప్పదన్నట్లు - బుద్ధుణ్నికూడా అదేవిధంగా వంచించాలని చేసే కుటిల యత్నాలు - వాటినన్నిటిని అతిక్రమించి బుద్ధుడు బయట పడిన విధానము - దానితో తను సత్యాన్వేషిగా మారిన పద్ధతి... ఇవన్నీ చిత్రించాడు బదరీనారాయణ

తానే సర్వాంతర్యామి అన్నట్లు, తానే సృష్టికర్త అన్నట్లుగా బదరీనారాయణ చిత్రకళలో జీవకళ తల దాచుకొని శాంతంగా వున్నట్లు, అమూల్యమైన చిత్రాన్ని గీచాడు. వాటికి ఎక్కడ ఏరంగు వెయ్యాలో ఆయా రంగుల్ని వేసి తీర్చిదిద్దాడు. అన్నిరంగులూ, ఆయా రంగుల్లో మెరుపు తీగల్లా వున్నాయి. ధాతురాగ (కాషాయం). కుంకుమ, లేత పసుపుపచ్చ, మసివలె నల్లనిరంగు, నీలవర్ణం, బూడిదవర్ణం, ఆకుపచ్చ యిలా అన్నిరకాల రంగులూ ఆ చిత్రాలకు వన్నె చిన్నెల్ని తీర్చిదిద్దాయి. వాటిలో ఎక్కడా కంటికింపుగాని చిత్రం మచ్చుకైనా లేదు. చుట్టూ గీచిన అంచులో మానసిక ప్రభావ పరిణామం ద్యోతక మవుతోన్నట్లురచించాడు.

బదరీనారాయణ యిలా చిత్రాన్ని గీస్తున్నప్పటికీ, అన్నపానాదులు పధ్యానికైనా ముట్టుకోవడంలేదు. నిద్రను కూడా దూరంచేశాడు. మనిషి బాగా పలచబారిపోయాడు. చెక్కిళ్లు గుంటలు తేలి, బొమికలు బయట పడ్డాయి. కళ్లు లోతుకుపోయి లోయల్లో వున్నాయా అన్నట్లు వున్నాయి.

# 32

ప్రతివాళ్ళూ బదరీనారాయణనుగురించే మాట్లాడు కుంటున్నారు. బదరీనారాయణ పేరు ప్రతివాళ్ళకియితిహాస కథల్లో కథానాయకుని మాదిరిగానో, పురాణాల్లో నాయకు డన్నట్లుగానో ఒక రసవత్తర గాథగా తోచింది. ఎవరిని చూచినా అతన్నిగురించి మాట్లాడుకొనేవారే. అతన్ని చూడటానికి ఎవరో తండోపతండాలుగా వస్తూండేవారు. కాని బదరీనారాయణ చాలా మోటుతరహాగా మాట్లాడే వాడు. ఎవరినీ దగ్గరకు రానిచ్చేవాడుకాడు. ఈ వైఖరికి ఆచార్య విజ్ఞానంద్ చాలా విచారించాడు. ముసలితనం ముంచుకొచ్చి మరణావస్థలో ఉన్న ఆచార్య పద్మదత్ చాలా భయపడ్డాడు. ప్రేమకుమారి కంగారుపడిపోయింది. జీవితంలో తొలిసారిగా ఆమెలో విపరీతమైన భయం కలి గింది. కాని బదరీనారాయణ ఒక నిగూఢవ్యక్తిలా వుండి పోతాడు. అతనిగురించి అందరూ రోజురోజుకూ భయ కంపితులై పోయారు.

బదరీనారాయణ గోడమీద చిత్రాలు గీయడం పూర్తి చేసేసరికి అతనిలో సర్వశక్తులూ సన్నగిల్లాయి. అతన్ని విహారంలోనికి తీసికెళ్ళి ఆచార్య విజ్ఞానంద్ తగినట్లు ఉపచా రాలు చేశాడు. అతనికి వేళకు పళ్ళు పాలు యిచ్చిబలవం

తంగా త్రాగించేవాడు. బుద్ధవిహారం ఒకపవిత్ర తీర్థయాత్రా స్థలమైపోయింది. సందర్శనంకోసం వచ్చేవారు - బుద్ధుణ్ణీ, ఆయనపై ప్రకోపించి ఆయన్ను పెడమార్గం పట్టించాలని ప్రయత్నించిన ప్రకోపశక్తుల్నీ చూచి ఆశ్చర్యపోయేవారు. ఆచార్యపద్మదత్ కవిదేవపాల్‌తో కలసి అక్కడకు వచ్చాడు. అది చూచి, ఆశ్చర్యపోతూ "ఆహా! ఏది చూడాలని అహర్నిశలూ కలలుగంటూ కాంక్షిస్తున్నానో దాన్ని చూశాను. ఇదొక మహత్తర చిత్రకారుని దివ్యసృష్టి" అని వాపోయాడు.

అప్పుడు దేవపాల్ యిలా ఒకపాట పాడాడు.

సుడిగుండంలా క్షణిక సుఖాల నిలయం
సడలని ధైర్యంతో బయటపడి జయమొందితిని.
ఇంద్రియాల బంధించి నీవెవరవో గ్రహించితిని
ఓ బుద్ధదేవుడా ! సర్వాంతర్యామి !...

... ... ...

ప్రేమకుమారి ఆ చిత్రంవంక చూచి ఘొల్లున ఏడ్చింది. చేయరాని అపరాధం చేశాడని బదరీనారాయణను గర్హించింది అతనితో మాట్లాడటం మానేసింది. అతన్నొక హీనునిగా చూసింది. కాని అతిడు దాన్ని దుష్టబుద్ధితో చేయలేదు. ఒకరికి హాని చేయాలని తలంపుతో చేయలేదు. కాని చెలరేగేకోర్కె చంపుకోలేక, పొంగిపొర్లువారే ఉద్రేకాన్ని నిగ్రహించుకోలేక వేసిన తప్పటడుగులు మాత్రమే. బదరీ నారాయణపై ప్రేమకుమారి యీర్ష్యకూ జుగుప్సకూ లోనయ్యింది. అతన్ని అవమాన పరచాలనికూడా అనుకుంది.

కాని యిప్పుడు యీచిత్రం చూచాక అతనెంత ఇదిగా బాధ పడుతున్నదీ గ్రహించగల్గింది. ఆరాత్రి, బదరీనారాయణను ఉన్మత్తుణ్ని చేసిన కోర్కె ఎంత బలవంతమైందో అర్థం చేసుకొంది. కోర్కెల ఉన్మాదానికి మానవుడు బానిసయిపోతాడని యిప్పటికి నిర్ధారించుకొంది. బదరీనారాయణ లోగడ చేసిన తప్పిదానికి ఎలా పశ్చాత్తాప పడుతున్నాడో గ్రహించింది. నెమ్మదిగా అతని దగ్గరకు వెళ్ళింది. అతడు మృత్యుసన్నిధిలోవున్నట్లుగా పడుకొని ఉన్నాడు. "ప్రమాదమేమీ లేదుగదా ?" అని ప్రేమకుమారి ఆచార్య విజ్ఞానంద్‌ను అడిగింది.

"ప్రమాదమైందీ, కానిదీ అతనిమీద ఆధారపడివుంది. అతనికి జీవించాలని లేదు. జీవితమంటే విరక్తి కలిగిందతనికి. ఎందుకో చెప్పనలవిగానంత బాధపడుతున్నాడు."

ప్రేమకుమారి బదరీనారాయణవంక చూచింది.

"బదరీ...నీవింత బాధపడతావనుకో లేదు. నీపట్ల అసూయ కలిగినమాట నిజమే. నిన్నింత బాధపడేట్లు చేసినందుకు, యింతమూర్ఖంగా వ్యవహరించినందుకు నన్ను మన్నిస్తావా బదరీ ?"

బదరీనారాయణ జవాబేం చెప్పలేదు నెమ్మదిగా కళ్ళు తెరచి ఆమెవంక చూచాడు. ఎదురుగా రకరకాలు చిత్రాలు కన్నులకు మిరుమిట్లు కొల్పుతున్నాయి.

"బదరీ, నీపట్ల నేను చాలా అన్యాయంగా ప్రవర్తించాను. నన్ను క్షమించు, బదరీ."

బదరీనారాయణ పెదవులైతే కదిలాయి. కాని నోట్లో నుంచి ఒక్కమాట పెగిలి బయట పడలేదు. అతడు ఆమెవంక చూడటంలేదు. కేవలం పైవంక మాత్రమే చూస్తూన్నాడు.

"ఆ రోజున నీవు చేసింది ఎందుకు చేశావో నేనిప్పుడు అర్థం చేసుకున్నాను, బదరీ. మనస్సు నిర్మలంగా లేకపోయి నందువల్ల మానవు డనుభవించే అశాంతి, స్త్రీపట్ల పురుషు నిలో కలిగే కామేచ్ఛ తీర్చుకోనట్లయితే ఎన్ని అనర్థాలకు దారితీస్తుందో ఆచార్య పద్మదత్ గారు నాకు సవివరంగా బోధించారు!" అని పరితప్త హృదయంతో పలికింది ప్రేమ కుమారి.

అతని పెదవులు మళ్ళీ కదిలాయి. కానీ మాటలేం పెగిలి బయటపడలేదు. ఆలోచనతో అటూ ఇటూ చూస్తు న్నాడు.

"నీవు చేయగూడని పనేం చేయలేదు బదరీ. ఆ పరి స్థితుల్లో నీవేకాదు ఏ మానవుడైనా అలా చేసితీర్తాడు. ఆ స్థితిలో యింద్రియ నిగ్రహం మన శక్తికి మించిన పని. గోపీకుమార్ ఆ సంగతంతా స్పష్టంగా వివరించాడు. ఎవ రైనా ఒక వ్యక్తికి వ్యామోహం జనించినపుడు దాన్ని అణచిపెట్టుకోవాలనడం కేవలం ఆత్మహత్యకు పాల్పడినట్లే అవుతుంది. ఆ వ్యామోహం బలవత్తరంగా చంపబడితే, ఆ వ్యక్తి జీవితం జీవచ్ఛవమై పోతుంది. అతని జీవితంలో అడు గడుగునా విషాదం ఎదురౌతుంది. "ఈ సంగతంతా ఆయనే నాకు స్పష్టీకరించాడు."

బదరీ నారాయణ కళ్ళు మూసుకొన్నాడు. అతడు సజీవుడనేందుకు ఉచ్ఛ్వాస నిశ్వాసాల కాలవాలమైన రొమ్ము కదలిక వొక్కటే ఆధారం. మిగతా అంతా చలనం లేకుండా ఉంది.

పక్షం రోజులు గడిచేసరికి బదరీనారాయణ కొంచెం లేచి అటూ యిటూ తిరగడం మొదలుపెట్టాడు. సాయం కాలమప్పుడు షికారు కెళ్ళి వస్తున్నాడు. కానీ ఎక్కువగా వాఘురానది ప్రక్కనే కూర్చొని నదీ ప్రవాహాన్ని తిలకిస్తూ వుంటాడు. ఇప్పుడు నది నిర్మలంగా, ప్రశాంతంగా, ఏ వొడు దుడుకులు లేకుండా ప్రవహిస్తూవుంది. ఇలాంటినది ఒకప్పుడు వఱదలకాలవాలమై తనతో పోరాటం సల్పిందంటే తాను నమ్మలేకపోతున్నాడు. ఆ నదే యిప్పుడు నిరపాయకరంగా, నిర్మలంగా పారుతూంది.

ఆ రాత్రి జరిగిన ప్రతి సన్నివేశాన్ని, ప్రతి వుదం తాన్నీ స్మృతిపథానికి తెచ్చుకొని, చర్విత చర్వణం చేసు కున్నాడు. ఆలోచించడం మానేశాడు. మనస్సు నిర్మలంగా ఉంచుకొన్నాడు. తరువాత తననుంచి తనకే ఏదో పరిమళం గుబాళించింది.

# 33

కొంతసేపయ్యేసరికి ప్రేమకుమారి, గోపీకుమార్, వెంకన్న, ప్రభుఘోషు, దేవపాల్‌లు అతని దగ్గరకొచ్చారు. ఒకరి నొకరు సోదర పూర్వకంగా అభివందనా లర్పించుకొని, అతని ప్రక్కనే కూర్చున్నారు. ప్రేమకుమారి అతనివంక నవ్వుతూ చూసింది. ఆ చూపులో కేవలం నవ్వు ఒక్కటే కాదు. ప్రశ్నకూడా ప్రతిబింబిస్తోంది. "ఏం జరిగిందేమిటి, బదరీ? నీ ముఖంలో నూత్నకాంతి స్పష్టమౌతోంది." అని అడిగాడు దేవపాల్.

బదరీనారాయణ చిఱునవ్వునవ్వి, "నది నాతో మాట్లాడింది" అని అన్నాడు. అందరూ అతనివంక అదోరకంగా చూశారుగాని బదరీ చెప్పినమాట అర్థంకాలేదు. అయినా ఎవరూ ఏమీ మాట్లాడలేదు. అప్పుడు ప్రేమకుమారి, "ఏమని చెప్పింది, బదరీ?" అని అడిగింది.

"ఆసంగతి మీకు చెప్పేముందు నాకు పట్టిన పిచ్చేమిటో ముందుగా మీకందరికీ చెప్పాలి. నాకు స్త్రీసౌఖ్యం పొందాలని కాంక్ష రేకెత్తింది. నీవు (ప్రేమకుమారి) నాస్మృతిపథంలో మెరిశావు. అంతే అక్కడకు వచ్చాను. నీవే నను కోరి రమ్మనలేదు. ఆమె కిక్కురుమనకుండా నా వెంట వచ్చింది. నీవు కావనే అనుమానం కొంచెమైనా కలగలేదు. అలా జరిగినందుకు నేనెంతో విచారించాను.

బదరీనారాయణ యిలా చెప్పేసరికి అందరూ ఒక్కసారి నిట్టూర్చారు ఆ సంగతి అందరికీ తెలుసు కూడా.

"ఆ విషయమంతా నేను ఆచార్య విజ్ఞానంద్, ఆచార్య షడ్జనంత్ గార్లకు వివరించి చెప్పాను. వారిద్దరూ యిలా జరిగినందుకు బాధపడ్డారేగాని ఏమాత్రం కోపగించుకోలేదు. వారు నిన్ను యీ బౌద్ధారామం నుండి పంపించేయాలని చూశారు నిన్ను బౌద్ధధర్మాల నేర్చుకోకుండా నిన్ను తప్పించెయ్యవలెనని చూశారు. అప్పటికే చాలాకాలం గడచిపొయ్యింది. నీవూ గోడమీద బొమ్మల్ని చిత్రించడంలో మునిగివున్నావు. వారు నిన్ను పంపించనందువలన తను నిర్ణయాన్ని గురించి పునరాలోచించుకోవలసి వచ్చింది. ఈవిధంగా మనిషికి కామేచ్ఛతీర్చుకోవటం, కామేచ్ఛకలగటం సర్వసాధారణ విషయమని భావించారు. కామేచ్ఛ తీర్చుకోవటం ఒకవిధంగా ఆరోగ్యానికి భంగం కలిగించకుండా, మనిషిని శక్తివంతుణ్ణిచేసే అవకాశముంది. సృజనాత్మకశక్తికి నవనవోన్మేషమైన వుల్లాసాన్ని కలిగిస్తుంది." అని ప్రేమకుమారి చెప్పింది.

బదరీనారాయణ నవ్వాడు.

"ఇలాంటి మహాపరాధం చేశాక యిలా మంచిచెడ్డలు నిర్ణయించుకోవడం తగినపని" అని అన్నాడు బదరీనారాయణ

అందరూ మౌనంగానే వున్నారు. అందరూ నదిలో తన సహజవేగంతో సాగిపోతున్న ప్రవాహాన్ని పరికిస్తున్నారు.

అప్పుడు "ఇంతకూ ఆ నది ఏమని చెప్పింది; బదరీ?" అని గోపీకుమార్ ప్రశ్నించాడు.

అనంత దూరానవున్న ఆకాశంవైపు తలెత్తి చూశాడు. తానెక్కడో అంతస్థులలో వుండి గంభీరంగా మాట్లాడినట్లు మాట్లాడసాగాడు.

"ఎవరైనా తప్పుచేసినప్పుడే బాధపడటం జరుగుతుందనీ, బాధల్లోనే జీవితాన్నిగురించి నేర్చుకోగలుగుతామనీ చెప్పింది. బాధపడటంవల్ల పెడత్రోవనుండి సక్రమమార్గానికి రాగల్గుతాడు. అంతేకాదు. తనను తాను సరిచేసుకోగల్గుతాడు. తన వ్యక్తిత్వానికో విశిష్టత నెలకొల్పుకోగల్గుతాడు. తన మానసిక పరిధులలో పరితాపం చెందుతున్నపుడు ఆ తప్పు ఎందుకు చేశానా అని ఆయా పరిస్థితుల్ని పునరాలోచిస్తాడు. మానవుడు సూటిగా ఆలోచించేందుకు, జీవితాన్ని వొడుదుడుకులు లేని విధంగా సాగించుకునేందుకు చుక్కానిగా, బాధ దోహదకారి అవుతుంది జీవితం వెళ్ళబుచ్చటం చాలా సంతోషకరమైన విషయం. అందులో బాధలుద్భవిస్తే నిశితమైన పద్ధతిలో, చురుకుగా సాగుతుంది. ఆ గమనం చిత్రవిచిత్రాలుగా వుంటుంది. బాధలు నిన్ను కష్టపడేలా చేస్తాయి; కష్టాలేనిన్ను సద్వర్తనుణ్ణి చేస్తాయి. ఎప్పుడైతే నీవు సద్వర్తనుడవు కాగలుగుతావో ఆనాడే బాధకూ, కష్టానికీ సమాధి కట్టడమే అవుతుంది. అప్పుడు జీవితమంటే కేవలం బ్రతకటమనే వాదమే కాజాలదు. జీవితమొక ఆలోచనల ప్రోవు. అప్పుడు మానసిక ఔన్నత్యము, ఔదార్యము నీ వశమవుతాయి. రోజురోజుకు సమస్యలు క్రమంగా కరిగిపోతాయి. తదుపరి జీవించేది ఆలోచనల్లోమాత్రమే. అప్పుడు

నీకు సర్వం తెలుస్తుంది. నీవు సర్వం చూడగలవు. అప్పుడు నీవే సర్వాంతర్యామివి కాగలవు.

కాని జీవించాలంటే ప్రేమించి తీరాలి. ఆ మధుర క్షణాల్లో ప్రేమ ఒక మహా సామ్రాజ్యం వలెనే వుంటుంది. నిట్టూర్పులు దాని ఆజ్ఞలవుతాయి. ప్రేమకూడా ఒక బాధే; ఆ బాధ యింకా అలాగే వుండేటట్లయితే క్రమేపీ నిర్జీవమైపో తుంది. కానీ, ఇలా జరగకముందు, నీకున్న ప్రతి అవకా శాన్ని వినియోగించుకొని ప్రేమను అనుభవించి, మనదరికి రాకుండా చేయాలి. మీకు కోపం రావలసిందే. చంపవల సి దే అనుభవించాల్సిందే. ఆత్మను ముక్కలు ముక్కలుగా చించేసి, దేహాన్ని కూడా చించేయాలి; నశింపుచేయాలి.

నీవు ప్రేమిస్తేనే జీవించగల్గుతావు. అందుకు చక్కని ఉదాహరణ ఒకనదే. నదికి సముద్రమంటే ఎంతో ప్రేమ. అందుకే దానిలో కలవడానికి ఆ వైపుకే ప్రవహిస్తుంది. కానీ గమ్యం చేరేలోపుగా కొండల్నీ, గుట్టల్నీ, చెట్టు చేమల్ని ఎదుర్కొని, ఆ తాకిడి దెబ్బలు తింటుంది. మనమూ అంతే. మనం ఒక ఆదర్శాన్ని ప్రేమిస్తాము. మనం మన ఆద ర్శాన్ని సఫలీకృతం చేసుకొనేముందు, దారిలో ఎదురయ్యే స్త్రీతో సరససల్లాపాలు సాగిస్తాము. ఆమెను ప్రేమించటం ప్రారంభిస్తాము

మళ్ళీ నదికేసి చూడండి. నదివరద లెప్పుడొస్తాయో, ఎప్పుడు తగ్గుతాయో నదిలో నీరు ఎప్పుడు వస్తుందో, ఎప్పుడు ఆగిపోతుందో మనకెవరికీ దాని అంతుపట్టదు. ఆ విషయం మనమేం పట్టించుకోము. ఎక్కడో ఒకచోట పుట్టుంది.

ఎక్కడో ఒకచోట అంతమవుతుంది. ఆ సంగతి స్పష్టమే. దానిపై భిన్నాభిప్రాయములకు తావే లేదుకదా!

కాని మీకు దగ్గరగా పోతున్న ఆ నీటిని చూడండి. ఎలా ప్రవహిస్తోందో చూడండి. చిన్న అలలుగా ఎలా తారాడుతున్నయో గుట్టలను ఎదుర్కొన్నపుడు ఎంతచక్కగా మెరుస్తున్నాయో, చిన్న బొట్లు బొట్లుగా ఎట్లాపడుతున్నాయో ఆ పెద్ద సుడిగుండం చూడండి. అంతా మనమాదిరిగానే. మనమూ అంతేగా: మనలో ఉద్రేకోద్వేగాలు ఆనీటి అలలు మాదిరిగానే వుద్భవిస్తాయి. మన కామోద్రేకం ఆ చిన్న అలలు అంతరించినట్లు క్షణభంగురాలే! గలగలలాడే ఆనీటి శబ్దాలమాదిరివే మనఆలోచనలు. కాలంతోపాటు మనం మన ఉద్రేకాన్ని, ఇచ్ఛల్ని, కొండగుట్టల్ని, నీరు ఢీకొని చెల్లా చెదరైనట్లే. ఢీకొని చిన్నాభిన్నం చేసుకుంటాము. కొన్ని ప్రత్యేక సమయాల్లో వరద లన్నట్లు నీరుపొంగి తనకు అడ్డుగా వున్న సర్వశక్తుల్ని విచ్ఛిన్నంచేసి పారేస్తుంది. మనమూ అలాగే చేస్తాంగదా! మన ఉద్రేకంలో మనకేది అడ్డొచ్చినా నిర్లక్ష్యం చేస్తాం. అవసరమైతే హతమార్చేస్తాం కూడా. కనుక మనం సహనం అలవర్చుకోటానికి ధైర్యంగా జీవించాలి సహన మెంతకష్టమో మనం అనుభవ పూర్వకంగా తెలుసుకోగల్గాలి." అని ఇలా నది మాట్లాడినట్లుగా బదరీనారాయణ తనలో కల్గిన విజ్ఞాన పుంజాన్ని వివరించాడు.

అయిదుగురూ ప్రశాంతంగా, మంచి ఔత్సాహికంగా బదరీనారాయణ చెప్పిందంతా విన్నారు. అతడు చెపుతూ వుండగా ఎవరూ మాట్లాడలేదు. ప్రేమకుమారి అతని భుజం

మీద చెయ్యివేసి, "బదరీ, నావంకచూడు, బదరీ," అని అడిగింది.

బదరీనారాయణ నెమ్మదిగా ఆమెకేసి తిరిగాడు. కన్నీటిబిందువులు ఆమె కనుగొలకుల్లో నిలచివున్నాయి.

"తననుతాను గుర్తించుకోవటమే మహత్తరవిషయం, బదరీ."

అతడు తల పంకించాడు.

"నీవు నది మాట్లాడిందనుకొన్నప్పటికీ, ఆ మాట్లాడింది నిజంగా నదికాదు. నీలో ఔన్నత్యమే, నీలో ఆవిర్భవించిన విజ్ఞానపుంజమే అట్లా ప్రబోధించింది" అని ప్రేమ పలికింది.

"కొన్ని సందర్భాలలో నీవు నన్ను భయకంపితుణ్ణి చేసేవాడవు. కానీ ఇప్పుడు నిన్నుచూచి నేనే భయపడుతున్నాను. నీవు అనంతలోకాల్లో విహరించి సత్యశోధనచేసి, అపురూప నిర్మలత్వం సాధించినట్లు తోస్తోంది." అన్నాడు గోపీకుమార్.

వెంకన్న చపలచిత్తుడైనట్లు కంగారుపడ్డాడు.

"ఎలా సాధించావు, బదరీ? ఎందుకో నీవంటే అసూయ కలుగుతోంది కూడాను. మానవ బలహీనతలన్నిటిని తొలగించేసుకున్నావు" అని అన్నాడు వెంకన్న.

"లేదు వెంకన్నా. నేనింకా ఆ స్థాయికిరాలేదు. ఇంకెంతో నేర్చుకోవలసివుంది. ఇదొకపీఠికలాంటిది. చరమస్థాయినందుకోవలసిన శాంతి పొందేందుకిప్పుడే నాలో ఒకదారి ఆరంభమైంది" అన్నాడు బదరీ.

"నీవు శాంతి సాధించగలవనే నా విశ్వాసం. శాంతి సాధన చెయ్యాలంటే పైవంక చూస్తున్నప్పుడు ఆకాశంలో నక్షత్రాల్ని చూడటం మానివెయ్యాలన్నమాట" అని అన్నాడు ప్రభుఘోష్.

ప్రేమకుమారి బదరీనారాయణ ముఖంలోకి నిశ్చలంగా చూడసాగింది. ఏదో నిగూఢరహస్యం తనకుకూడా చెప్ప మన్నట్లు ఆ చూపుల్లో భావం స్పష్టమౌతోంది. ఆమె తన తలను అతని వక్షస్థలంపై ఆన్చి వెక్కి వెక్కి ఏడవసాగింది.

"బదరీ, బదరీ!" అని గాద్గదికంగా పిలిచింది. అప్పుడు దేవపాల్ యిలా చిన్నపాట పాడాడు.

ఆత్మనుండి, ఆత్మవెనుక
ఆత్మలోనికి, ఆత్మలోనే
ఆత్మనుండే సంగ్రహించితి సత్యం!
ఆత్మే నాకండ! ఆత్మే నాకాశ్రయం!
ఆత్మే నావెలుగు! ఆత్మే నాజ్యోతి!
బుద్ధం శరణం గచ్ఛామి!
ధర్మం శరణం గచ్ఛామి!!
సంఘం శరణం గచ్ఛామి!!!

# 34

ఆచార్య పద్మదత్‌కు అంతిమఘడియలు ఆసన్నమయ్యాయి. ఆయన చాలా కాలంనుంచీ అస్వస్థతగా వుంటున్నారు. అంతిమక్షణాలు దగ్గరపడినవని ఆయనకు తెలుసు. అయినా ఆయన మృత్యువునుచూచి భయపడటం గాని, మృత్యుగహ్వారంలో అడుగుపెట్టేందుకుగాని సంకోచించలేదు. ఆయన ముఖంలో ప్రశాంతత వుట్టిపడుతూవుంది.

భిక్షువులంతా ఆయన విహారంలో సమావేశమయ్యారు. ఆయన చాలా బలహీనంగా వున్నారు. వెళ్ళిపోతున్నట్లే కనిపించారు. కాని ఆయనలో ఒక ఆనందము, ఒక సంతృప్తి చిద్విలాసం చేస్తున్నవి.

"నేను వెళ్ళిపోయాక మీకందరికీ క్రొత్త అధ్యాపకు డెవరవుతారో నాకు తెలియదు. కాని ఒక్కటిమాత్రం గుర్తుంచుకోండి. మీరు చిత్రించే ప్రతి ఒక్కచిత్రమూ ఒకొక్క కావ్యమనుకోండి. మీలో మూర్తిభవించిన ప్రతి ఒక్కకళా సజీవమైన రసోత్పత్తినిలయమనుకోండి.

"మానవునకు అన్నిటికన్న ముఖ్యమైనది ఆత్మ అది మాత్రం గుర్తుంచుకోండి. ఆత్మే మనకు విజ్ఞానజ్యోతి. ఆత్మే

మన శరణాలయం, మీ ఆత్మపట్ల అవిశ్వాసంగా ప్రవర్తించ కండి. ఆత్మవంచన చేసికోకండి. కారణం, ఆత్మే మనల్ని పాలించేది.

"ఇక్కడ మనందరం ఎందుకు నివసిస్తున్నాం? మనల్ని మనం గుర్తించుకోడానికే. ఈ ఏకాంత పర్వతసానువుల ప్రాంతంలో మానవుడు స్వేచ్ఛగా విహరించగలుగుతాడు. స్వేచ్ఛ అంటే ఒక బాధ్యతనుండి తప్పించుకు పారిపోవడం కాదు. అది ఒక ప్రవాహంలాంటిది- జీవితాన్ని సజీవం చేసేటటువంటిదే స్వేచ్ఛ! మీ స్వేచ్ఛకూడా అలాంటిదాన్నే సృష్టించగల్గాలి. ఇక్కడ యీ అజంతాలో కావ్యాలలో పొదిగిన వేదాంతము వేరువేరు రూపాలలో, చిత్రాలలో కళ్ళకు కట్టినట్లు స్పష్టంగా కల్పించడం మీరంతా చూచే వున్నారు.

"ఇదే అంతిమయాత్ర. ఇదే మానవుడు చేరవలసిన సర్వోత్కృష్టమైన పరమానందం. ఇది చేరుకోటానికి మానవుడొక పవిత్రమార్గాన్ని అనుసరించవలసి వుంది. అదే తథాగతుని అనుసరణ." అని నెమ్మదిగా, అతి కష్టంమీద పలికాడు.

ఆ రాత్రంతా ఆచార్య విజ్ఞానంద్, ఆచార్య పద్మదత్ ప్రక్కనే వున్నాడు. సూర్యోదయం కావడానికి ఒక గంట ముందుగానే ఆచార్య పద్మదత్ పరమపదించాడు. ఆ వుదయమే ఆయన భౌతిక దేహానికి అంత్యక్రియలు జరుపబడ్డాయి. ఆ విహారాలన్నీ విచారంతో నిండిపోయినవి.

ప్రేమకుమారి కళ్ళు వాచేటట్లు ఏడ్చింది.

"నన్ను అన్ని సందర్భాలలోనూ అర్థం చేసుకుంది ఆయనొక్కడే. నాకు అడుగడుగునా ధైర్యం చెప్పి, ప్రోత్సాహపరచి, నాకు విజ్ఞాన భిక్ష పెట్టిన మహనీయుడు ఆయనే. ఇప్పుడు ఏకాకినై పోయాను." అని దిగ్గున విచారించింది.

బదరీనారాయణ ఆమెను ఓదార్చేందుకు ప్రయత్నించాడు. కాని ఆమె దుఃఖాగ్ని ఆరలేదు ఇలా వుంటూవుండగా ఒకరోజురాత్రి ఆమె మఠం విడిచి తన తల్లిదండ్రుల దగ్గరకు వెళ్ళింది.

బదరీనారాయణ విహారాలు, బౌద్ధారామాలన్నీ తిరిగాడు. ఎంతో కష్టపడి, ప్రతిచిన్న విషయానికి విశేషప్రాధాన్యమునిస్తూ షడ్దంతుని జాతకకథ చిత్రించాడు. ఆ తర్వాత బుద్ధునిచిత్రం చెక్కాడు. అది చాలా పెద్ద విగ్రహం బుద్ధుడు దృఢసంకల్పచిత్తుడై గంభీరంగా నిలబడి వున్నట్లుంది. "ఈయనే అసలు మనిషి" అన్న శబ్దం వినిపించినట్లయింది. ఆ విగ్రహంలో ఏదో మహత్తరమైన ఆకర్షణ, సౌజన్యము, అన్నిటికన్న దేనినైనా అర్థం చేసుకోగల గ్రహణశక్తి మూర్తీభవించి, చూపరులపై విచిత్ర ప్రభావం కల్పించేలా వుంది. అయోమయంలో గడుపుతున్న ప్రపంచంపట్ల దయగలిగినట్లు, ఔదార్యంతో తన విజ్ఞానాన్ని పునీతం జేసి ప్రపంచానికి చూపుతున్నట్లు ఆ విగ్రహంలో భావం ప్రకటితమౌతోంది.

బుద్ధుడు తన అర్థాంగినీ, తన పుత్రుణ్నీ ధర్మం అడుగుతున్నట్లుగా చిత్రించాడు బదరీనారాయణ. వారుభయుల

ముందు, ఒక పొడగరి, గంభీరమైన వ్యక్తి, విచారంగా, విన యంతో నుంచునివున్నట్లు గీచాడు. ఆయన భార్యలో పతి భక్తి, కొడుకులో తండ్రి నిర్గమనంపట్ల కంగారు పడినట్లు భావాలు ద్యోతకమవుతున్నాయి. ఈ భిక్షువు తనతల్లి నిట్లా దిగ్భ్రమ చెందేటట్లు, భయపడేటట్లు ఎందుకు చేయాలి అనే ప్రశ్నకూడా ఆబిడ్డ చూపుల్లో స్పష్టమవుతోంది.

బదరీనారాయణ బుద్ధ విగ్రహాన్నే - కూర్చున్నట్లు, ఇంకా అనేక పనులు చేస్తున్నట్లు వివిధ భంగిమల్లో అనేక చిత్రాల్ని గీచాడు. ఒకకలలో విహరిస్తున్నట్లు, కలలో చిత్రాల్ని గీస్తున్నట్లుగా, విచిత్రంగా, అద్వితీయ నైపుణ్యంతో ఎన్నో చిత్రాల్ని గీచాడు.

తర్వాత, బదరీనారాయణ యువతీయువకుల జంటను ఒక చిత్రంగా గీచాడు. ఒకరినొకరు గాఢంగా ప్రేమించుకొన్నారు వాళ్ళిద్దరూ పురుషుని కళ్ళల్లో మోహం తాండవిస్తోంది. కాని అది ఒకరికి చెరుపుచేసేదికాదు. హద్దుల్లోనే వున్నది. కాని స్త్రీ మొహంలో ప్రేమ దృగ్గోచర మవుతూంది. అది అమాయకత్వంతో నిండుకొనివుంది. అదే నిర్మలప్రేమ! ఆ ప్రేమే ఆమెను క్రొత్తభావాలను, క్రొత్త విధానాల నర్థం చేసికొనేటట్లు చేసింది...

# 35

తర్వాత ఒకరోజున ప్రేమకుమారి వచ్చింది. ఆమె బదరీనారాయణకు అభివందనం చేసింది. ప్రత్యభివందనముగా బదరీనారాయణ చిరునవ్వు నవ్వాడు. ఆమె వైభవం చూస్తే ఆమె యింతకాలమూ అక్కడే ఉంటున్నట్లు అనిపించింది.

"మీకు శుభవార్త తెచ్చాను. కమలతల్లి అయింది. కొడుకు పుట్టాడు" అని చెప్పింది ప్రేమ.

బదరీనారాయణ చేతిలో ఉన్న చిత్రాన్ని క్రింద పెట్టేసి గభాలున పొంగివచ్చే ఆనందముతో ప్రేమకుమారిని పట్టుకొన్నాడు. ఆమె చెప్పిన శుభవార్తకు పులకాంకితుడై పోయి ఆమెను ముద్దు పెట్టుకొన్నాడు.

"వెళ్ళి తల్లినీ, పిల్లాణ్ణి చూద్దాంపద" అన్నాడు.

"వద్దు, బదరీ రావద్దు మానాన్నగారు నిన్ను రానీయరు. ఆయనకు కోపం లేకపోయినా అంతకన్నా ఎక్కువగా బాధ పడుతున్నారు. ఏమేమిటో మాట్లేడేస్తున్నారు. జ్వరం వచ్చి సంధిలో మాట్లాడినట్లు ఏవో పిచ్చిమాటలు మాట్లాడుతున్నారు. మనిషి-ఏమిటో రోజురోజుకు చిక్కి శల్యమై పోతున్నారు."

బదరీనారాయణ బయటకు వెళ్ళిపోయాడు. ముఖం కందగడ్డలా ఎర్రబారింది. పెదవుల్ని పళ్లు నొక్కుతున్నాయి.

ఒక కొండరాయిమీద నుంచోని క్రింద పారుతున్న నదిలో నికి చూశాడు. అతని వెనకనే ప్రేమకూడా వచ్చింది.

"ఇంకేమిటన్నారాయన?

"చాలా అన్నారు. నీవు నమ్మినవారే నిన్నెక్కువ మోసం చేస్తారట. ఆయన నిన్ను కొడుకును చూసినట్లు ప్రేమించారట. తన యింటి గౌరవాన్ని మంటగలిపినందుకు ఆయన చాలా విచారిస్తున్నాడు. తనకున్న కొద్ది గౌరవం మంటగలిసిందని దురపిల్లుతున్నాడు. ఇపుడు తాను వ్రాస్తున్న గ్రంథాన్ని చూచి చాలా అసహ్యించుకుంటున్నారు."

బదరీనారాయణ అలాగే నుంచున్నాడు. నదిలో నీరు గలగల పారుతూ, అతని చెవులకో వింతధ్వనిలా వినిపించింది. కొంతసేపు అలాగే నుంచుండిపోయాడు. తరువాత గభాలున ప్రేమకుమారివైపు తిరిగి "వెళ్దాం పద, ముందు మీనాన్న గారిని చూడాలి" అని అన్నాడు.

వెంటనే ఆ కొండమీదనుండి క్రిందకు దిగాడు. ఆమె అతన్ని అనుసరించింది. మరికొంచెం సేపట్లో యిద్దరూ వాఘురానది దాటుతున్నారు.

# 36

రామగుప్తుడు తన బల్లముందు కూర్చుని వున్నాడు. అతడు కూర్చున్నస్థితి అతిదైన్యంగా వుంది. కనుబొమ్మలు బల్లవంక చూస్తూవున్నాయి. తల రెండుచేతులమధ్యా యిరుక్కుని వుంది. బదరీనారాయణ రావడం చూశాడు. మళ్ళీ తల వంచుకున్నాడు.

బదరీనారాయణ ఆయన దగ్గరకు వెళ్ళాడు. దుఃఖభారంతో క్రుంగిపోతున్న రామగుప్తుని చూస్తూ అతని ప్రక్కనే నుంచున్నాడు.

"వొలికిపోయిన పాలనుగురించి చింతిస్తున్నారా ?" అని అడిగాడు బదరీ. రామగుప్తుడు బదరీనారాయణ ముఖంలోకి సూటిగా చూశాడు. ఆ చూపులో ఒక అనిర్వాచనీయమైన భయం వెల్లడయింది.

"లేదు. ఎందుకూ చింతించడం ?" అని గద్గదస్వరంతో పలికాడు.

"నేను మహాపరాధమే చేశాను. నేనేకాదు. ఆపని ఎవరుచేసినా క్షమించ నొల్లని నేరమే. ఆ అపరాధం జీవితాంతకాలం వెన్నంటి బాధిస్తూనే వుంటుంది. దానికి తగినట్లు పశ్చాత్తాపం చెందాను. చేసిన తప్పిదాన్నిగురించి

చెప్పనలవిగానంత బాధ పడ్డాను. ఇప్పటికి జరిగినదానికి విచారిస్తూనే వున్నాను. ఒకవేళ నా జీవితాంతంలో ఆ పాపం సమసిపోతుందనా, లేక ఆ తప్పిదం మాఫీ అయిపోతుందనా అందుకు సంసిద్ధుణ్ణే. ఆరోజు రాత్రి నేనేం చేశానో, ఎందుకు చేశానో నాకు తెలియకుండానే జరిగింది. నాకారోజున మతి లేకుండా పోయింది. నన్ను మన్నించండి. మీరేం జేసినా సరే. కాని నా అపరాధాన్ని మన్నించండి," అని బదరీనారాయణ రామగుప్తుని ముందు మోకరిల్లి వేడుకొన్నాడు.

రామగుప్తుడు బరువుగా నిట్టూర్చాడు

"నీస్త్రీని, నీ బిడ్డను చూచేందుకు వచ్చావు, వెళ్ళి చూడు." అని చిరచిరలాడుతూ అన్నాడు రామగుప్తుడు.

బదరీనారాయణ అక్కడనుంచి లేచి కమలవున్న గది లోకి వెళ్ళాడు. కమల నిద్రపోతోంది.

బదరీనారాయణ ఆమెను నిద్రనుంచి లేపాడు. కళ్ళు విప్పి - అతన్ని చూచీ చూడటంతోనే ఒక్కసారి భయ విహ్వాలమైపోయింది. తరవాత కొన్ని నిమిషాలకుగాని ఆమె చూపులు చల్లబడలేదు.

"ఎలావుంది?" అని అడిగాడు, ఆమె ప్రక్కనే మంచంమీద కూర్చుంటూ "ఇలా పాలిపోయారేమిటి?" అని ఆమె అతన్ని ప్రశ్నించింది.

"మనసేం బాగుండటంలేదు."

"మీరు చిత్రించిన బుద్ధుడు, ఆయన ప్రేరేపణగూర్చి విన్నాను. మీరు చాలా బాధపడ్డారు."

"అవును. అబ్బాయి ఏడీ?"

"నీళ్లు పోసేందుకు మాఅమ్మ తీసికెళ్ళింది."

రెండు క్షణాలసేపు యిద్దరూ నిశ్శబ్దంగా వున్నారు.

"ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోండి. బొత్తిగా నీరసించిపోయారు" అనిఅంది కమల

బదరీనారాయణ చిన్నగా నవ్వాడు. "నీవూ అంతేగా? నీకూ వొంట్లో బాగుండటం లేదా?"

"నాకేం నేను బాగానే వున్నానుగా. బిడ్డను కన్న స్త్రీ సహజంగా బలహీనంగానే కనబడుతుంది; అయినా యీ బలహీనత యెన్నాళ్లు?"

అంతలో కమల తల్లి – ఏడుస్తున్న పసిబిడ్డను చేతుల్లో సముదాయిస్తూ లోపల కొచ్చింది.

"కమలా...చూడు; బిడ్డ ఎంతబలంగా వున్నాడో, వాడుపట్టిన ఆ గుప్పిట చూడు; ఏడు తప్పకుండా ఒకఉద్దండుడవుతాడు," అన్నాడు బిడ్డను చూచీ చూడటంతోటే – పారవశ్యం ఆపుకోలేక.

కమలతల్లి బదరీనారాయణను గుర్తించిందప్పుడు.

"ఇక్కడేంజేస్తున్నావు?" అని రంపంతో కోసినట్లు, మహాకోపంగా ప్రశ్నించిందామె.

"వారిని నేనే తీసుకొచ్చానమ్మా," అని గుమ్మం ప్రక్కనే నుంచున్న ప్రేమకుమారి అంది.

"ఇక వెళ్ళిపోవడం మంచిది."

బదరీనారాయణ ఆమె మాటల్ని లక్ష్యపెట్టకుండా కొడుకును చేతుల్లోకి తీసుకున్నాడు.

"చూశావా? కమలా! చక్కగా గుమ్మడిపండు వున్నట్లు వున్నాడు. అన్నీ వాళ్ల తాతగారి పోలికలే," అన్నాడు బదరీనారాయణ కమలవంక చూస్తూ.

"మిమ్మల్నే - యికవెళ్ళండి" ఆజ్ఞాపిస్తున్నట్లు చెప్పింది కమల తల్లి.

బదరీనారాయణ కొడుకును తిరిగి ఆమె కందించేశాడు. కమలవంక తిరిగాడు.

"ఏదైనా అవసరమైతే నాకోసం కబురంపించు. నీ ఆరోగ్యం జాగ్రత్త."

బదరీనారాయణ ఆమెను ప్రేమించలేదు. ఆ సంగతి కమలకూ తెలుసు. ఇప్పుడు ఆమెపట్ల కేవలం చనువుగా, జాలిగా వుండేందుకు ప్రయత్నిస్తున్నాడు.

అందరికీ వందనాలర్పించి, బదరీనారాయణ ఆయింట్లో నుంచి బయటకు వెళ్ళాడు. తిన్నగా రామగుప్తుని గదిలోకి వెళ్ళాడు.

"అజంతాకు వెళ్దాం, వస్తారా?" అని అడిగాడు రామగుప్తుణ్ని.

"ఎందుకు?"

"మరేంలేదు. మీరు అక్కడ బౌద్ధచిత్రాల్ని, శిల్పాల్ని చూస్తే బాగుంటుందేమోనని నా అభిప్రాయం."

"అందువల్ల నాకేం వుపయోగం?"

"రండి; ఎంతవరకు ఉపయోగం? అనే నిర్ణయం తర్వాత జరుగుతుంది. "అజంతాకు వెళ్ళడమా? వెళ్ళకపోవ

డమా? అనే సందిగ్ధంతో చాలాసేపు ఆలోచించి, చివరకు వెళ్దామనే నిర్ణయించుకున్నాడు రామగుప్తుడు. వెంటనే లేచాడు. వెళ్దాం, పద" అన్నాడు.

ఇద్దరూ కలిసి అజంతాకు వెళ్ళారు.

బదరీనారాయణ రామగుప్తుడ్ని ఒక విహారంనుండి మరియొక విహారానికి, ఒక ఆరామంనుండి మరొక ఆరామానికి తీసికెళ్ళాడు. రామగుప్తుడు కుడ్యచిత్రాలెన్నిటినో చూచాడు. ఆ చిత్రాల్లో దాగిన గాధల్ని అవగాహన చేసికున్నాడు. కాని బుద్ధుని చిత్రం, ఆయన ప్రేరణశక్తి చూచాక అక్కడనుండి కదలబుద్ధికాలేదు. దాన్ని చూసి ఆశ్చర్యపోతూ అలాగే నుంచుండిపోయాడు కొంచెంసేపు.

"దీన్నిగురించి నేనూ విన్నాను. దీన్ని చిత్రించేందుకు నీకాంతో గట్టి కృషిచేశావు. ఇది నిన్ను నిర్మల చిత్తుణ్ని చేసిందా?"

"అవును, చేసింది. ముందు నాలో ఎంతో వుద్రేకం వుండేది. ఈ చిత్రం గీచాక నాలోవున్న క్రూరభావాలు, ఉద్రేకస్వభావం అన్నీ సమసిపోయినై. క్రమేపీ నాలో ఆత్మానుగతమైన శాంతి లభ్యమౌతోందనీ, నాలో నిర్మలత్వం నాటుకొంటోందనీ తెలుసుకోగలిగాను."

రామగుప్తుడు నిగూఢభావసమ్మిశ్రితమైన చూపుతో బదరీనారాయణవంక చూశాడు.

"నీవు చేసినపాపం యెన్నటికీ మరవజాలనిది క్షమార్హంకాని నేరం చేశావు."

"కావచ్చు. కాని దానివల్ల నేనెంతో బాధపడ్డాను. మృత్యువు ఆహ్వానించేవరకు బ్రతకాలనే కోరుకుంటాను. అంతకుమించి నేను వేరే కోరేదేమీ లేదు."

తరవాత రామగుప్తునికిబుద్ధుని విగ్రహంచూపించాడు. రామగుప్తుడు ఆ విగ్రహాన్ని పరిశీలించి ఒక్క నిట్టూర్పు విడచాడు.

"దీన్నిబట్టి నీవెంత పరితాపం చెందిందీ తెలుస్తోంది. అయితే నువ్వు మారిపోయావన్నమాట - ఏం బదరీ?"

షడ్దంతుని జాతక కథలీన్ని, కూర్చుని వున్నట్లు చెక్కిన బుద్ధుని శిల్పాన్నీ భార్యనూ, బిడ్డనూ వీడ్కోలడిగి పుచ్చుకుంటున్నట్లు - యీ చిత్రాలన్నీ బదరీనారాయణ రామ గుప్తునికి చూపించాడు.

"ఇందులో చూపించదలచిన అభిప్రాయం ఏమిటి?" అని రామగుప్తుడు ప్రశ్నించాడు-ఆఖరి చిత్రాన్ని చూస్తూ.

"నేను క్షమాభిక్ష అర్థిస్తున్నాను. కాని నాకా అనుగ్రహం లభిస్తుందనుకోలేదు. అంతేకాకుండా, ఆ కుడ్య చిత్రముంది చూశారూ! అది తండ్రినుంచి, హక్కు పొందమంటూ బిడ్డచే తల్లి అడిగిస్తూ అన్న చిత్రం. నా బిడ్డ నా నుంచి ఏదైనా పొందాలని కోరేపక్షంలో నేనేమివ్వగలను?- ఒక్క పాపం మినహా!"

"నీ పశ్చాత్తాపాన్ని ప్రసాదించవచ్చు, బదరీ. నీ పాపం అసామాన్యమైంది. దానికై నీవు యింకెంతో బాధ పడతావు. కాని, ని పాపానికి నీ బిడ్డ బాధపడకూడదు."

"వాడు ప్రేమఫలంవల్ల జన్మించినవా
ఆ బిడ్డ కేవలం మోహపారవశ్యానికి ప్రతిరూపం."

"కాని నీవు వాణ్ని యింకోరకంగా పెంచి పె
చెయ్యి. వాణ్ని ప్రేమకు ప్రతిబింబంగా త
చెయ్యాలి."

"ఆ బిడ్డను నా కిస్తారా?"

"అప్పుడేకాదు. ఇంకొంచెం పెద్దవాడయ్యాక తీసి కెళ్ళి, ఏ పద్ధతిలో పెంచవలసివుంటుందో అలా పెంచు కుందువుగాని."

... ... ... ...

రామగుప్తుడు యింటికి తిరిగి వచ్చేడు. అతని పెదవులపై చిఱునవ్వులాస్యం చేస్తూవుంది. గబగబ తన గదిలోకి వెళ్ళి బల్లమీద కూర్చుని, తన కాగితాలీ్ని కలాన్ని తీసుకొని వ్రాయడం మొదలుపెట్టాడు. అలా చాలాసేపు వ్రాశాడు. తరవాత కొంతసేపటికి అతని భార్య, ప్రేమకుమారి యిద్దరూ భోజనానికి రమ్మని పిలచేందుకు అక్కడ కొచ్చారు. వారిద్దర్నీ చూశాడు రామగుప్తుడు.

"పాపి అయిన తరవాతనే మానవుడు మహర్షిగా మారతాడు. అదే మన మానవుని జీవిత రహస్యం. ఈ సూత్రాన్ని ప్రపంచమంతా స్పష్టంగా అంగీకరిస్తుంది. బదరీని నా అంతరంగంలో క్షమించాను. అతని దోషాన్ని మరచి పోయాను. అతనిలో మూర్తీభవించిన ప్రశాంతత నన్ను ముగ్ధుణ్ని చేసింది. ఇప్పుడు నాకెంతో ఆనందంగా వుంది."

అంతే! ప్రేమకుమారిగాని, ఆమె తల్లిగానీ, యీ మాటలు వింటూ నుంచున్నారేగాని మరేమీ వ్యాఖ్యానించలేదు.

... ... ... ...

# 37

ఎందరెందరో క్రొత్తవారు అసంఖ్యాకంగా వచ్చి చేరుతున్నారు. పీడన, దోపిడి విధానాలకు తట్టుకోలేక అజంతాలో ఆశ్రయంకోసం పారిపోయి వచ్చిన జనాభా - వాళ్ళంతా హింసాత్మక చర్యలనుగురించీ, క్రూరవిధానాలతో, రక్తపు ఏరులు పాఱిన విషాద గాథల్ని గురించి ఒకరికొకరు చెప్పుకునేవారు.

అగ్నిపర్వతాలనుండి రాయికరిగి పారే ద్రవంవంటివాళ్ళంటూ తను ప్రాంతీయులను గురించి వ్యాఖ్యానించేవారు. మరేపనీ చేయడం చేతకాక, చేసేందుకు మరేపనిలేక, ఎప్పుడు చూచినా చంపటం, వినాశనం చెయ్యడమే వాళ్ళ నిత్యకాండగా వుండేది. ఉత్తర ప్రాంతాల రాజ్యాలన్నింటినీ ధ్వంసం చేసి పారేశారు. వాళ్ళెక్కడకు వెళ్ళినా కొల్లగొట్టడం, స్త్రీలను చెఱపట్టడం, పురుషుల్ని పట్టుకొని ఊచకోతకోయడం, యిదే వాళ్ళపని. పైకి భిక్షువుల్లా కనిపిస్తూండేవారు. కాని ప్రవర్తనచూస్తే మట్టుకు రాక్షసుల్ని మరపించేవారు.

అందువల్ల ఆ ప్రాంతాల్లో జీవనం దుర్భరమై, బ్రతుకు దుస్సహమై, అజంతాకు పారిపోయి వచ్చారు చాలామంది. తమకున్నది కాస్తా కోల్పోయి, రిక్తహస్తాలతో పస్తులతో వుంటూ ఒకరోజువుంటే ఒకరోజు లేకా - వున్న రోజునైనా చాలీచాలని తిండి - అదీ ఉడికీ ఉడకని పదార్థం - ఇలాంటిది తిని, అనారోగ్యంతో, దుర్భర దారిద్ర్యంతో నిస్తేజులై, నిర్వ్యాపారులై, నిస్సహాయులై - అనారోగ్యంతో క్రుళ్ళిపోయారు. అలాంటి నిర్భాగ్యజనం అజంతాలో ఆశ్రయం లభిస్తుందని, బ్రతికినన్నాళ్ళూ ప్రశాంతంగా జీవించవచ్చనీ కొండంత ఆశతో వచ్చారు.

అలా తరలివచ్చిన కాందిశీకుల నందరినీ, ఆదరించి, వారికి తగిన వసతుల్ని కలిగించారు. అనారోగ్యాల్ని రూపుమాపేందుకు బౌద్ధభిక్షువులు తమ శాయశక్తులా ప్రయత్నించారు. 'మానవసేవే మాధవసేవ! మానవసేవే పరమ ధర్మము'నే తథాగతుని సూత్రాన్ని తు. చ. తప్పక పాటిస్తూ, ఆ బుద్ధభగవానునికి తగిన వారసులమనే ఖ్యాతిగన్నారు.

కాని ఆ కాందిశీకులు తమతో మామూలు అనారోగ్యాల్ని కాక ఒక క్రొత్తరకం వ్యాధిని వెంటబెట్టుకొచ్చారు. అదే కలరా. వాళ్ళలో చాలామందికి డోకులు వెళ్ళాయి. కొట్టుకునేవారు. అంతలో వెక్కిళ్ళు వచ్చేవి. బాధతో మూలుగుతూ వుండే ప్రక్కనున్నవాళ్ళకు భయంవేసేది. మరి కొంతసేపటికి నాడి సహజతత్వం తప్పేది. మాంసపు కండరాలన్నీ కుంచించుకుపోయి, శరీరమంతా తిమ్మెరలెక్కిపోయేది.

ఈ వ్యాధిని అరికట్టేందుకు ఎన్నో రకాల మూలికలు ఉపయోగించారు. కాని ఒక్కటీ ఫలించలేదు. వైద్య భిక్షువులు అహర్నిశలు, విశేషంగా శ్రమించి ఎంతగానో పని చేశారు రాత్రింబవళ్లూ నిద్రాహారాల్లేకుండా పని చేశారు. ఎన్నో మందులు నూరారు. ఎన్నో కలగాపులగం చేసి వాడారు కాని వ్యాధిమాత్రం లొంగలేదు. కాగా ఆ కాందిశీకుల్ని రక్షించాలని ప్రయత్నించిన బౌద్ధ భిక్షువుల్లో కొందరికి కలరా సోకింది. అలా కలరావ్యాధికి గురయినవారిలో ప్రేమకుమారి ఒకర్తె.

బదరీనారాయణ ప్రేమకుమారికి ఒక బానిస చాకిరీ చేసినట్లు చేశాడు. ప్రేమకుమారికి మతి స్తిమితం లేదు. వెర్రి పుట్టినట్లు మాట్లాడసాగింది. అర్థం పర్థంలేని పెద్ద పెద్ద మాటలు మాట్లాడింది. కాని గొంతుపటుత్వం నీరసించిపోయింది. ఆమె వూపిరి పీల్చుకోవడమే క్రమం తప్పింది. బదరీనారాయణ ఆమె ప్రక్కనే కూర్చుని, ఆమెను రక్షించుకోవాలన్న పట్టుదలతో వ్యాధితో పోరాటం సాగించాడు. ఆమెకు వాంతులయినప్పుడు తన చేత్తో పట్టుకొని, ఆమెవున్న తావును తానే స్వయంగా శుభ్రపరచేవాడు. ఆమెకు చేయవలసిన సకలోపచారాలూ చేశాడు.

మధ్య మధ్య తన హృదయంలో ప్రేమకుమారిని రక్షించాలనే ఉద్వేగం కొద్దీ గోపీకుమార్ వెంట స్వయంగా వెళ్ళి మూలికల్ని వెదికించేవాడు.

"ఈ మాయదారిరోగమే రావాలా? ఇంకోకటేదైనా రాకూడదూ??" అని గోపీకుమార్ పళ్ళు పటపటలాడిస్తూ అన్నాడు.

బదరీనారాయణ బుజాలెగరవేయడం తప్ప మరేమీ మాట్లాడలేదు.

ప్రేమకుమారికూడా యితరుల మాదిరిగానే క్రమ క్రమంగా నీరసించిపోయింది. ఆమె బ్రతకటం సంశయస్థితి లోకి వచ్చేసింది.

ఆనాటి మధ్యాహ్నం ఆ మైకమునుండి కొద్దిగా తెప్ప రిల్లేసరికి, నెమ్మదిగా, కొంచెం స్థిరసంకల్పంతో, "బదరీ, నేను నిన్ను విడిచిపెట్టలేను బదరీ. నిన్ను ప్రేమించాను బదరీ; నాకు చనిపోవాలనిలేదు, బదరీ. మరణిస్తున్న రాణి చిత్రం గీయాలని తహతహగా వుంది బదరీ, నన్నాపని చెయ్యనీ, ఏం బదరీ? అంటూ నీరసంతోవున్నా, ఎంతో స్థిరసంకల్పంతో పలికింది. ప్రక్కమీదనుంచి లేవాలని ప్రయ త్నించింది. కాని శక్తి చాలకపోవటంవలన కొద్దిగా లేచి మళ్లీ ప్రక్కమీద పడిపోయింది.

"బదరీ, నన్ను నీ చేతుల్లోకి తీసుకో బదరీ, నన్ను పట్టుకో బదరీ. నిన్ను నేను ప్రేమిస్తున్నాను బదరీ"

ఇదంతా చూచేసరికి బదరీనారాయణ ఉన్మాదివై పోయినట్లయ్యాడు. ప్రేమకుమారి అలా వారంరోజులు బాధ పడింది. చివరికామె ప్రాణాలు అనంత విశ్వంలో కలిసి పోయాయి.

బదరీనారాయణ ఆమె దేహాన్ని వొంటరిగా వాఘురా నది దగ్గరకు తీసుకువెళ్ళి అక్కడే దహన సంస్కారాలకు తగిన ఏర్పాట్లు చేశాడు.

# 8

అక్కడనుండి, వాఘురా దాటి యీ విషాద వార్త అందజేయడానికీ, కూతురు చితి వెలిగించడానికి రావలసిందని చెప్పేటందుకూ రామగుప్తుని ఇంటికి వెళ్ళాడు. అక్కడకూడా అందరూ కలరా తగిలి చావుబ్రతుకుల్లో ఉన్నారు.

"నీ బిడ్డను రక్షించు. ఎలాగైనా నీ బిడ్డను పెంచి పెద్దవాణ్ని చెయ్యి. నీవు కాపాడితే, మేమంతా మళ్ళీ నీ బిడ్డలో జీవిస్తాము" అని అన్నాడు రామగుప్తుడు బదరీనారాయణతో.

కమల ఒక్కమాటకూడా మాట్లాడలేదు. ఆమెకూడా బాగా సుస్తీతోనే వుంది. మౌనంగా బదరీనారాయణవంక ఆదరకంగా చూచింది. ఆమె తల్లికూడా మెల్లగా తనలో తానే కుళ్ళికుళ్ళి ఏడుస్తూ, తన బాధ ఎక్కువై మూల్గసాగింది.

ఆయింట్లో అందరూ మంచాలుపట్టి దీనస్థితిలో వుండటం కళ్ళారా గాంచిన బదరీనారాయణ ఏం జేయటానికీ దిక్కు తోచలేదు నిస్సహాయుడై పోయాడు. తన అసమర్థతకు నొచ్చుకొంటూ రక్తమొచ్చేలా పెదవి కొరుక్కొని,

నేలమీద కూలబడిపోయాడు. పొర్లుకొచ్చే దుఃఖాన్ని ఆపు కోలేక చిన్నపిల్లవాడిలా వెక్కి వెక్కి ఏడ్చాడు.

తన కొడుకును తీసికొని వాఘురా నదిదగ్గరకు వెళ్లాడు. అక్కడ నదిలో కొడుకును స్నానం చేయించాడు. తరువాత ప్రేమకుమారి చితిదగ్గరకు వెళ్లి, చితి వెలిగించాడు. మరి కొంచెం సేపట్లో మంటలు వ్యాపించి ప్రేమకుమారి మృతకళే బరాన్ని తమలో ఆహుతి చేసికున్నాయి.

ఆ మంటలు క్రమంగా పెద్దవవుతున్న కొద్దీ అతని అంతరాళంలో – ఏదో మృతి చెందుతున్నట్లుగా భావిం చాడు. ఏడుద్దామన్నా కళ్ళల్లో నీటితడి అయిపోయింది. అంతేకాదు. అతని మనస్సు, హృదయం, ఆత్మ అన్నీ మోడువారినై. అతని ధైర్యం సన్నగిలిపోయింది.

బదరీనారాయణ తన బిడ్డతోపాటు బౌద్ధమతానికి తిరిగి వచ్చాడు.

"గోపీ, నాబిడ్డను నీవు బ్రతికించాలి" అని కోరాడు. "బదరీ అలసిపోయి ఉన్న గోపీ శూన్య దృక్కులతో చూశాడు. చేసిన కృషి సఫలం కాకపోవడంతో నిరుత్సాహ పడిపోయాడు.

"నీవేం జేసినా సరే, నా బిడ్డనుమాత్రం బ్రతికించు."

"నా శక్తి వంచన లేకుండా ప్రయత్నిస్తాను, బదరీ"

బదరీనారాయణ కొడుకును వొళ్లోపెట్టుకొని కూర్చొ న్నాడు. భిక్షువులంతా క్రొత్తమూలికలేమైనా దొరుకుతా

యేమోనని చాలా వెదికారు. కానీ ప్రయోజనం లేకపో యింది.

అంతలో అనుకోకుండా ఒక క్రొత్తమొక్క కనిపించింది. అందరిదృష్టి దానిపైకి మళ్ళింది. అదొక క్రొత్తరకం మొక్క. వాసనకూడా క్రొత్తగానే ఉంది. మొక్క పచ్చగా చక్కగా, నేవళంగా వుంది.

భిక్షువులు ఆ మొక్కను నూరి ఆలివ్‌నూనెతో కలిపి దాన్ని ఉపయోగించారు. కలరా తక్కున కట్టడిపోయింది. రకరకాలైన అనారోగ్యాలన్నీ క్రమంగా తగ్గుముఖం పట్టినై.

వ్యాధిగ్రస్తులైన వారంతా తిరిగి ఆరోగ్యవంతులు కాజొచ్చారు. వాళ్ళకు ఆహారంగా జావ కాచిన పాలు యిచ్చారు. అందువలన వ్యాధిగ్రస్తులైన వారంతా తిరిగి పరిపూర్ణవంతమైన ఆరోగ్యం పొందారు.

బదరీనారాయణ కొడుకు బ్రతికాడు.

ఎంత త్వరితంగా కలరా వ్యాపించిందో అంత త్వరితంగానే తగ్గిపోయింది. కానీ తగిన సుంకమన్నట్లు ఎందరోన్నో తనపొట్టన బెట్టుకుంది. వయోవృద్ధులైన కొద్దిమంది భిక్షువులు మాత్రం సజీవులై వున్నారు. రామగుప్తుని కుటుంబంలో అతని యిల్లాలు, కూతురు కమలకూడా యీ ప్రపంచంతో ఋణం తీరిపోయింది. ఒక్క రామగుప్తుడే మిగిలాడు. ఇప్పుడు రామగుప్తుడుకూడా అజంతాకు వచ్చి అక్కడే వుంటున్నాడు. ఎవరితోనూ మాట్లాడేవాడు కాదు. ఎప్పుడు చూచినా వ్రాస్తూనే వుండేవాడు.

# 39

అజంతాలో అనారోగ్య వాతావరణం పూర్తిగా తొలగిపోయాక. బదరీనారాయణ మరణావస్థలో ఉన్న రాణిని చిత్రించాడు. తన కళ్ళముందు ప్రేమకుమారిని, మనస్సులో ఆమె రూపాన్ని వూహించుకొని, ఆమెను ప్రేమ పొర్లువారుతున్నట్లూ రోజురోజుకూ క్రుంగి కృశించి పోతు న్నట్లూ, తరువాత మరణిస్తున్నట్లూ గీచాడు.

బదరీనారాయణ ఆత్మలేని వ్యక్తి మాదిరిగా గడప జొచ్చాడు. నిర్వికార జీవితం గడుపుతున్నాడు. ఆచార్య విజ్ఞానంద్ బదరీనారాయణను పూర్తిగా అవగాహన చేసి కొన్నాడు. అందువల్ల బదరీనారాయణనే చిత్రశాలకు ప్రధానాచార్యులుగా నియమించారు. ఆచార్య పద్మదత్ బోధించిన పద్ధతిలోనే బదరీనారాయణకూడా బోధించాడు.

ఎందరో క్రొత్త కళాకారులేతెంచారు. ఎందరో శిల్పులు, ఎందరో చిత్రకారులు, విభిన్నకళల్లో దీక్షైనవా రెందరో వచ్చారు. బౌద్ధారామాన్ని విశాల మొనర్చవలసిన అవసరం ఆచార్య విజ్ఞానంద్ గుర్తించారు.

క్రొత్త విహారాలేర్పడాలి. క్రొత్త ఆరామములు నిర్మి తాలు కావాలి. భిక్షువులు ఆ కార్యక్రమాన్ని ప్రారంభిం చారు. ఏవో ప్లాన్లు వేశారు.

కట్టడాల ప్లాన్లు వేసేవారంతా సమాలోచనచేసి ఒక కార్యక్రమం రూపొందించారు. ఇరుగుపొరుగు గ్రామాల నుండీ, పట్టణాలనుండీ, నాటకరాజు ఎందరో కూలీలను పంపించాడు. అప్పుడు నిర్మాణం అన్ని రంగాలలోను ప్రారంభమైంది.

కళాకారులంతా తమ ప్రావీణ్యాన్ని ప్రదర్శించాలనే కార్యదీక్షతో పనిచేశారు. అచిరకాలంలోనే ఆ కొండ రూపురేఖలే మారిపోయిన్నై. స్తంభాలు వెలిశాయి. వరండాలు ఏర్పాటయినాయి. గుహలు తొలచబడ్డాయి. రాతిపనుపుల చెక్కడాలయిపోయాయి. హాలులన్నీ వివిధ రకాలైన చిత్రాలతో, శిల్పాలతో విప్పారేటట్లు చేశారు కళానిధులంతా. ఒక నూతనశోభ, ఒక నూతన దీధితి, ఒక నూతన వికాసం వెల్లివిరిసింది. అలా తయారయేందుకు కొన్ని సంవత్సరాలు పట్టింది. కానీ ఆ శోభ కలకాలం చిరస్థాయి కాగల తీరుతెన్నులు అప్పుడే ద్యోతకమయ్యాయి. గుహల నిర్మాణం పూర్తయిపోయింది. మిగతావాళ్ళు తమ పనులు నిర్వహించేందుకు ఉద్యమించారు. కళాకారులు గోడలమీదా, అరుగులమీదా అవకాశమున్న ప్రతిచోక్కచోట చిత్రాలు గీశారు. శిల్పులు బుద్ధుణ్ణి, బోధిసత్వుల్ని చెక్కారు. అదో సజీవ సద్భావవిలసితమైన ప్రాంతంగా రూపొందింది. నూతనోత్సాహం, నూతన వికాసం సర్వత్రా వెల్లుబికింది.

ఆచార్య విజ్ఞానంద్, బదరీనారాయణలు మానవ జగత్తు సౌందర్యాన్ని, ఆనందాన్ని కళ్ళారా గాంచుతూ జీవితయాత్ర సాగిస్తున్నారు. ఆచార్య విజ్ఞానంద్ చాలావరకు

పండిపోయారు. బదరీనారాయణకు దాదాపు సగం ప్రయాణం గడచిపోయింది. ఆయన తల వెంట్రుకలన్నీ నెఱిసినాయి. ముఖంలో ముడతలవీ ఆరంభమైనాయి. మిగతావారు కవి దేవపాల్, వైద్యుడు గోపీకుమార్ వయస్సులో ఏళ్ళు గడచి బాధ్యతలెక్కువ కావడంవల్ల, మనుష్యుల దేహ పాటవం సన్నగిల్లింది.

వెంకన్న, ప్రభుఘోషు, ఆంజనేయుడు తదితరులంతా ఆ జ్వరంతో యిహ లోకయాత్ర ముగించుకొని వెళ్ళి పోయారు. చిరకాలంనుంచి వుంటున్నవారంతా సహచరులు గానే వుంటూ సహజీవనమే కొనసాగిస్తున్నారు. లోప భూయిష్టమైన తమ గతాన్ని స్మృతిపథాన వుంచుకొని, భవిష్యత్తుకై తప్పటడుగులు వేయని నడక సాగించారు.

# 40

బదరీనారాయణ కొడుకు క్రమంగా పెరిగి పెద్దవాడవు తున్నాడు. యువక భిక్షువుల్లో అతనొకడు. అతని పేరు కమలా నంద్. కళల్నిగురించి చిన్నతనంనుంచే అధ్యయనం ప్రారం భించాడు. గుడ్డలమీద గబగబ బొమ్మల్ని గీచేవాడు. అలాగే కొంచెం పెద్దరాళ్ళను పగలగొట్టి ఏవో బొమ్మల ఆకృతి వచ్చేటట్లు తయారు చేసేవాడు. తరువాత కొద్దికాలానికే కుంచె నుపయోగించి చిత్రాలు గీచాడు. ఉలి నుపయోగించి శిల్పాలు చెక్కడంకూడా ప్రారంభించాడు.

ఆ కృషిలో మొట్టమొదట యక్షిణీ యక్షుల గాథల్ని చిత్రించాడు. తర్వాత జాతకకథలు వేశాడు. తండ్రి నేర్పడం, కొడుకు నేర్చుకోవడం- సాగిపోతోంది.

ఇప్పుడు ఆచార్య విజ్ఞానంద్ తర్వాత ప్రముఖ అధ్యాపకుడు బదరీనారాయణే. బదరీనారాయణపట్ల భిక్షువులందరికీ అచంచలవిశ్వాసం. ఎనలేని గౌరవం, చెప్పనలవిగాని వినయ విధేయతలు కనబరచేవారు. విద్యార్థులు ఎన్నో వివాదాలతోనూ, వొకరినొకరు అర్థం చేసుకోలేని అజ్ఞానాంధకారంతోనూ, ఎన్నో చిక్కులలో యిరుక్కొని, ఆయన దగ్గర కొచ్చేవారు. బదరీనారాయణ వాళ్ళు చెప్పిందంతా శ్రద్ధగా, ఓర్పుగా విని, వాళ్ళకు అమూల్యమైన సలహాలిస్తుండేవాడు. వేదాంతసారాన్ని నూరిపోసి, వాళ్ళ హృదయాలను తేలికపరచేవాడు. వాళ్ళ జీవితాలలో నూతనకాంతిని ప్రసరింపజేసి ఆనందభరితుల్ని చేసేవాడు. ప్రతి చిన్న విషయానికీ అతడు వినిర్మలమైన నవ్వు కనబరచేవాడు. తాత్వికవేత్తలా కలగంటున్నట్లు, అంతర్గోళాలు పరిశీలిస్తున్నట్లు వుండేది ఆయన చూపు. ఆసందర్భంలో ఆయన్నుచూచి ఆయనొక బోధిసత్వునిగా చిత్రించారు. వారిలో ఒక నూతన తేజాన్ని ప్రేరేపించేవాడు ఆయనలో అణువణువునా కనికరము, జాలి మూర్తీభవించి వుండేవి. విద్యార్థులు ఆయనలో కరుణార్ద్ర స్వభావాన్ని కీర్తించేవారు.

బదరీనారాయణ తరచుగా నదీతీరాన్నే అటూయిటూ తిరుగుతూ వుండేవాడు. ఇప్పుడు ఆయన హృదయంలో బాధ అనేది యీషణ్మాత్రంకూడా లేదు. ఆయనలో ప్రశాంతత,

నిర్మలత నిండువారి వున్నాయి. ఆయన మనస్సునుండి గత మంతా సంపూర్తిగా అదృశ్యమైపోయింది. నిర్వాణాన్ని గురించి ఆలోచించేవాడు. వినీలాకాశంవంక నిశ్చల నేత్రాలతో పరికిస్తుండేవాడు. ఆయనలో ప్రశాంతత, వినిర్మలత రోజురోజుకూ అభివృద్ధి కాసాగింది.

అప్పుడప్పుడు కమలానందుడు తండ్రి దగ్గరకు వచ్చేవాడు. తండ్రీ కొడుకులిద్దరూ బుద్ధుణ్ని గురించి, చిత్రలేఖనం శిల్పాలు చెక్కడం, వాఘురానది నిర్వాణంలో నిబిడీకృతమైన మహత్తర సత్యాలు, వివిధ ప్రదేశాలగురించీ, మరణించిన జనాభాలో మహాసీయుల గురించీ - తరచుగా మాట్లాడుకునేవారు. అప్పుడప్పుడు రామగుప్తుడుకూడా వారిద్దరితోపాటు కూర్చునేవాడు. కాని వయస్సు మరీ ముంచుకురావడంవలన ఎప్పుడో తప్ప, సహజంగా ఎప్పుడూ మౌనంగానే వుండేవాడు. తండ్రీ కొడుకులిద్దరూ మాట్లాడుకొంటూవుంటే, తను వింటూ మధ్య మధ్య తృప్తిగా నవ్వుతూ వుండేవాడు. కొన్ని వేళల్లో గోపీకుమార్, దేవపాల్ కూడా వచ్చేవారు. వాళ్ళుకూడా నిన్న జరిగిన మధురస్మృతులగురించీ, రేపు పై పెట్టుకున్న ఆశలు, కోరికల గురించీ మాట్లాడుతుండేవారు. వాళ్ళ కంఠస్వరాలలో విచారచ్ఛాయలు గానీ, కర్కశత్వపు జాడలుగాని ఏమాత్రం వుండేవికావు.

# 41

ఒకరోజున బదరీనారాయణలో ఏదో ఉద్వేగం వెల్లు బికింది. ఆయన హృదయము నూతనసృష్టి చేయాలని పర వళ్ళు త్రొక్కింది. ఆ ఉద్వేగాన్ని అదుపులో పెట్టుకుంటూ ఒక మహత్తర చిత్రాన్ని చిత్రించటం ప్రారంభించాడు. చివరకది పూర్తయ్యేవరకూ విశ్రాంతి అనేదికూడా లేకుండా పట్టుదలగా పనిచేసి తయారుచేశాడు.

ఆ విగ్రహం చాలా బ్రహ్మాండముగా వున్నది. అవ యవాల చిత్రణ సమనిష్పత్తిలో ఉంది. భావగాంభీర్యము, రంగుల చిత్రణ స్పష్టంగా, ఏవైవిధ్యానికీ తావులేని పద్ధతిలో సమకూర్చబడ్డాయి. సుందరమైన ముఖారవిందం, విశాలమైన నుదురు, ఆలోచనలో లీనమైన అర్ధనిమీలిత నేత్రాలు, గంభీరతను చాటే పెదవులు-చక్కగా ఉన్నాయి. ముఖంలో పవిత్రత స్పష్టంగా గోచరమాతోంది. నల్లగా పొడవైన జుట్టు బుజాలపై వ్రేలాడుతోంది. నడినెత్తిపై ఇంద్రనీలంవలె చిన్నముడి వుంది. దేవలోకములో నాట్యం చేస్తున్నట్లుగా, చేతిలో నీలంపుకమలము, నిర్మలగుణ చిహ్నంగా కుడిచేతిలో ఉంది. యువకులకుండే గుణగణాలు, ఉత్తమవంశ జననం, మహత్తర వినయసంపద అన్నీ ఆ చిత్రములో ముమ్మూర్తులా మూర్తీభవించి వున్నాయి.

ఆ చిత్రంలో సౌహార్ద్రము, సౌజన్యము, సంగ్రహణ శక్తి ప్రేమ అన్నీ ద్విగుణీకృతోత్సాహం చేస్తున్నాయి. ప్రశాంతత, నిర్మలత్వం స్పష్టమవుతున్నాయి.

ఆ అతిలోక సుందర విగ్రహం చుట్టూ, ఎందరో స్త్రీ పురుషులు, రాజులు, సైన్యాధిపతులు, భక్త కోటి అందరూ బారులుతీరి భక్తిగౌరవాలలో నుంచు న్నట్లు చిత్రించబడింది. ఆ జనంచుట్టూ కన్నులపండువుగా పచ్చని వృక్షసముదాయం ఏపుగా పెరిగిఉన్నట్లు గీచాడు. అశోకతరువు, బోధివృక్షం ఆకులు సహజత్వాన్ని ప్రతిబిం బిస్తున్నాయి.

ఇలా ఆ చిత్రమంతా తయారించడం పూర్తయ్యాక బదరీనారాయణ శతవృద్ధుడైన ఆచార్య విజ్ఞానంద్, రామ గుప్తుడు, దేవపాల్, గోపీకుమారులవద్దకు వెళ్ళి, తనచిత్రం చూడవలసిందిగా రమ్మని చెప్పి అందర్నీ తీసికొచ్చాడు.

నడిచే ఓపిక లేకపోయినప్పటికీ ఆచార్య విజ్ఞానంద్ యితరుల సాయంతో వచ్చాడు.

"ఇదే నా ఆఖరిచిత్రం!" అని చూపాడు బదరీనారా యణ.

అందరూ దానిని చూచి అద్భుతానంద పరవశు లయ్యారు. వాళ్ళ హృదయాలు బ్రహ్మానందంలో మునిగి పోయాయి. భక్తి పారవశ్యంలో మునిగిపోయినట్లు, ఆచిత్రం వంక నిశ్చల దృష్టితో చూడసాగారు. "నీవింకేమీ చిత్రించ నవసరంలేదు బదరీ, నీజీవితంలో మకుటాయమానమైన చిత్రం

యిది. మేమంతా బుద్ధునిపట్ల అచంచల విశ్వాసంతో, భక్తి ప్రపత్తులతో, ఆయన ఆజ్ఞాబద్ధులమై వ్యవహరిస్తున్నాంకాని, నీవు ఆయన్ను సజీవుణ్ని చేశావు. ఆయన్ను నీవు పూర్తిగా జీర్ణింపజేసుకొన్నావు. ఆయన అంతరంగపు లోతుల విలువల్ని తెలుసుకోగల్గావు. నీవు చాలా అదృష్టవంతుడవు, బదరీ. బుద్ధుడు నీకు కేవలం ఒక ఆదర్శజీవిమాత్రమే కాదు. సజీవుడైన సహాధ్యాయిగూడ. నిజంగా, నీవుకూడా ఒక లోకోత్తరపురుషుడవు బదరీ. నీకుమనసారా ప్రణామిల్లుచున్నాను.'' అని మనస్సులో మర్మం లేకుండా వ్యాఖ్యానించాడు ఆచార్య విజ్ఞానంద్.

రామగుప్తుడుకూడ కొన్ని సంవత్సరాల మౌనాన్ని చీల్చి బదరీతో మాట్లాడాడు.

''ఇది నిజమైన చిత్రలేఖనానికి చిహ్నం. బదరీ. ఇందులో సంగీతం వినిపిస్తోంది. లయజ్ఞానం స్పష్టంగా తెలుస్తోంది. మృదుమధుర కవిత్వం, మనోహరశిల్పం, మనోవికాసానికి దోహదపరచే నాట్యం, అన్ని లలితకళలూ దానిలో ద్యోతకమౌతున్నాయి. ఇదే ఉత్తమోత్తమమయిన చిత్రణ.

"మీరు నన్ను పొగడుతున్నారు'' అని కలవరపడుతూ బదరీనారాయణ గోపీకుమార్ తనచెయ్యి బదరీనారాయణ భుజముమీద వేశాడు. అతనేం మాట్లాడకపోయినా అతని చేయి గుప్పిట అతనిలోని యేదోభావాన్ని స్పష్టీకరిస్తోంది.

దేవపాల్ తన కవిత్వం ప్రారంభించాడు.

''ఓహో... మానసికోల్లాసినీ, సంతోషం...

హృదయాంతరాళంలో బ్రహ్మానందం కలిగించే సౌందర్యం!

అవాంతరాల మునిగిఉన్న ప్రపంచాన్ని అవలీలగ దాటించే ప్రశాంతత ఓ శాంతి విధాతా! అదే తృప్తి.

మేము నీకు జోహారు చేస్తున్నాము... మేము నీలో...

బుద్ధం శరణం గచ్ఛామి,

ధర్మం శరణం గచ్ఛామి;

సంఘం శరణం గచ్ఛామి;

చాలాసేపటివరకూ నిశ్శబ్దం తాండవం చేసింది.

"దీన్ని ఏమని పిలుస్తావే?" అని మహర్షి విజ్ఞానంద్ ప్రశ్నించాడు.

"పద్మపాణి అవలోకితేశ్వరుడు."

"అవును బాగుంది. ఈ విహారాన్ని పద్మపాణి విహార మని పిలిస్తే బాగుంటుంది. అందరినీ ఉత్తేజితుల్ని చేస్తుంది. అజంతాకే నూతనశోభ చేకూరుస్తుంది..."

# 42

బదరీనారాయణ వాఘురానది వొడ్డున నుంచుని నదీ ప్రవాహాన్ని తిలకిస్తున్నాడు. గతించిన గాథల స్మృతులు ఒక్కసారి గుర్తుకొచ్చాయి. ఒకదానితర్వాత ఒకటి అన్నీ మనసులో మెదలి మళ్లీ మరుగున పడిపోయాయి. కాని భావ నిశ్చలతలో ఎలాంటి చలనమూ కలగలేదు. ఎన్నో చిత్రాలు అతని కళ్ళముందు నాట్యమాడాయి. అంతలోనే ప్రక్కకు వొదిగిపోయాయి. మళ్ళీ తన తండ్రి - ఆయన ఆదర్శాలు జ్ఞప్తికొచ్చాయి. ఇంద్రదత్తు జ్ఞాపకానికొచ్చాడు. ఉజ్జయినీ కాంతలు, తన దుష్టజీవితం - ఒక చోటునుంచి మరొక చోటుకు తరలిపోయిన దృశ్యాలు, అజంతాకు తన రాక, ప్రేమానంద్‌గా ప్రేమకుమారితో పరిచయం, కనుల ఆమె నాట్యభంగిమలు, అతనిలో చెలరేగిన మోహావేశం,

ఆచార్య పద్మదత్ కళాబోధలు; రామగుప్తుడు గ్రంథ రచన చేస్తున్నట్లు తరువాత భయంకరమైన కలరావ్యాప్తి; తనకు తెలిసినవారెందరో మరణించిన దృశ్యాలు - ఒక స్త్రీ తన సౌందర్యాన్ని తీర్చి దిద్దుకోవటం - ఎద్దుల కుమ్ములాట ఆనంద్, చనిపోతున్న రాణి, బుద్ధుని దివ్యశక్తి ప్రభావం పద్మపాణి ... తన కొడుకు కమలానంద్ ...

ఇలా అన్నీ బదరీనారాయణకు గుర్తుకొచ్చినై. ఎలా గుర్తుకొచ్చాయో, అలాగే ప్రక్కకు తప్పుకున్నాయి. బదరీ అక్కడే నుంచొని ప్రకృతి రామణీయకతను, కొండల్నీ, లోయల్నీ, ఏడుపాయలుగా చీలిపడుతున్న జలపాతాల్నీ అవలోకిస్తున్నాడు. వినీలాకాశం, నిట్టంగా వున్న పర్వత శిఖరాలు, మనోహరమైన పచ్చదనం అన్నిటినీ తృప్తిగా వీక్షించాడు.

అదంతా ఒక సుందర మందిరం అందులో బాధా వుంది, బ్రహ్మానందమూ వుంది. బదరీనారాయణకు తృప్తి కలిగించింది.

మధ్యాహ్నమల్లా సాయంత్రమయింది. సూర్యాస్తమయమవుతున్నా, బదరీనారాయణ అక్కడే నుంచొని, నది సృష్టీకరించే వేదాంతంగురించి యోచిస్తున్నాడు. అదే నిర్మలానందం!

అతనికి ఆత్మీయులు-సాన్నిహిత్యం, ప్రేమ, సౌఖ్యం!

చీకటి అతన్ని చుట్టుముట్టింది. అయినా బదరీ చలించలేదు. అలా చూస్తూనేవున్నాడు.

చీకటిలో ఎవరైనా ఏం చూడగలరు? ఎవరికేం కనిపిస్తుంది? కాని బదరీనారాయణ చూడగల్గుతున్నాడు. వినీలాకాశానికి వెనుక, కాలమనే అవధుల కవతల ఏదో చూడగల్గుతున్నాడు....

... ... ...

ఏమిటది?

— సమాప్తి —

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA/102B148 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 251 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, BCI, 244 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినవది | khasim |
| పేజీలు విడదీసినవది | nandini |
| స్కాన్ చేసినవది | Haseema |
| పరీక్ష చేసినవది | ROHIHT |
| పేజీలు సరిచూసినవది | |
| బైండింగు చేసినవది | |
| ప్యాకింగు చేసినవది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | no |
| పరిస్థితి | good |